# నారద భక్తి సూత్రములు

అనువాదకులు :

శ్రీ దొడ్ల వేంకటరామరెడ్డి,

కావలి.



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# అంకితము

సీ. అవతరించె నెవండు ॥ వివిధమతార్థంబు
సమరసంబొనరించి ॥ చక్కఁబెట్ట
వివరించె నెవ్వండు ॥ వేదాంత తత్త్వంబు
దేఁటపల్కుల తేనె ॥ తీపులుగాఁ
సవరించె నెవ్వండు ॥ సన్న్యాసి పథకంబు
జిష్ణూహాడ్బ్చ లోకంబు ॥ ప్రేమమంద
ఎక్కించె నెవ్వండు ॥ హిందూమతశ్రీనిఁ
ప్రాపంచికపు సార్వభౌమపీఠి

తే. గీ. అట్టి రామకృష్ణపరమహంసవర్యు
చరణ రాజీవ సన్నిధి ॥ సంఘటింతు
విశద ఋషి చిదానందాబ్ధివీచికాత్త
భక్తి సూత్రమంజరి దీనిఁ ॥ బరమభక్తి.

# విజ్ఞాపనము

(1) ఈ భక్తిసూత్రములు శ్రీ నారదమహర్షి ప్రణీతంబులని యీ గ్రంథము తెలుపుచున్నది. నారదుని పేరు "ఋగ్వేదము"లోఁ గలదు. బ్రహ్మమానసపుత్రులలో నొకఁడని "మనుస్మృతి" తెలుపుచున్నది. ప్రకృతబ్రహ్మయొక్క యీ కల్పమందు శ్రీ మహావిష్ణువు 21 అవతారము లెత్తుననియు, అందులో నిప్పటికి 20 అవతారములు పూర్తియయ్యె ననియు, వానిలో మూఁడవ యవతారము నారదావతారమనియు భాగవతము తెలుపుచున్నది. మఱియు నారదుఁడు పూర్వజన్మమందు దాసీపుత్రుఁడుగా జన్మించి బాల్యమందే మహాత్ముల సేవాభాగ్యము వడసి మఱుజన్మంబున మహర్షియయ్యెనని పురాణవచనము. ఈ నలువురు వేఱు వేఱు వ్యక్తులా? ఏకవ్యక్తియా? అనునట్టి విషయమై యిదానీంతనులలో మతభేదముగలదు.

(2) నారదుని యుపదేశవచనము లేనట్టి పురాణమే కలుగదు. ఆ యుపదేశంబులను జూచినచో నారదుఁడు మహామహుఁడని స్పష్టమగును. మఱియు వాని యుపదేశంబులు మనుష్యుల యోగ్యతానుసారముగా నుండును. అట్టి యుపదేశకుఁడు లోకగురువనుట యతిశయోక్తిగాదు.

(3) నారదశబ్దమునకు "పరమాత్మ విషయకజ్ఞానము నిచ్చువాఁడు" అని యర్థము. ఈ పేరు వానియందెంతయు సార్థకమగును. నారదశబ్దమునకు "కలహాభోజి" అనునట్టి యర్థముగలదు. అనఁగాఁ దగవులుపెట్టి తమాషాచూచువాఁడని భావము. అందులకు నిదర్శనముగఁ గొన్ని పురాణ కథలను జూపెదరు. నారదమహర్షి జితేంద్రియుఁడును, సమదర్శియు,

త్రికాలజ్ఞుఁడు నగుటయేకాక, అధికార పురుషుఁడగును. అట్టివాఁగ్, తగ వులుపెట్టుననుట సమంజసముగాదు. ఆ మహర్షి లోకకల్యాణ తత్పరుఁడై సంచరించుచుండును. ఆ సంచారములలో దీనాదులకురానున్న ముప్పును వారికి ముందుగఁ దెలుపును. వారు వారి భావిదురవస్థను దగుమార్గంబునఁ దప్పించుకొని మేలుపడయుటకు మహర్షిగారి హెచ్చరికలు ఎంతయు నవకాశమిచ్చును. దుర్మతులు భోగ్యకర్మవశులై విపరీతమార్గంబులఁ ద్రొక్కి నశించుట మహర్షి భావము గానేరదు. మహాకష్టములలోఁబడి మ్రగ్గుచున్న వారి నెందఱనో మహర్షి గారుద్ధరించి యున్నారు. ఆ మహాత్ముని మహోప దేశంబులను దలతో గ్రహించినవారు కృతార్థులు గాక మానరు.

(4) నారదోపదేశంబులు వివిధ పురాణాంతరంబులందుఁ గలవు. వానినెల్లసేకరించి యొక సంపుటముగ నుద్ధరించినచో నెంతయు లోకోప కారమగును.

(5) ఈ భక్తి సూత్రంబులకు శ్రీరామకృష్ణపరమహంస గారి శిష్యపరంపరలో నొకఁడైన శ్రీత్యాగీశానందస్వామిగారు, ఆంగ్లభాషలో వ్యాఖ్యానమును రచించిరి. దానిని చెన్నపురి శ్రీరామకృష్ణమఠము వారు 1943-వ సంవత్సరమున గ్రంథరూపంబున బ్రకటించిరి. ఒక ప్రతిని తే 13-10-1943 దిన నేను విలిచి పెక్కుపర్యాయములు చదివితిని. శ్రీ స్వామివారి మేధాశక్తి, యుక్తాయుక్తవిచారదక్షత, సాధక బాధక పూర్వక యథార్థనిర్ణయ కుశలత, సర్వజనబోధక వాక్సౌలభ్యము, నా హృదయంబును హరించెను. ఈ భక్తి సూత్రంబులను దరిచి సారంబును పిండి నిగ్గుదేల్చి యమృతంబును జూఱలిచ్చి నందులకై వారికి లోకము కృతజ్ఞతాబద్ధమైయున్నది.

(6) ఈ సూత్ర భావంబులను దెనుఁగులో వ్రాసి ప్రచురింపవలసిన దని నా మిత్రులు కొందఱు కోరిరి. శ్రీ స్వామివారి భావంబులను యథాస్థితి

వివరింప నాకుశక్తి లేకున్నను మా మిత్రుల ప్రోత్సాహంబు నూఁతగొని నేను గ్రహించినంతలో వ్రాయనైనంత మాత్రము వ్రాసితిని. నా వ్రాఁతలో కొంతభాగము 1948-వ సంవత్సరములో 'శ్రీరామకృష్ణప్రభ' యను మాస పత్రికలో వెలువడి నిల్చిపోయెను. ఆ గ్రంథస్థితి యట్లగుట నాచిరమిత్రులను సార్థకనామధేయులునైన శ్రీ కందుకూరి మల్లికార్జునముగారు సహింపలేక శ్రీరామకృష్ణమఠము వారిని ప్రోత్సహించిరి. ఆ ప్రేరణ ఫలంబుగ నేఁడీగ్రంథము వెలువడెను. చేయువానికన్నఁ జేయించువారు తక్కువకారు గావున, ఆ యిరువురకు నా మనఃపూర్వక కృతజ్ఞతాభివాదనంబులు సమర్పించుచున్నాను.

ఇట్లు,
విధేయుఁడు,
దొడ్ల వేంకటరామరెడ్డి

తే 7-12-53 ది,
కావలి.

# నారద భక్తి సూత్రములు



## ప్రథమాధ్యాయము

సూ. అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః

అథ = ఇప్పుడు, అతః = కాబట్టి, భక్తిం = భగవంతునియెడ నుండవలసిన ప్రేమతత్త్వమును గూర్చి, వ్యాఖ్యాస్యామః = వివరించుచున్నాము.

ఈ సూత్రమందలి అథ అను పదము అధికారమును సూచించుచున్నది. అధికారమనఁగా యోగ్యత. అది యెట్టిదందురా? భగవద్భక్తి తత్త్వమును గ్రహించుటకుఁగా నుత్తమమైన మనఃస్థితిని గలిగియుండుట యధికారమనఁ బడును. అట్టి మనస్థితిని గలిగినవాఁడు అధికారి యగును.

ఏ విషయంబైనను మదికెక్కుటకు (1) ఆ విషయంబును దెలిసికొనవలయుననెడి ఇచ్ఛయు (2) దానిని గ్రహించు శక్తియు (3) అందులకు అనుకూల పరిస్థితులు— ఈ మూఁడు నుండవలయును. వట్టి యిచ్ఛ యున్నంతనే ఫలములేదు. అది తీవ్రమైనదిగా నుండవలయును. ఇచ్ఛతోడ గ్రహణశక్తియు నుండవలయును. ఈ రెండు నున్నను

బరిస్థితులు ప్రతికూలములగునేని కార్యసాధనంబునకు నడ్డంకులు గలుగును. ఈ విషయమునుగూర్చి శ్రీ శంకరభగవత్పాదులవారు తైత్తిరీయోపనిషత్తు భాష్యమున స్పష్టముగాఁ దెలిపిరి.

పైనిఁజెప్పిన మూఁడు నుండియు శ్రద్ధలేనిచో ఫలము గలుగదు. గురువచనమందును శాస్త్రవచనమందును నిష్కళంకవిశ్వాసము శ్రద్ధ యనఁబడును. ఈ నాల్గు సామాన్య లక్షణములు. ఇవి గాక విశేషలక్షణంబులు కొన్ని గలవు. అవి యాయా విషయములనుబట్టి యుండును. ఎట్లనఁగా:—

(1) బ్రహ్మజిజ్ఞాసకు వివేకము, వైరాగ్యము, శమాది షట్కసంపత్తి, ముముక్షుత—ఈ నాల్గు ముఖ్యములని శ్రీ శంకర భగవత్పాదులవారు నొక్కి వచించిరి. ఈ నాల్గింటిని సాధనచతుష్టయంబనిరి. (2) జైమిని మహర్షి మీమాంసాశాస్త్ర సూత్రములను రచించిరి. ఆ శాస్త్ర జ్ఞానమును గోరువారికి సమగ్రవేదాధ్యయనము ముఖ్యమని మీమాంసకులు వచింతురు. (3) వేదాధ్యయనంబునకు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులునను మూఁడు వర్ణముల వారు మాత్రమే యర్హులనియుఁ దదితరులు తగరనియుఁ గూడ వేదాంతులును మీమాంసకులు నుభయులు నేకగ్రీవముగా సిద్ధాంత మొనర్చిరి.

కాఁబట్టి యొక్కొక్క శాస్త్రంబునకు నొక్కొక్క విధమైన యోగ్యత వలయునని, అట్టి యోగ్యత గలవారే

యా శాస్త్రంబు నభ్యసింప నధికారులనియు నేర్పడుచున్నది. లోకానుభవముగూడ అట్లే తెలుపుచున్నది.

భక్తి మార్గమునకు వలసిన యోగ్యతలు వేదాంతాదులకువలె నంతకాఠిన్యంబులు గాకపోవుటయేగాక సర్వజన సౌలభ్యంబుగాఁగూడ నున్నవి. ఎట్లనిన : (1) భక్తి మార్గమునం దెల్లరకు నర్హతగలదు. ఎవరికిని నిందు నిషేధము లేదు. భగవదనుగ్రహమందు విశ్వాసంబును, భగవదనుగ్రహంబువలన జననమరణరూపసంసారమునుండి ముక్తి గలుగునవెడి నిశ్చయమును ఈ రెండుఁ గలవారెల్లరు భక్తి సూత్రములను జదువుటకును భగవద్భక్తి మార్గంబు ననుష్ఠించుటకుఁ బరమయోగ్యు లగుదురు. (3) భక్తినవలంబించుటకు నెట్టి చదువులు నవసరములేదు. నిరక్షరకుక్షియైన నగుఁగాక, పరమపాపియైన నగుఁగాక; పైనఁజెప్పిన రెండు లక్షణంబు లున్నచోఁ జాలును.

ఈ విషయమై శ్రీకృష్ణభగవానుఁడు గీతలో నిట్లు విస్పష్టముగాఁ బల్కుచున్నాఁడు :

శ్లో. "అపి చేత్సుదురాచారో
భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మంతవ్యః
సమ్యగ్వ్యవసితో హి సః ॥ 9-30

శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా
శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,

కౌంతేయ ! ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి ॥ 9-31

శ్లో. మాం హి పార్థ వ్యపాశ్రిత్య
యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా
స్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥'' 9-32

(పూర్వ దురితవాసనలు ప్రారబ్ధజన్మంబున నెంత గాఢముగా నుండిన నుండనిమ్ము. ఏదో యొక భాగ్యోదయముచేత ఎప్పుడు నాయెడ నేకాంత భక్తి నవలంబించునో యప్పుడే సాధువగుచున్నాఁడు. అంతియగాదు, ఆ వ్యవసాయ ఫలంబుగా వాఁడు చిరకాలార్జితమైన వాని యధర్మత్వము నుండితొలఁగి బహుశీఘ్రముగా ధర్మాత్ముఁడై విషయభోగము లందలి యాశను వీడి శాంతినొందుచున్నాఁడు. తెలియక తప్పుచేసినవారు, అనఁగా ఆగంతుకదోషదుష్టులు, భగవద్భక్తివలనఁ గృతార్థులైన నగుదురుగాక అనియు, స్వాభావికదోషదుష్టుల సంగతి యేమనియు శంకింపవచ్చును. దుష్టులు జాతిదోషదుష్టులనియు, అసంస్కారదోషదుష్టు లనియు రెండు తెగలుగాఁ గలరు. అంత్యజాతివారు మొదటి కోటికిఁ జేరుదురు. సంస్కారము నొందని స్త్రీలును వైశ్యులును శూద్రులును రెండవకోటికిఁ జేరుదురు. ఈ యిరు తెగలవారు సయితము నన్ను శరణుజొచ్చిరేని వెనువెంటనే సంస్కృతులై క్రమక్రమముగా నుత్తమగతిని బడయు

చున్నారు. వేయేల! పార్థా! నా భక్తులకు నెన్నఁడును నాశనములేదు. ఈ మాట ప్రతిజ్ఞాపూర్వకముగాఁ జెప్పు చున్నాను. వినుము. ఈ సంగతిని ముల్లోకములఁ జాట వచ్చును.)

శాండిల్య మహర్షి యిట్లు చెప్పుచున్నాఁడు: 'ఆనింద్యయోని అధిక్రియతే పారంపర్యాత్ సామాన్యవత్'— అంత్యజాతివారు మొదలుకొని యుత్తమజాతివారి వఱకు, వారు వీరనక యెల్లరును భక్తిమార్గము ననుష్ఠించుటకు యోగ్యులే యగుదురు. భక్తజనపరంపరను జూచినచో నిది స్పష్టమగును. అహింసయు సత్యమును భగవద్భక్తియు నొకరి సొమ్ముగాదు. ఇవి సర్వసాధారణంబులు.

శ్రీ శుకమహర్షి యంతటివాఁడు భగవత్ప్రిణామము నిట్లు గావించెను:

'కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
ఆభీర కంకా యవనాః కసాదయః
యేఽన్యే చ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః.'
—భాగ, 2-4-18.

మ. 'యవన వ్యాధ పుళింద హూణ కష కం
కాభీర చండాల సం
భవులుం దక్కిన పాపవర్తనులు నే
భద్రాత్ము సేవించి భా

గవత్ర్శేష్ఠుల డాసి శుద్ధతనులై
కళ్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదు మదిలో
నశ్రాంతముఁ మ్రొక్కెదన్.'

(కిరాతులు, హూణులు, ఆంధ్రులు, పుళిందులు, పుల్కసులు, ఆభీరులు, కంకులు, యవనులు, కషాదులు—వీరెల్లరును సహజ మహాపాపులు. వీరేగాక మఱియెట్టి పాపాత్ములైనను భగవద్భక్తు లగుదురేని వారి పాదంబులకు మ్రొక్కి పునీతుఁడ నగుచున్నాను. ఎట్లందువా? స్వామీ! నీ భక్తులకు మ్రొక్కుట నీకు మ్రొక్కుటే యగుఁగదా?)

మఱియు నందనారు, చోకమేలుడు, రవిదాసు, కణ్ణప్ప, తిరుప్పానాళ్వారు, తిరుమంగై ఆళ్వారు మున్నగు భక్తు లెందఱో యంత్యజాతివారు గలరు. మీరాబాయి, అవ్వయారమ్మ, ఆండాళమ్మ మున్నగు భక్తురాండ్రును గలరు. వీరెల్లరు భగవంతుని భక్తింగొలిచి కృతార్థత నొందిరి.

ఆదినుండి భక్తిచేసినవారి సంగతి యటుండనిమ్ము. మొట్టమొదట నెంతో దురాచారులుగానుండి నడుమ భక్తి చేసినవారి సంగతి యే మందురా? అందులకు — అజామిళుఁడు, రత్నాకరుఁడు, తొండరప్పొడియాళ్వారు, 'నారాయణీయ' మను పేరి యుద్గ్రంథమును, భక్తిరసంబును వెదజల్లుదానిని రచించిన నారాయణభట్టు, బిళ్వమంగళుఁడు

మున్నగువారే నిదర్శకులు. వీరెల్లరును మొదట మహా దుష్టులుగా నుండి చేయరాని కార్యంబు లెన్నో చేసి పదం పడి భగవంతునకు భక్తిచేసి తాము కృతార్థు లగుటయే గాక, భగవద్భక్తి యెంత పాపాత్ముల నైనను బునీతుల నుగాఁ జేయుననెడి విషయంబును, తామే నిదర్శనమగు నట్లుగా, లోకంబునకుఁ జాటిరి.

అక్షరజ్ఞానము లేకున్నను, ఎట్టి చదువులు చదువ కున్నను భగవద్భక్తి యొక్కటి గల్గునేనిఁ దప్పక కృతకృత్యు లగుదు రనుటకు మహాత్ములు కబీరు, నానక్కు, తుకారాం మున్నగువారే నిదర్శనము. కాఁబట్టి భక్తియోగంబునకు జాతి, మత, లింగాది నియతిగాని మఱి యెట్టి నియతిగాని గలుగదు. భగవంతునియెడఁ బూర్ణవిశ్వాసం బొక్కటి యుండినఁ జాలు.

అట్లనుటవలన నితరయోగ్యతలను నిషేధించుటగాదు. పూర్ణవిశ్వాసంబునకుఁ దోడుగా నితర సంపత్తి గల్గునేని యీాప్సితార్థము శీఘ్రఫలకారి యగును.

భక్తియోగంబునకు వివేకము, విమోహము, అభ్యా సము, క్రియ, కళ్యాణము, అనవసాదము, అనుద్ధర్షత— ఈ యేడును ముఖ్య పూర్వాంగంబులగునని శ్రీ రామాను జులవారు నుడివిరి. హితాహితాహారపదార్థజ్ఞానము వివేక మనియు, ఆశారాహిత్యము విమోహమనియు, అనుష్ఠానము అభ్యాసమనియు, పరోపకారము క్రియయనియు,—సత్యము, ఋజువర్తనము, దయ, అహింస, దానము—ఇవి కళ్యాణ

మనియు, సంతోషముగా నుండుట అనవసాదమనియు, ఉద్వేగము లేకుండుట అనుద్ధర్షమనియు శ్రీ రామానుజాచార్యులవారి తాత్పర్యము. ఇవియు నున్నచో భక్తి యోగము శీఘ్రఫలకారి యగును.

'అతః':

'అతః' (కాఁబట్టి) యనునది పై సూత్రములో రెండవ పదము. జ్ఞానయోగము, కర్మయోగము ననునవి యుండఁగా, వానికి సూత్రములను రచించు తలంపు మాని భక్తియోగమునకు శ్రీ నారదమహర్షి యిట్లు సూత్రములను వ్రాయుటకుఁ గారణమేమో యను సంశమును 'అతః' అను పదము సూచించుచున్నది. సూచ్యార్థ మేమిగా నుండునో యని విచారించినచో నిట్లు తోఁచుచున్నది :—

1. భగవత్సాక్షాత్కారంబునకును, దన్మూలకంబుగా సంసారనివృత్తికిని భక్తిమార్గము చాలును. 2. అది మూఁడు మార్గములలో సులభమార్గము. 3. ఆ మార్గము సర్వప్రాణి వర్గమునకు నందుబాటులో నున్నది. 4. జ్ఞానమార్గంబునకు గూడ నయ్యది తోడ్పడుచున్నది. 5. జీవాత్మ పరమాత్మలకుఁ గల పరస్పర ప్రేమాతిశయముయొక్క రసానుభూతికై జ్ఞానులు సయితము ఆత్మసాక్షాత్కారానంతర మప్పుడప్పుడు భక్తిచేయుదురు. 6. ఈ భక్తిరసానందంబును అన్యులఁ గూడి నేను సయితము పొల్గొందుఁగాక.—అను భావంబులు నారద మహర్షిని ఈ భక్తిసూత్రరచనకుఁ బ్రేరేపించియుండునని యూహింపనగును.

## 'వ్యాఖ్యాస్యామః':

'వ్యాఖ్యాస్యామః' = వివరించుదము అని యర్థము. పూర్వమే యొక గ్రంథ మున్నచో దానికి వివరణంబును వ్రాయనగును. ఈ భక్తిసూత్రముల గ్రంథము తత్పూర్వము లేదు. భక్తినిగూర్చిన గ్రంథ మేదైన నొకటి యుండి యున్నను, దానికిని దీనికిని రూపంబునఁగాని, విషయప్రతిపాదనంబునఁగాని ఎట్టి సామ్యమును గలుగదు. కావున 'వ్యాఖ్యాస్యామః' అనుదానికి నిచ్చట అక్షరార్థమును గ్రహింపరాదు. ఈ గ్రంథమును తాను గ్రొత్తగా సృష్టింపలేదనియు, భక్తుల స్వానుభవంబులనుగూర్చిన వివరణమే భక్తిశాస్త్రం బగుననియు, అది యుక్తి నాధారముచేసికొని యల్లినట్టి తత్త్వశాస్త్రము కాదనియు, భక్తివిషయంబునఁ దన యనుభవంబు లేవో తెలుపుచున్నాననియుఁ బాఠకులు గ్రహించుటకై శ్రీ మహర్షి యీ పదంబును బ్రయోగించి యుండునని భావింపనగును.

శాస్త్రరచన రెండు విధములు. అనుభవజ్ఞులు వారి యనుభవంబులను లోకోపకారార్థము గ్రంథరూపంబునఁ గూర్చుట యొక విధము. అనుభవజ్ఞులు కూర్చిన గ్రంథములను జదివియో వినియో కొంత సామగ్రిని సేకరించి, యుక్తి నాశ్రయించి కొంత చేర్చి రూపం బేర్పఱచుట మఱియొక విధము. ఈ గ్రంథము రెండవకోటికిఁ జేరినది గాదనియు, ఇందలి విషయమెల్ల స్వానుభవసిద్ధమే గాక, పెక్కుమంది మహాత్ముల యనుభవంబులవలనఁగూడ సముజ్జీవితమై

యున్నదనియు, 'వ్యాఖ్యాస్యామః' అను పదము సూచించు చున్నది.

గొప్ప విషయంబులనుగూర్చి వ్రాయునప్పుడు స్వానుభవజ్ఞానము లేనివారు వారి యజ్ఞానంబును గప్పిపుచ్చుటకై వింతవింత కథల నల్లుటయు, మహాత్ములు ప్రదర్శించిన ప్రభావంబులుగా నద్భుతంబులను జిత్రించుటయుఁ గలదు, అవి యెల్ల సత్యములే యని సామాన్యజనులు విశ్వసించి యామహిమలను సాధించుటకై కర్తవ్యమును వదలి యపమార్గమును ద్రొక్కి భ్రష్టులగుటయుఁ గలదు. అట్లుగాక స్వానుభవజ్ఞుఁడు గ్రంథమును రచించినచో నట్టి కథలకును వాని వలనఁ గలుగు ప్రమాదంబులకు నవకాశ ముండదు. శాస్త్ర రచనకు స్వానుభవజ్ఞులు మాత్రమే తగుదురు గాని శ్రుత పాండిత్యముగలవారు తగ రను భావంబునుగూడఁ బై పదము తెలుపుచున్నది.



## సూ. సా త్వస్మిన్ పర(మ)ప్రేమరూపా. 2

సా = ఆ భక్తి, తు = అయితే, అస్మిన్ = దీనియందు, పరమ ప్రేమరూపా = ఉత్తమమైన ప్రేమరూపముగా (భవతి = ఉన్నది).

### సా (భక్తి):

భగవద్భక్తి యనునది సాధనావస్థయందు 'అపరభక్తి' లేక 'గౌణభక్తి' యనియు, సిద్ధావస్థయందుఁ బరాభక్తి

యనియుఁ బేర్కొనఁబడుచున్నది. ఈ రెండవసూత్రము పరాభక్తినిగూర్చి చెప్పుచున్నది. ఈ సూత్రార్థమునుబట్టి పరాభక్తికిని దదితర నామమాత్రభక్తికిని గల భేదంబులను దెలిసికొని పరాభక్తికిఁ గల విలక్షణంబు లెట్టివో గ్రహింప నగును.

### తు :

'తు' అనునది వ్యతిరేకార్థకమును బోధించును. ఇచ్చట బోధింపవలసిన వ్యతిరేకార్థ మేమి? అని శంకింప వచ్చును. భయమునఁ గాని కామాతురులై గాని భూత పిశాచ దేవతాంతరంబులను గొల్చుట గలదు. అట్టిది భక్తి యెన్నఁడును గానేరదనియు, ఏది భగవత్సాక్షాత్కారంబును భగవత్ప్రేమానుభవానందంబును గూర్చునో యదియొక్కటే యుత్తమము, నిక్కము నైన భక్తియగుననియుఁ దెలుపుచు రెంటికిఁ గల తారతమ్యంబును బోధించుటకై 'తు' శబ్దము ప్రయోగింపఁబడెను.

భగవంతునియెడ భక్తి యెట్లో యట్లే భయము, ద్వేషము, మోహము—ఇవిగూడ ముక్తిదాయకంబులే యనియు, ఆ విషయంబును నారదులే భాగవతము సప్తమ స్కంధము (1-26) లో 'యథా వైరానుబంధేన మర్త్యస్త న్మయతామియాత్ । న తథా భక్తియోగేన ఇతి మే నిశ్చితా మతిః' అని చెప్పిరనియుఁ గొందఱ మతము. నితంతర ద్వేషము మనస్సు నెంత గాఢముగా భగవల్లీనము చేయునో

యంత గాఢముగా భక్తి చేయదని యీ శ్లోక తాత్పర్యము.*

ఈ శ్లోకమతము ప్రకృత సూత్రమతంబునకుఁ గేవలము విరుద్ధముగా నున్నది. భాగవతమందు మఱికొన్ని చోట్లఁ గూడ † ఇదేభావము గలదు. ఇది తన పరమమతము

---

* ఆ. వె. "అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైన బాంధవమునైన భీతి,
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ
జేరవచ్చు వేఱుసేయఁ డతఁడు". (స్క-౦. 7-I-25)

క. "వైరానుబంధనంబునఁ
జేరిన చందమున విష్ణుఁ జిరతరభక్తిం,
జేరఁగరాదని తోఁచును
నారాయణభక్తి యుక్తి నాచిత్తమునన్". (7-1-26)

శా. "కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేము నిజ చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!"
(7-1-39)

† శ్లో. "మన్యేఽసురాన్ భాగవతాం స్త్ర్యధీశే
సంరంభమార్గాభినివిష్టచిత్తాన్ ।
యే సంయుగేఽచక్షత తార్క్ష్యపుత్ర
మంసే సునాభాయుధమాపతంతమ్"॥ (స్క-౦.3-2-24)

శ్లో. "కామం క్రోధం భయం స్నేహ మైక్యం సౌహృదమేవ వా।
నిత్యం హరౌ విదధతో యాంతి తన్మయతాం హి తే"॥
(10-29-15)

గాదని తెలుపుటకై మహర్షి యీ సూత్రమందు వ్యతిరేకార్థకమైన 'తు' శబ్దమును ప్రయోగించెను. అట్లగుచో భాగవతమందలి యా ప్రాంతలకు గతియేమని యడుగవచ్చును. పై భాగవత శ్లోకములకు ప్రకృత సూత్రమతంబునకుఁ గల విరుద్ధము కేవలము నామమాత్రమే.

వలపు, భయము, ద్వేషము, సఖ్యములకును, భక్తికిని గల భేదము నారదమహర్షియే పై 'యథా వైరానుబంధేన' అను శ్లోకమునకుఁ దర్వాతి నాల్గవ శ్లోకములో స్పష్టముగా సూచించియున్నాఁడు. ముప్పదియొకటవ పద్యమున, మనము గమనింపఁదగిన ముఖ్యాంశము ఇట్లు చెప్పఁబడియున్నది : "తస్మాత్ కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్ —ఏ యుపాయమైన నగుఁగాక. ఎట్లో యొకట్లు మనస్సును కృష్ణునియందు లగ్నము చేయుము!" ఈ విధమైన తీవ్రమానసికలగ్నత ద్వేషభావమువలనఁగూడ కలుగుటకు వీలున్నది అనియే పై 'యథా వైరానుబంధేన' అను శ్లోకము తెలుపుచున్నది. వలన, నారదమహర్షి యిట శిశుపాలునిగూర్చి మాటాడుచున్నాఁడు.

శిశుపాలునకుఁ గృష్ణునియెడ ద్వేషబుద్ధి గలదు. అయినను అతఁడు సామాన్య పాపాత్ములవలె భగవంతుని ద్వేషించినవాఁడు గాఁడు. అతఁడు పూర్వజన్మంబున భగవ

---

శ్లో. "యత్ర యత్ర మనో దేహీ ధారయేత్ సకలం ధియా।
స్నేహాద్ ద్వేషాద్ భయాద్ వాపి యాతి తత్తత్సరూపతామ్"॥
(11-9-22)

ద్భక్తుఁడును గింకరుఁడుగా నుండెను. ఋషి శాపవశంబున వానికి ఆసుర భావము కలిగెను. అతఁడు భగవద్వియోగం బును సహింపలేక శాపంబును బ్రత్యాహరింపుమని యా ఋషినిఁ బ్రార్థించెను. ఆ ఋషియు వానిని గనికరించి 'ద్వేషివై మూఁడుజన్మంబులో, భక్తుఁడవై యేడుజన్మంబులో గడపి యనంతరము యథాస్థానమును జేరు'మని శాపమోక్షంబు ననుగ్రహించెను. అతఁడు దీర్ఘవియోగంబునకు నోపక మూఁడుజన్మంబుల కాలపరిమితినే వరించెను.

కనుక, శిశుపాలుని ద్వేషబుద్ధికి మూలము, దీర్ఘ కాలము భగవద్వియోగంబునకు సహింపనేరని యాతని తీవ్రభక్తియే!

బుద్ధి భగవల్లీనమగుట ప్రధానాంశము. 'అది ద్వేష పూర్వకముగా నైన నగుఁగాక, ఫలకారియే యగును. అదియే ప్రేమపూర్వకమైనచో నిఁకఁ జెప్పవలయునా?' యని భక్తిమార్గమును శ్లాఘించుటయే యగును. ఇదే భావంబును 'ఉక్తపురస్తాదేతత్ తే చైద్యః సిద్ధిం యథా గతః, ద్విషన్నపి హి గోవిందం కిముతాధోక్షజప్రియాః' (పరీక్షిన్మహారాజా! చైద్యుఁడు భగవంతుని ద్వేషించియు సిద్ధిపొందెనని చెప్పితిని. ఇఁకఁ బ్రేమించినవాని సంగతి చెప్పనేల?) అను శుకమహర్షి వచనము (భాగ. 10-29-13) స్పష్టము చేయుచున్నది.

మఱియు భాగవతమందే ఏకాదశస్కంధములో 'వైరేణ యం నృపతయః శిశుపాల పౌండ్ర సాల్వాదయో

గతివిలాసవిలోకనాద్యైః। ధ్యాయంత ఆకృతధియః శయనాసనాదౌ తత్సామ్యమాపురనురక్తధియాం పునః కిమ్ ॥'
అను వచనము సర్వసందేహంబులను దొలఁగించుచున్నది. (శిశుపాలుఁడు, పౌండ్రరాజు, సాల్వుఁడు మొదలగువారు భగవద్వేషులగుట లోకవిదితము. వారి ద్వేషభావము వారిని మైమఱచియుండనీయదయ్యెను. వారు పరుండినప్పుడైనను, కూర్చుండినప్పుడైనను, మఱి యే స్థితిలో నుండినప్పుడైనను, అనఁగా సర్వకాల సర్వావస్థలయందుఁ గృష్ణునే తలపోయుచుండిరి. అట్లు తలంచుచుండుట కృష్ణునియందుఁ బ్రేమంజేసిగాదు. వానివలనఁ దమ కెప్పుడేమి ముప్పువచ్చునో యను భయంబున నిరంతరముఁ గృష్ణునియొక్క గతివిలాస విలోకనాదులందు మనోదృష్టిని నిల్పియుండిరి. వారట్లు భయముచేత నొనర్చినను వారి కయ్యది శుభమే యయ్యెను. వారి చెయిదంబులు ద్వేషభావపూర్వకంబులైనను వారి హృదయంబు లెట్లో యొకట్లు భగవంతునందు నిల్చినందున వారికి భగవత్ప్రాప్తి కల్గెను. ద్వేషబుద్ధితో భగవంతునిఁ దలంచినవారికే యట్టి శుభగతి గల్గె నన్నప్పుడు ప్రేమ భక్తుల సంగతి చెప్పనేల ?)

ఈ విషయమై యింకను వివరముఁ గోరువారు భగవద్గీతా నవమాధ్యాయము 12-వ శ్లోకమునకు (శ్రీ) మధ్వాచార్యులవారు వ్రాసిన భాష్యమును, దానిపయి జయతీర్థులవారు రచించిన వ్యాఖ్యను జూడనగును, 'విద్వేషాదపి గోవిందం దమఘోషాత్మజః స్మరన్। శిశుపాలో గతః స్వర్గం కిం పునస్తత్పరాయణః॥' అని అత్రిస్మృతి. (దమఘోషుని

సుతుఁడు శిశుపాలుఁడు గోవిందుని ద్వేషించియు స్వర్గము నొందెను. భగవత్పరాయణుల సంగతి వేఱ చెప్పనేల ?) ఈ వచనముగూడఁ బైనఁ జెప్పిన భావమునే యుపపాదించును.

సారాంశమేమి ? ముక్తికి భక్తిమార్గ మెంతో సులభో పాయమని సారాంశము. భక్తియందు హృదయము రసార్ద్ర మగును. అందువలననే భక్తిరస మనిరి. ద్వేషమం దట్లు గాదు. భక్తి ద్వేషభావంబులు పరస్పర విరుద్ధములు.

భగవద్ద్వేషులు ఆత్మఘాతులై నశింతురని భగ వంతుఁడే గీతలలోఁ దెలిపియున్నాఁడు. చూడుఁడు :

శ్లో. మా మాత్మపర దేహేషు
ప్రద్విషంతోఽభ్యసూయకాః,
తా నహం ద్విషతః క్రూరాన్
సంసారేషు నరాధమాన్.
క్షిపా మ్యజస్ర మశుభా
నాసురీ ష్వేవ యోనిషు.
—శ్రీ మద్భగవద్గీత, అ. 16, శ్లో. 18. 19.

మఱియు

శ్లో. మజ్జంతి పితర స్తస్య నరకే
శాశ్వతీ సమాః.
యో ద్విష్యాద్ విబుధ శ్రేష్ఠం
దేవం నారాయణం హరిమ్.

శ్లో. కథం నామ భవే ద్ద్వేష్య
ఆత్మాలోకస్య కస్యచిత్,
ఆత్మాహి పురుష వ్యాఘ్ర
జ్ఞేయో విష్ణు రితి శ్రుతిః. *

అని భారతములో నారాయణీయఖండము చెప్పుచున్నది. శాండిల్య మహర్షి గూడ ఈ సంగతిని స్పష్టీకరించెను.

భక్తి యనునది ప్రేమపూర్వకమే యగుననుట అనాదిసిద్ధము. అందులకుఁ గొన్ని నిదర్శన వాక్యములు :

1. అనన్య మమతా విష్ణౌ మమతా ప్రేమ సంగతా,
భక్తి రిత్యుచ్యతే భీష్మ ప్రహ్లాదోద్ధవ నారదైః.
—నారద పాంచరాత్రము.

తా. భగవంతుఁడు నావాఁడనెడి మమకారము భక్తి యగునని భీష్ముఁడు, ప్రహ్లాదుఁడు, ఉద్ధవుఁడు, నారదుఁడు—వీరెల్లరుఁ బల్కిరి.

2. సర్వోపాధి వినిర్ముక్తం తత్పరత్వేన నిర్మలమ్,
హృషీకేణ హృషీకేశ సేవనం భక్తి రుచ్యతే.

---

* ఎవరు భగవంతుని ద్వేషింతురో వారే గాక వారి తలిదండ్రులు గూడ నరకములోఁబడి, యందు ఏండ్లు పూండ్లు పరితపింతురు. భగవంతుఁడనఁగా నాత్మయేగాని వేఱుగాదు. భగవంతుని ద్వేషించుట యనఁగాఁ దన యాత్మను ద్వేషించుటయే యగును. ఎవనికైనను వాని యాత్మ ద్వేష్యమగునా ?

తా. సర్వేంద్రియములకు నధిష్ఠానమైన భగవంతుని, నిర్మలములైన యింద్రియములచేతఁ దత్పరబుద్ధితో ఫలాభిసంధిరహితముగా సేవించుట భక్తి యగును.

3. భక్తి రస్య భజనం; ఏత దిహాముత్రోపాధి నైరాశ్యే
నాముష్మిన్ మనఃకల్పమ్.

—గోపాలపూర్వతాపన్యుపనిషత్తు.

తా. భక్తి యనఁగా భగవత్సేవ యని భావము. ఆ సేవ యన్ననో ఇహలోక పరలోక సుఖాదుల నెవ్వాని నపేక్షింపక భగవంతునియందు మనస్సు లీనముచేయుటగా నుండవలయును.

4. మనోగతి రవిచ్ఛిన్నా హరౌ ప్రేమ పరిప్లుతా,
అభిసంధి వినిర్ముక్తా భక్తిర్విష్ణు వశంకరీ.

—నారద పాంచరాత్రము.

తా. మనస్సు ప్రేమార్ద్రమై తైలధారారూపంబున నిష్కామముతో భగవంతుని వంకకు నిరంతరము ప్రవహించుట భక్తి యగును.

5. యాప్రీతిర స్తి విషయే ష్వవివేక భాజాం
సైవాచ్యుతే భవతి భక్తిపదాభిధేయా
భక్తిస్తు కామఇవ తత్కమనీయ రూపే
తస్మాన్మునే రజని కాముకవాక్య భంగీ.

—ద్రమిడోపనిషత్సారసంగ్రహము.

వివరణము : అవివేకులు ఇంద్రియ సౌఖ్యంబులను బడయుటకై యెట్టి యాతురతను జూపుదురో యయ్యాతురము భగవంతునియెడఁ జూపినచో నది భక్తి యగును. విషయానందమునకైన విమోహంబునకును, భగవత్ప్రాప్త్యానందమునకైన విమోహంబునకును స్వగత భేదము లేదు గాని ప్రాప్యమునుబట్టి భేదము గలుగుచున్నది. విషయములు క్షణికంబులును, దుఃఖపర్యవసాయకంబులును నగును. వానికైన విమోహంబునకు నెట్టకేని ఫలంబు దుఃఖమే యగును. భగవంతుఁ డన్ననో తఱుగని యానందఘనము. దానంజేసి భగవంతునికైన విమోహంబునకు ఫలముగూడ తఱుగని యానందమే యగును. మునులు గూడఁ గాముకులే సుమా యన్నప్పుడు వారి కామము రెండవ విధమైనదిగా నున్నది. దానంజేసి యది శ్లాఘ్యమే గాని నింద్యము గాదు.

6. అన్యాభిలషితా శూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్,
ఆనుకూల్యేన కృష్ణానుశీలనా భక్తిరుత్తమా.
—భక్తిసారామృతసింధువు.

తా. ఎట్టి ప్రతిఫలమును గోరక జ్ఞానకర్మాదుల నాశ్రయింపక యంతరాయ మను మాటలేక యనుకూల పథంబును ద్రొక్కి శ్రీకృష్ణభగవానునిఁ బ్రీతిపూర్వకముగా ధ్యానించుట యను శీలమే భక్తి యగును.

7. ఇష్టే స్వారసికే రాగః పరమావిష్టతా భవేత్,
తన్మయీ యా భవేత్ భక్తిః సాత్ర రాగాత్మికాస్మృతా.

తా. ప్రతి వ్యక్తికి వాని యిష్టవస్తువునందు మొట్ట మొదట నొక విధమైన యనురంజనము జనించును. అది క్రమక్రమముగా గాఢమై రాగరూపము దాల్చును. అట్లు రాగము గాఢరూపము దాల్చినప్పుడు మనస్సు తన్మయ మగును. అట్టి మనోవృత్తిని భక్తి యందురు.

8. ద్రుతస్య భగవ ద్ధర్మాత్ ధారావాహికతాంగతా,
సర్వేశే మనసో వృత్తిః భక్తి రిత్యభిధీయతే.

—భక్తిరసాయనము.

తా. ఆధ్యాత్మికసిద్ధికిఁ గొన్ని నియమములు గలవు. ఆ నియమములను భగవద్ధర్మము లందురు. తద్ధార్మానుష్ఠాన బలంబున హృదయము కరగి రసరూపంబునొంది, యెడ తెరిపిలేని తైలధారవలె భగవంతుని వంకకుఁ బఱచును. అట్టి మనోవృత్తిని భక్తి యందురు.

శ్రీ శంకర భగవత్పాదులవారు వివేకచూడామణి గ్రంథమందు భక్తిస్వరూపంబు నిట్లు వర్ణించిరి :

9. స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే,
స్వాత్మ తత్త్వాను సంధానం భక్తిరిత్యపరేజగుః.

తా. నేను అన్నప్పుడు నేను అను దాని స్వరూప మేమో తెలిసికొనుటకుఁగాఁ జేయఁబడునట్టి నిరంతరవిచార మును భక్తి యని కొందఱందురు. ఆత్మపదార్థ యాథార్థ్య విచారతత్త్వమే|భక్తి యని మఱికొందఱి మతము.

10. దర్శనం పరభక్తిః స్యాత్ పరజ్ఞానం తు సంగమః,
పునర్విశ్లేష భీరుత్వం పరమా భక్తి రుచ్యతే.
—యామునాచార్యులు.

తా. భగవద్దర్శనము పరభక్తి యగును. ఐక్యము పరజ్ఞాన మగును. అట్టి యైక్యమునకు భంగము రాఁగూడ దనెడి యాకులపాటు పరమభక్తి యగును.

11. మద్గుణ శ్రుతిమాత్రేణ మయి సర్వగుణాశ్రయే,
మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభ సోంబుధౌ.
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్,
అహైతుక్యవ్యవహితా యాభక్తిః పురుషోత్తమే.
—శ్రీమద్భాగవతము, తృతీయస్కంధము.

వివరణము : సకల కల్యాణ గుణంబులకును నేను అధిష్ఠానమునై యున్నాను. నా కల్యాణ గుణంబులు చెవి సోకినంతనే హృదయము నా వంకకు నిరంతరము పఱచు చున్నది. ఈ హృదయ ప్రవాహము సింధువు వంకకు గంగా ప్రవాహమువలె నుండును. హృదయం బట్లు పఱచుటయందు గుణకార్యంబు లేశమాత్ర మేనియుఁ గలుగదు. అది కేవలము అహైతుకంబును అవ్యవహితంబునై యుండును. హేత్వంతరము లేమిం జేసి యీ మనఃప్రవాహంబును మరలింపఁ దరముగాదు. అది మహాతీవ్రమైన దగుటం జేసి దానికి నెవ్విధమైన యడ్డమును గలుగ నేరదు.

12. మాహాత్మ్య జ్ఞానపూర్వస్తు సుదృఢ సర్వతో౽ధికః,
స్నేహో భక్తిరితిప్రోక్త స్తయా ముక్తి ర్నచాన్యథా,
జ్ఞానపూర్వః పరస్నేహో నిత్యా భక్తిరితీర్యతే.

శ్రీ మధ్వాచార్యులు.

—మహాభారత తాత్పర్య నిర్ణయ గ్రంథము.

తా. భగవంతుని మాహాత్మ్యంబును సమగ్రముగా గ్రహించుటవలన వానియందుఁ దదన్యంబులకన్న నధికంబుగా నొకవిధమైన ప్రీతి సుస్థిరమగును. ఆ ప్రీతిని భక్తి యందురు. అట్టిదానివలన మోక్షము లభించును గాని యన్యంబువలన మోక్షము సిద్ధింపదు. ఏ స్నేహము జ్ఞానపూర్వకము నిత్యము నగునో యట్టి యుత్తమ స్నేహము భక్తి యగును.

చిత్తోద్రేకము భక్తి కాఁజాలదు. మతపాషండత్వంబును భక్తి కానేరదు. ఈ మతపాషండత్వమువలననే యంతరాంతర మతములు పుట్టగొడుగులవలె జనించుటయు, మతకలహంబు లుప్పతిల్లుటయు, రక్తపాతంబు లగుటయు లోకప్రసిద్ధము.

నామమాత్ర గురువులు గలరు. వారి మాటలను నమ్మి యంధప్రాయముగా వర్తించుట కలదు. అదియును భక్తి కానేరదు. అనుభూతి లేనివారు కేవల ప్రజ్ఞావిభవంబున వ్రాసిన గ్రంథములు గలవు. అందలి వ్రాఁతల నక్షరాక్షరంబుల విశ్వసించుటయు భక్తి గాదు. వేదంబులను వల్లించి చిలుకపలుకులు పల్కుచు గొప్ప యుపన్యాసంబు లిచ్చుట

గాని తర్కశాస్త్రంబులఁ బాఱచదువుటగాని తత్త్వశాస్త్ర విచారమందుఁ బ్రజ్ఞఁ జూపుటకాని భక్తి కాఁజాలదు.

ఈ రెండవ సూత్రమందలి 'సా' అను పదమునకు 'ఆ భక్తి' యని యర్థము. అనఁగా భక్తి యనునది లోక ప్రసిద్ధమైనదే గాని క్రొత్తగాఁ గల్పింపఁబడినది గాదని భావము. భక్తి యట్లు లోకప్రసిద్ధమైనదే యైనను దాని స్వరూపంబును దద్విశేషంబులు నెల్లరకు విస్పష్టంబులు గావు. ఎల్లరకు విస్పష్టము గానంత మాత్రాననే భక్తితత్త్వము శాస్త్రీయ పరిశోధనకు నందనిది కాదు. అట్టిదే యగునేని భక్తులకు నయ్యది యనుభూతి విషయ మెంతమాత్రము కానేరదు. భక్తిరసంబు ననుభవించిన మహాభక్తు లెందఱో గలరు. కాఁబట్టి భక్తియోగముగూడఁ దదితర యోగములవలె శాస్త్రీయ విచారదృష్టికి యోగ్యమైనదే యగును. అనఁగాఁ బ్రసిద్ధ భావసూచకమైన 'సా' అను పదమం దిన్ని యూహ లిమిడియున్నవి.

'పర(మ) ప్రేమరూపా' అను సమాసమందుఁ గూడ నెంతో భావము గర్భితమై యున్నది. భక్తి యనునది కేవలానుభూతియోగ్యమే గాని వేఱుగాదు. ఆ యనుభూతియు నలౌకికమగునే గాని లోకసాధారణము గాదు. భక్తికిని లోకసాధారణ ప్రేమకు నెంతో తారతమ్యము గలదు. భక్తి యిట్టిదని యూహించుటకు బుద్ధి శక్తి చాలదు; దాని స్వరూప మిట్టిదని చెప్పుటకు భాషాశక్తి చాలదు. అది బుద్ధికిని వాక్కునకును రెంటికి నందనిదై కేవలము అనుభూతిమాత్ర సిద్ధమై

నదిగా నున్నది. భక్తికిని ఆత్మానందమునకును భేదము లేదు. బ్రహ్మానందం బెట్లు అతీంద్రియమాత్రగోచరమో భక్తిరసానందముగూడ నట్లే అతీంద్రియమాత్ర గోచరమగును.

అతీంద్రియ విషయమును ఇంద్రియ సాహాయ్యంబున నిర్వచించుట సాధ్యముగాదనుట జగద్విదితము. విషయం బట్టి దుర్ఘటమైనదగుట నెఱింగియు నారదమహర్షి దాని తత్త్వంబును నిర్వచింపఁ బూనుట వెఱ్ఱితనముగాదా యని శంకింపవచ్చును. ఆ సంగతి మహర్షికి మనకన్న నెన్నో మడుంగులు స్పష్టము. మహర్షి ప్రయత్నము అనిర్వచనీయంబును వచింపఁ గడఁగుట గాదు. భక్తివిషయంబున తన యనుభవంబును బుద్ధికి గోచరించినంత, మాటకు నందినంత, లోకోపకారార్థము యథాశక్తి మహర్షి వివరించెను. 'పర(మ) ప్రేమరూప' అను సమాసమందలి 'రూప' అను శబ్దంబు చేతనే పై భావము సూచితమగును. ప్రేమ యనునది యెల్లరకు నంతయో యింతయో యనుభవవేద్యమే యనియు, భక్తి యనఁగా నుత్తమప్రేమ సాదృశ్యంబున భక్తి తత్త్వంబును గొంతకుఁ గొంత గ్రహింపనగుననియు 'స్వరూప' శబ్దమువలన ద్యోతమగును.

భక్తి యనునది 'ప్రేమరూప' మనక 'పర(మ) ప్రేమరూప' మనుటయందు విశేషము గలదు.

స్త్రీ పురుషులకుఁ గల పరస్పరానురాగంబును ప్రేమ యందురు. భక్తియందలి ప్రేమ యట్టిది గాదనియు, అలౌకి

కము నిర్వ్యాజకము నిశ్చలము నైనదిగా నుండుననియు, ద్వివిధమైన యీ ప్రేమకుఁ గల తారతమ్యంబును గ్రహింప వలసినదనియు 'పర(మ)' శబ్దము సూచించుచున్నది.

భగవంతునియెడఁ జూపు ప్రేమకు మూఁడు విలక్షణంబులు గలవు.

(1) అహంకారమునకు నిందు తావే లేదు; నైచ్య భావస్పర్శ గూడ తగులదు; మఱియు అయ్యది భయప్రేరితముగాని స్వలాభప్రేరితముగాని కాదు. సామాన్యప్రేమ యం దివి యెల్ల నుండును.

(2) ఆ ప్రేమ యేకాంతికముగా నుండును. భగవంతుని ప్రేమించుట తక్క మఱియొక్క సంగతి యే భక్తునకును గలుగదు. సామాన్యప్రేమ అనైకాంతికమును వివిధ విషయతాల్యము నగును.

(3) భక్తుఁడు తన్నుఁ దా మఱచి నిరంతరము ఆత్మారాముఁడై యుండును. సామాన్యప్రేమ 'నేను, నాకు' అను భావంబుల నాశ్రయించి యుండును.

## ప్రేమ వ్యవహారము: ద్వైతాద్వైత మతములు

ప్రేమ వ్యవహారమందు (1) ప్రేమించువాఁడు, (2) ప్రేమింపఁబడు వస్తువు, (3) ఈ రెంటికిఁ గల అన్యోన్యానురాగబంధము—ఈ మూఁడు నుండవలయును. ఈ మూఁడు లేనినాఁడు ప్రేమవ్యవహారంబునకే యవకాశము గలుగదు. ఈ త్రిపుటి యుత్తమభక్తి వ్యవహారంబున

సయుతము కలదా? లేదా? అను సంశయమునుగూర్చి తీవ్ర మతాంతరములు గలవు. అద్వైతమత సిద్ధాంతప్రకారము త్రిపుటికి నవకాశమే కలుగదు. త్రిపుటి వ్యవహారమే లేనిచో ఆనందానుభవంబునకే యవకాశము గలుగదని ద్వైత విశిష్టాద్వైతాదిమతంబులు. ఆనందానుభవము లీనమై తన్మయత గల్గినప్పుడు మాత్రము ద్వైతభావంబునకు నవ కాశములేదని యిరుతెగలవారు నంగీకరింతురు. తన్మయత నుండి క్రిందిమెట్టునకు వచ్చినప్పుడుగూడ వానికి అనుభూత జ్ఞానముండునా లేదా యను సంశయమునందు మాత్రమే వీరికి మతభేద మున్నదని యిందువలన స్పష్టము. ఇది కేవల తార్కికవిషయము. తర్కమునకును భక్తిశాస్త్రంబునకు నంతగా సంబంధము గలుగదు. [అయిన నొక్కటి చెప్పక తీఱదు. ప్రేమించువానికిని ప్రేమింపఁబడు వస్తువునకు నెప్పు డైక్యము సంపూర్ణమగునో యప్పుడు మాత్రమే యది నిండు ప్రేమ యగును. అట్టి యైక్యము పరాభక్తికి విధివిధానము. పరాభక్తియందుఁ జిత్తము ద్రవీభూతమై స్వస్వరూపంబును బాసి ధ్యేయాకారమును జెందుచున్నది. పరమభక్తుల యనుభూతియు నట్టిదిగానే యున్నది.

ఈ యనుభూతికి నిదర్శనంబుగా గోపికల వృత్తమును శ్రీ భగవానుఁడు పేర్కొనెను. ఒకానొక గోపిక శ్రీకృష్ణ మయచిత్తయై స్వభుజంబును వేఱొక గోపికపై వైచి 'ఇదిగో కృష్ణుఁడను, చూడు' మనుచుఁ గృష్ణునట్లు వర్తించెను. ఆ విషయమునుఁ బ్రస్తావించుచు,

'తా నావిదన్ మయ్యనుషంగబద్ధ
ధియఃస్వమాత్మా నమద స్తథేదమ్
యథా సమాధౌ మునయోఽబ్ధితోయే
నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే.'

అని చెప్పెను. (గోపికలు నాయందే బుద్ధి నిల్పి మత్పరలై నాతోడిదే లోకంబుగా నుండిరి. దానం జేసి వారికి స్వదేహ జ్ఞానమే గలుగదు. అంతియగాదు; దవ్వుదాపులుగూడ వారెఱుంగరైరి. సమాధి దశయందు మునులకెట్లో సముద్ర గతములైన నదులకెట్లో మచ్చిత్తలైన గోపికలకుఁగూడ నామరూపంబులు నశించెను సుమా!)

ఆ స్థితిలో వారి వృత్తి యెట్లుండెనందురా?
'తన్మనస్కాః తదాలాపాః
తద్విచేష్టాః తదాత్మికాః
తద్గుణానేవ గాయంత్యో
నాత్మాగారాణి సస్మరుః.'

(వారి చిత్తంబులు కృష్ణునియందే యుండెను; కృష్ణునిగూర్చిన మాటలు తక్క మఱియొండుఁ బల్కరు; కృష్ణునివలె నటించుట వారికి నాటయయ్యెను; కృష్ణుని కన్నఁ దాము వేఱను భావమే వారికిఁ గలుగదు; కృష్ణ గుణకీర్తనంబుతో వారికిఁ గాలమెల్లఁ గడచుచుండెను. వేయేల! వారు కృష్ణమనస్కలై తమ యిండ్లనుగూడ మఱచిరి.)

## భక్తినిగూర్చి అన్యమతభావములు

భక్తులు తన్మయావస్థ నొందినప్పుడు వారికిని భగవంతునకు నభేదభావంబుండుననుట మనవారే గాక యన్యదేశమతస్థులుగూడ నంగీకరించిరి. నిదర్శనార్థము వారిలోఁ గొందఱ వచనంబుల నుదాహరింతు.

(1) సుఫీ మతము :—'ఒకానొక కాముకుఁడు వాని ప్రియురాలి యింటికిఁ జని తలుపు తట్టసాగెను. తలుపు తట్టి నప్పుడెల్ల 'ఎవరు నీవు?' అను ప్రశ్నమాత్రము లోపలనుండి వినవచ్చుచుండెను. 'నేను గదా!' యని యతఁడు బదులు చెప్పుచుండెను. 'నేను గదా!' యని యతఁడు బదులాడుచుఁ దలుపుతట్టుచున్నంత కాలము ద్వారము విచ్చదయ్యెను. ఎట్టకేలకు వాఁడు వానినే మఱచి 'ఎవరు నీవు' అను ప్రశ్నకు 'నీవే నేను' అనెను. ఆ మాటతోడఁ దలుపు విచ్చెను' అని యొకానొక సుఫీమత కవీశ్వరుఁడు పరాభక్తియందుఁ గల యభేదావస్థను పై విధముగా వర్ణించెను.

(2) రుమియా మతము :—'ఎప్పుడు భక్తి నిండారునో యప్పుడా భక్తుఁడు దేవదూత స్థితిని బాసి భగవంతునియందు లీనమగుచున్నాఁడు' అని జలాలుడీన్ రుమి యను భక్తుఁడు వచించెను.

(3) మహమ్మదీయ మతము :—'భక్తునియందు గుణంబులును దత్కార్యంబులు నెప్పుడు నశించునో యప్పుడాతఁడు పూర్ణత్వమును జెందును. అప్పుడు వానికి దవ్వుదాపులు

గాని, స్వపరభావములుగాని, స్థిమితోన్మత్తతలుగాని, భేదైక్యములుగాని గలుగవు. వానికిఁ బ్రత్యేక నామలక్షణంబులు గూడ లేవు' అని అమీర్ ఆలీ అనునతఁడు 'మహమ్మదీయ మతాంతర్భావ' మను గ్రంథమందు రచించెను.

(4) 'నేనే సత్యము; ఎవనిని నేను ప్రేమింతునో యతఁడు నేనే; నేనే యతఁడు' అని ఒక సుఫీమత త్యాగి పలికెను.

(5) జుమి మతము :—'నాకును నీకును నిందుఁ దావులేదు. మనమిరువురము మిథ్యామూర్తులము' అని జుమి మతము చెప్పుచున్నదని బ్రౌనీ అను ఆంగ్ల గ్రంథకర్త రచించెను.

(6) మహమ్మదు మతము :—'ఇన్ని-అన్-అల్లాకులా ఇల్లాహా అనా' అను మహమ్మదుగారి వాక్యమునకుఁ గూడ నిదేభావము. 'నేనే భగవంతుఁడను; నాకన్న వేఱే భగవంతుఁడు లేడు' అని పై వాక్యమున కర్థము.

(7) క్రీస్తుమతాదులు :—'నేను—నా తండ్రి—మేమిరువురము ఒక్కటేగాని భిన్నమూర్తులము గాము!' అని ఏసుక్రీస్తుగారు పల్కిరి. 'భగవంతునితో నభేదముగా నుండుటొక్కటే యుత్తమగతి' అని పాల్ అను నతఁడు నుడివెను.

'మాకై మేము నశించి యజ్ఞాతగాఢాంధకారములోఁ గలసిపోయితి'మని డచ్చి యోగి రిస్‌బ్రూక్కు అనునతఁడు చెప్పెను. 'యోగికజ్ఞానావస్థయందు మేము దైనికగాఢ

తమస్సులో మునిఁగి యందే కలసియుందుము' అని జాన్ స్కోటన్ ఎకిజినా యను యోగి యోగసమాధియందలి తన యనుభవజ్ఞానంబును దెలిపెను.

(8) ఆధునిక ప్లేటో మతము :—'జీవబ్రహ్మైక్యస్థితి యిట్టిదనుటకు నూహకుఁగూడ నందదు. ఆ బ్రహ్మానందము కేవలము అనుభూతి విషయమగును. ఆ స్థితిలోఁ బ్రత్యగాత్మ యనునది బుద్ధితత్త్వమునుగూడ దాటి పరమాత్మతోఁ గూడి యందే యైక్యముఁ గాంచును' అని ఆధునిక ప్లేటో మతావలంబులు వచించుచుందురు.

(9) 'మనుష్యుని ప్రేమ వానిని దత్కృతివస్తురూప ముగా మార్చుచున్నది. ఇది ప్రేమకు నైజము' అని డియో నైసియస్ అనునతఁడు పల్కెను.

(10) 'ప్రత్యగాత్మ పరమాత్మలో నైక్యమగు'నని స్పెయిన్ దేశీయ మూరిష్ జాతి తత్త్వజ్ఞుఁడు అవి రోయిన్ అనునతఁడు చెప్పెను.

(11) 'ప్రేమ యత్యధికమైనప్పుడు జీవాత్మ తన పరిచ్ఛిన్నత్వమును దాటి దివ్యమైన యజ్ఞాతావస్థనుజెంది యెట్టకేలకుఁ బరమాత్మలో నైక్యమందును' అని బొన వెంటురా అను యోగి పల్కెను.

(12) ఇదే భావంబును జర్మన్ యోగి ఎకార్టు అను నతఁడును, షెల్లింగు, గోతీ మొదలైనవారును వచించిరి. అనఁగాఁ పరాభక్తియందు అభేదభావమును దాదాత్మ్యం

బును దేశాంతర మతాంతర యోగులును దత్త్వశాస్త్ర వేత్తలు నంగీకరించిరి. కావున ఇవ్విషయంబున నద్వైత మతమునకును భక్తిమతమునకు భేదము గానరాదు. ఏదైనఁ గొంత కలదందురేని అది రుచివిశేషమగునే గాని వస్తుగత విశేషము కాఁజాలదు.

## భక్తి - ధ్యేయ వస్తువు

భక్తికి ధ్యేయవస్తువేది? అని యడుగవచ్చును. భక్తికి ధ్యేయమైనట్టి యా వస్తువునకు నామరూపములు లేవు. ఏ వస్తువును ఉపనిషత్తులు అంతర్యామి యని వచించెనో యా వస్తువే ధ్యేయపదార్థము. నామరూపంబులే లేనప్పుడు అది పుంలింగమా? స్త్రీలింగమా? నపుంసక లింగమా? అను విచారమునకే యవకాశమును లేదు.

అట్టి సన్మాత్రి పదార్థమునుగూర్చి చెప్పునప్పుడు చెప్పెడివారి రుచినిబట్టియో వినెడివారి మనస్తత్త్వమును బట్టియో ఆ సన్మాత్ర పదార్థంబునకు నామరూపంబులు గల్పితంబులగుచున్నవి. అట్టి కల్పన నిరాకారపరమైనప్పుడు ఆ వస్తువును బ్రహ్మమనియు, బరమాత్మయనియు వచింతురు. అదే సాకారసగుణపరమైనప్పుడు ఆ వస్తువుయొక్క విభూతులను ఈశ్వరుఁడనియు, భగవానుఁడనియు, రామ కృష్ణ శివ కేశవాదులనియు వచింతురు. అట్టి కల్పనల ఫలముగా మతాంతరములును, వానింబట్టి మతవైషమ్యంబులును గలుగుచున్నవి. అట్టివానికి నెడమీయరాదను తలంపుతో మహర్షి తన భక్తిసూత్రములందు ఆ సన్మాత్ర పదార్థమును

బహు జాగరూకతతో వర్ణించెను. ఈ భావంబు నీ సూత్రము లోని 'అస్మిన్' అను శబ్దము సూచించుచున్నది. 'అస్మిన్' అనగా 'దీనియందు' అని యర్థము. అస్మిన్ అనునది ఇదం శబ్దముయొక్క సప్తమ్యేకవచనము; లింగవ్యవస్థ లేనిదని భావము. ఇదే భావము భాగవతములో 'ఓం నమో భగవతే తస్మైయత ఏతసచ్చిదాత్మకమ్' అను గజేంద్రస్తుతిలో ద్యోతకమగుచున్నది.

'అస్మిన్' శబ్దమును ప్రయోగించుటవలన ఆ సన్మాత్ర పదార్థ మెచ్చటనో యున్నదని వెదుక నవసరములేదనియు, అది యంతర్యామియై కేవల సమీపమందే యున్నదనియు మహర్షి తెలుపుచున్నాఁడు.

ఇదే భావంబును—

క. 'ఇందుఁగల డందు లేఁడను
సందేహమువలదు చక్రి సర్వగతుండై
యెందెందు వెదకిచూచిన
నందందే గలఁడు దానవాగ్రణి వింటే'.

అను భాగవత పద్యముగూడఁ దెలుపుచున్నది.

సన్మాత్ర పదార్థంబునకు నామరూపాది కల్పనము చేయుట అవిచ్ఛిన్నతత్త్వంబునకు పరిచ్ఛిన్నత్వమును గలిగించుట యగును. అట్టి కల్పనము వ్యవహారజ్ఞానమాత్ర యోగ్యమగునే గాని స్వరూపజ్ఞానమునకుఁ దగదు.

పరమాత్మకు జీవాత్మకుఁ బ్రపంచంబునకు ఈ మూఁడింటికి ఎట్టి సంబంధానుబంధములు గలవు? అను ప్రశ్న నాఁటికి

నేఁటికిఁ గలదు. ఈ విషయమెల్ల వ్యవహార ప్రపంచ సంబంధమేగాని వేఱుగాదు. భగవంతుఁ డట్టివాఁడు ఇట్టివాఁడు అని చెప్పుదురు. ఆ పల్కులెల్లఁ దావన్మాత్ర సత్యములే గాని పారమార్థిక సత్యములుగావు. ఏల యందురా? పూర్ణమును జూచుట చెప్పుట యెట్లు సాధ్యము? భక్తులు వారివారి యంతఃకరణ పరిమాణావధినిఁబట్టి ధ్యేయంబును గ్రహించి యదే పూర్ణమను భావంబుతో దానికి భక్తి చేయుదురు. అట్లుచేయుట తప్పుగాదు. కాని వారు గ్రహించినదిమాత్రమే పరమసత్యమనియు అన్యుల ధ్యేయాకారంబులు నీచంబులనియు నెంతమాత్రముఁ దలంపరాదు. తమ ధ్యేయంబులు తమకెట్లో యన్యుల ధ్యేయంబులును వారికి నట్లే యగును. వాస్తవము విచారించినచో ధ్యేయాకారంబును గల్పించినప్పుడే యది పరిచ్ఛిన్నమగుచున్నది. పరిచ్ఛిన్నము పూర్ణమెట్లగును? కాఁబట్టి నిరర్థక వైషమ్యములకు నెడమీయరాదు. ఎల్ల ధ్యేయాకారంబులందు సమదృష్టి నుంచవలయును. అవియెల్లఁ బూర్ణముయొక్క యంశములే యగును. అంశములలో నొకటి గొప్పదియు, నొకటి తక్కువదియుఁ గానేరదు. వేయేల? ఇవియెల్ల మనఃకల్పితంబులే గదా?

## భక్తి బీజము

భక్తికిఁ బూజ్యపూజకభావంబు బీజమగును. పూజ్యపదార్థమందలి విశేషంబులు మొట్టమొదటఁ బూజకుని చిత్తంబు నాకర్షించును. పూజకుఁడు పూజ్యపదార్థమందలి

విశేషంబులను బడయుటకై యత్నించును. ఈ యత్నమునే 'సాధన' యందురు.

సాధన ప్రథమావస్థయందుఁ బూజ్యపూజకులకు భేదభావము పూర్ణముగా నుండును. ఆ భావము క్రమ క్రమముగా సన్నగిలి సిద్ధావస్థయందు నభేదస్థితిని బడయును. భక్తి యట్లు జీవబ్రహ్మముల భేదభావముతో నంకురించి బ్రహ్మము సకల కళ్యాణగుణమహా ర్తియని నమ్మి యా సంప దను బొందు నభిలాషతోఁ బ్రోదిగాంచి ధ్యేయాకార శక్తి సంపదలను బొంది, తదంశత్వంబును జీవునకు సంపాదించి, యెట్టకేలకు జీవ బ్రహ్మముల నైక్యమును గలిగించు చున్నది.

ఇదే భావంబును—

'దేహబుద్ధ్యా తు దాసోఽహం। జీవబుద్ధ్యా త్వదంశకః।
ఆత్మబుద్ధ్యా త్వమేవాహ। మితిమే నిశ్చితా మతిః ॥

అను శ్లోకము స్పష్టీకరించుచున్నది.

## పూజ్యపదార్థ విభాగములు

భక్తులు వారి వారి యంతఃకరణ పరిమాణాను సారంబుగా పూజ్యపదార్థంబుల గ్రహింతురు. అది ప్రాయి కంబుగా నెనిమిది విధములు, (1) శివకేశవాది సాకార సగుణ బ్రహ్మమును గొందఱు గ్రహింతురు. (2) అట్టి సాకారసగుణ బ్రహ్మముయొక్క ప్రతీకంబును గొంద రాలం బనము చేయుదురు. (3) ఆ సగుణ బ్రహ్మముయొక్క

యవతారమూర్తులను గొందఱు పూజింతురు. (4) వారి వారి గురువునే సాక్షాద్బ్రహ్మభావంబుతోఁ గొంద ఱారాధింతురు. (5) వారువీరనక జీవత్వమునే కొందరు గ్రహింతురు. (6) విశ్వాకారమే భగవదాకారంబని దానిని గొందఱు సేవింతురు. (7) అంతర్యామియై సృష్టినెల్ల నేతత్త్వము నడుపుచున్నదో యదే భగవత్తత్త్వమని దాని నూహించి కొందఱు భజింతురు. (8) అహంకారాద్యుపాధి రహితమైన తమ యాత్మయే పరమాత్మయని దానిని గొందఱు ధ్యానింతురు.

## పరాభక్తి

ఎవ రెట్టి పూజ్యపదార్థంబులు గ్రహించి సాధన చేసినను దమ జీవాత్మయే పరమాత్మయను భావము దృఢమై చిత్కళామాత్రబ్రహ్మమే యెప్పు డనుభవసిద్ధమగునో యప్పుడది పరాభక్తి యగును. తత్పూర్వస్థితి యెన్నఁడును బరాభక్తి కాఁజాలదు.

పరాభక్తియొక్క పరమావస్థయైన జీవబ్రహ్మైక్య భావంబు అనుభవసిద్ధమైనఁ దర్వాతఁ గూడఁ గొందఱు భక్తులు జీవబ్రహ్మముల భేదభావంబును ధ్యాసమాత్రముగా నేని యుంచుకొనుటగలదు. 'ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే। కుర్వంత్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణోహరిః' అను భాగవతవాక్యమే యిందులకు నిదర్శనము.

అట్లుండుటేల ? అని యడుగవచ్చును. ఏదో యొక కోరికతో వారట్లుండుటగాదు. అట్టివారికిఁ బొందఁదగిన దేదియు లేదు. సర్వము వారి హస్తతలమందే కలదు. ఐక్యస్థితిలో ఆనందమే యగుదురుగాని, యానందానుభూతికి నవకాశము గలుగదు. చక్కెరయే యగు నానందంబు కన్నఁ జక్కెరయొక్క మాధుర్యంబును జవిచూచు నానందం బెట్లు విశేషమో యట్లే బ్రహ్మానందమే యగుట కన్న దాని ననుభవించుచునుండుట వారికి మహాసౌఖ్యముగాఁ దోఁచి వారట్లు భేదభావంబును ధ్యాసమాత్ర ముంచుకొందురు; మఱికొందఱు లోకారాధనార్థమై యట్టిదాని నుంచుకొనుటగలదు. మఱికొందఱు భగవంతు నకు సర్వాత్మకంబుగా సమర్పించుకొని భగవదిచ్ఛా నిర్వాహకులై యదే పదివేలుగా భావించియుందురు. వీరి భేదధ్యాసయనునది నిమిత్తమాత్రమేగాని వేఱుగాదు. వీరి మనోవాక్కాయ కర్మంబులెల్ల నీశ్వరప్రేరితంబులై వర్తించుచుండునేగాని యహంకార ప్రేరితంబులు గానేరవు.

## పూజ్యవస్తువిషయిక మతములు

ఈ పూజ్యవస్తువు విషయమై కాశ్యపమహర్షి మతంబునకును వ్యాసమహర్షి మతంబునకును గొంత భేదమున్నట్లు గానరావచ్చును. ఆ భేదమెల్ల బాహ్యదృష్టి నాశ్రయించి విచారించినప్పుడుమాత్రమే గానవచ్చుననియుఁ బరమార్థ దృష్టితోఁజూచినప్పుడు వారి యిరువుర మతములకు భేదము

లేదనియు శాండిల్యమహర్షి తన భక్తిసూత్రములు 29, 30, 31 లలోఁ బ్రమాణపూర్వకంబుగా నిరూపించెను. పూజ్యపదార్థమైన బ్రహ్మము ప్రతివ్యక్తిహృదయమందున్న యాత్మయేగాని వేఱు గాదని ఛాందోగ్యోపనిషత్తు 111. 14. 1. 4 ప్రతిపాదించుచున్నది. అదే తాత్పర్యంబును భగవద్గీతయు బ్రహ్మసూత్రంబులు నుపపాదించుచున్నవి. సారాంశమేమి? ప్రేమాస్పదమైన యా భగవంతుఁడు మన యందే యాత్మరూపంబుననున్న యా సత్పదార్థమేగాని యన్యము గాదనియు ఆ సంగతి మఱచి భగవంతుఁడు వేఱు, నేను వేఱు అనుభావంబుతో లోకమెల్ల వర్తించుచున్న దనియు అట్టి యజ్ఞానముపోయి సత్యమును స్వానుభవసిద్ధము చేసికొనుటయే పరమార్థమనియు ఈ విధానంబును జ్ఞాన మన్నను భక్తియన్నను శబ్దభేదమేగాని తాత్పర్యభేదము లేదనియు నేర్పడుచున్నది.

మఱియొక విషయముగూడ మఱువరాదు. నారదుని పరాభక్తుని లక్షణంబులుగా యోగవాసిష్ఠ రామాయణము ప్రతిపాదించుచున్నది. మహాభారతము 13-వ పర్వము 251 లో బ్రాహ్మణునకుఁ జెప్పిన లక్షణంబులకు భగవద్గీత 14-వ అధ్యాయము 22, 26 లలో గుణాతీతునకుఁ జెప్పిన లక్షణంబులకును ఆ గీతలోనే 2-వ అధ్యాయము 55, 72 లలో స్థితప్రజ్ఞునకుఁ జెప్పిన లక్షణములకును, భగవద్గీత 12-వ అధ్యాయము 13, 19 లలో భక్తునకుఁ జెప్పిన లక్షణంబులకును, సూతసంహితలో ముక్తికాండములో అతి

వర్ణాశ్రమికిఁ జెప్పిన లక్షణంబులకును, నారదుని పరాభక్తుని లక్షణంబులకును దారతమ్యము కలుగదు. ఇంతియ గాదు. ఈ విషయమై 'జీవన్ముక్తివివేక, మను గ్రంథము పెక్కు ప్రమాణ గ్రంథముల నుదాహరించుచు "త దేవం విముక్తశ్చ విముచ్యతే' ఇత్యాదిశ్రుతయః జీవన్ముక్త, స్థిత ప్రజ్ఞ, భగవద్భక్త, గుణాతీత, బ్రాహ్మణ, అతివర్ణాశ్రమి, ప్రతిపాదక శ్రుతివాక్యాని చ జీవన్ముక్తిసద్భావే ప్రమాణానీతి స్థితమ్'' అని చాటుచున్నది.

వీనింబట్టి నారదుని పరాభక్తి యెట్టిదో యూహింపనగును. ఈ పరాభక్తియనునది సర్వయోగంబులకును సర్వసాధనంబులకును బరమావధియై యంత్యసమావేశ స్థానమై భగవంతునియెడ నిరహంకారపూర్వక నిర్వ్యాజక ప్రేమరూపమైనదిగా నున్నది. అట్లు ప్రేమించుట ప్రేమార్థముగాని యన్యార్థముగాదు. అట్టి పరాభక్తునకు భగవంతుఁడు సర్వభూతాంతర్యామిగుఁడై గానవచ్చుచుండును. వానికి భగవత్సేవయే సర్వభూతసేవయగును. వానికి,

'జీవరాశిభిరాకీర్ణ అండకోశాంఘ్రిపో మహాన్,
తన్మూలత్వా దచ్యుతేజ్యా సర్వజీవాత్మ తర్పణమ్'

అనునదే జీవసూత్రమగును. (జీవభూతమైన విశ్వమే మహావృక్షము; దానికి భగవంతుఁడు మూలము; కాఁబట్టి భగవత్సేవ జీవలోకసేవయే యగును.)

సూ. అమృతస్వరూపా చ.　　3

(సా = ఆ భక్తి) అమృతస్వరూపాచ = అమృతస్వరూపముగా గూడనగును. అనఁగా భగవంతునియెడఁ బ్రేమరూపమైన భక్తి యనునది ముక్తిరూపమైనట్టియు వికారరహితమైనట్టియు బ్రహ్మానందమేగాని వేఱు గాదని భావము.

భక్తి యనునది 'పరమప్రేమరూప' అని రెండవ సూత్రములో అని 'అమృతస్వరూప' అని ఇట అనెను. అట్లు 'రూప' శబ్దమునకు 'స్వ' అను నుపసర్గను ప్రయోగించుట యందు మహర్షి భావం బెంతో గర్భితమైయున్నది. రెండవ సూత్రము భక్తియొక్క సామాన్య లక్షణంబులను మాత్రమే దెలుపుననియు ఈ సూత్రమన్ననో భక్తిస్వభావంబును తెలుపుననియు ఈ భేదంబును గ్రహించుటకై యీ సూత్రమందు 'రూప' శబ్దంబునకు బూర్వము 'స్వ' అను దానిని మహర్షి ప్రయోగించెననియు నెఱుంగవలయును.

1. 'అమృత' శబ్దంబును అనేకార్థంబులందుఁ బ్రయోగించిరి. ముక్తియను పదమునకును, కైవల్యమను పదంబునకును, అపవర్గమను పదంబునకును బర్యాయపదంబుగా 'అమృత' పదంబును వాడుటకలదు. ముక్తి మున్నగు పదంబులను వదలి 'అమృత' అను పదంబును ఈ సూత్రమందుఁ బ్రయోగించుటకు మహర్షి భావమేమి? అను శంక తప్పక కలుగును. వారి భావమేమో యూహింతము.

ఎట్టి చావుగాని, మార్పుగాని, లేనట్టి స్థితిని తెలుపునప్పుడు అమృత శబ్దమును బ్రయోగింతురు. చావులేని

యునికి పెక్కువిధములుగా నున్నది. (1) కొన్ని యోగంబుల ఫలంబుగా దేహపతనం బెన్నఁడును గలుగకుండునట్లు చేయవచ్చును. ఇదియు నొక విధమైన చావులేని యునికి యగును. (2) జీవగేణువు ప్రారబ్ధకర్మక్షయఫలంబుగా నొక యుపాధిని విడిచి మఱియొక యుపాధిని జొచ్చుచు నెన్నఁడును నాశనములేక సంచరించుచుండవచ్చును. ఇదియు నొక విధమైన చావులేని యునికియే యగును. (3) జీవునకు మరణమే లేదనియు, అతఁడు కారణశరీరస్థుఁడై శాశ్వతముగానుండుననియు వాదించు మతం బొకటి గలదు. అదియు నొక విధమైన చావులేని యునికియే యగును. (4) జీవుఁడు వాని సుకృత ఫలవిశేషంబున స్వర్గ, బ్రహ్మలోక వైకుంఠాదులకుఁ బోయి యాప్రళయాంతము నచ్చట వాని పుణ్య ఫలంబును భోగించుచుండునందురు. ఇదియు నొకవిధమైన చావులేని యునికియే యగును.

చావులేని స్థితు లిన్ని విధములుండఁగా వానిలో నేస్థితిని 'అమృత' శబ్దము సూచించునో విచారింపనగును.

స్వర్గ బ్రహ్మాదిలోకస్థితులు కర్మఫలంబులగును. కర్మఫలం బెప్పుడును శాశ్వతముగాదనియు, దానికి నంతము గలదనియు మన యుపనిషత్తులే ఘోషించుచున్నవి. అమృత స్థితి యట్టిది కానేరదనియు దానికి నెవ్విధమైన చ్యుతియు గలుగరాదనియు శాండిల్యమహర్షిగారు గట్టిగాఁ బల్కిరి. ఆ భావమునే ఛాందోగ్యోపనిషత్తును (8-8-15) బృహదారణ్యకోపనిషత్తును (1-2-17) బ్రహ్మసూత్రములును

(4-4-22) అనువదించుచున్నవి. మఱియు శ్రీభగవానుఁడు 'ఆ బ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున' అని గీత 8-వ అధ్యాయము 16-వ శ్లోకములోఁ జెప్పెను.

2. అమృత శబ్దంబునకు సుధ యను నర్థముగూడఁ గలదు. ఆ సుధను గ్రోలినవారికిఁ జావుపుట్టువులు గలుగవని లోకప్రతీతి. ఆ సుధను గ్రోలినవారికిఁ జావుపుట్టువులు గలుగకుండిన నుండుఁగాక. వారికి సుఖదుఃఖంబులు గలవు. బ్రహ్మానందామృతంబును గ్రోలినవారికి సుఖదుఃఖాదులు గూడఁ గలుగవనియు, వారు తుచ్ఛానందంబులవంకఁ గన్నెఁగూడఁ ద్రిప్పరనియు సూచించుటకుగా మహర్షి యిచ్చట సుధ యనక అమృతశబ్దంబును బ్రయోగించెను.

3. అమృతశబ్దము మాధుర్యమునుగూడ తెలుపును. మాధుర్యం బెట్టిదైనను దానియందు గోరంతయైనను చేదుగుణం బుండకమానదు. అది దాని నైజము. భక్తియనెడి అమృతం బట్టిది గాదనియు, దానియందు చేదుగుణంబులవమాత్రముగూడఁ గలుగదనియు సూచించుటకుఁ గూడ మహర్షి యిచ్చట మాధుర్య శబ్దమును వదలి అమృత శబ్దంబును బ్రయోగించెను.

4. ఏ పదార్థమైనను సేవించుకొలఁది తఱుగుచుండును. భక్తియనునది సేవించుకొలఁది దినదినాభివృద్ధిఁ గాంచుచుండునేగాని తఱుగునది గాదను భావంబు నిచ్చట అమృతశబ్దమువలన సూచితమగుచున్నది.

5. అమృతము ప్రత్యేక పదార్థము. దానిని సేవించినప్పుడు అది యంతర్గతమై దాని ప్రభావంబు నిచ్చును. అంతియగాని యది యన్యులకు మరల సేవ్యము గాఁజాలదు. భక్తియనెడి అమృతంబును సేవించినవాని స్థితి యట్లుగాదు. భక్తుఁడే అమృత స్వరూపంబునుగాంచి యన్యులకు సయితము సేవ్యుఁ డగుచున్నాఁడు.

6. సామాన్యమైన యమృతంబును గ్రోలుటకు నొక పరిమితిగలదు. ఎవఁడుగాని పొట్టపట్టినంత మాత్రమే త్రావఁ గలఁడు. అంతకుమించి త్రాగుమన్నను త్రాగఁజాలఁడు; త్రాగినను అది లోపల నిలువదు. భక్తిరూపమైన యమృతమన్ననో యెంత గ్రోలినను దనివి తీరదు. త్రాగుకొలఁది మఱిమఱి త్రాగవలయునెనెడి యాశ పెచ్చుపెఱుగుచునే యుండును.

7. స్వర్గలోకమందలి యమృతంబునకుఁ బరిమాణము గలదు. సచ్చిదానంద రూపమైన యీ యమృతంబునకుఁ బరిమితియే గలుగదు.

8. అమృతశబ్దమును మోక్షార్థమందుఁగూడఁ బ్రయోగింతురు. మోక్షమనఁగా నేమి? అను విషయమై పెక్కుమతములు గలవు. వానిని (1) అన్వయ మతంబులనియు, (2) వ్యతిరేక మతంబులనియు రెండుగా విభాగింపవచ్చును. న్యాయవైశేషిక మతముల ప్రకారము మోక్షమనఁగా బాధానివృత్తిరూపమాత్రమగును. ఆ స్థితిని వారు అపవర్గమందురు. ఇవి అభావతత్త్వంబును మాత్రమే చెప్పును

గాఁబట్టి వీనిని వ్యతిరేకకోటిలోఁ జేర్చిరి. ఈ మతముల ప్రకారము బాధమాత్రము నివృత్తియగునేగాని యానందానుభవము గలుగదు. ఈ మతప్రకారము ఆత్మ యనునది మనశ్శరీరంబులను రెంటిని విడనాడి జ్ఞానానందంబులకు దవ్వుఁగాఁ క్రియారహితమై ప్రోడువలెనుండును. ఈ తత్త్వంబును వాత్స్యాయన ఉద్యోతకారాదు లంగీకరింపరు.

## మోక్షతత్త్వ విచారము

మోక్షమనఁగాఁ గైవల్యమనియు, కైవల్యమనఁగా ఆత్మయనునది జ్ఞాతగానుండి ప్రకృతి విలాసంబులతో నెట్టి జోక్యమును లేక కేవలము చూచుచుమాత్ర ముండుననియు సాంఖ్యమతము, యోగమతము—ఇవి రెండును బ్రతిపాదించును. ఈ మతముల ప్రకారము ముక్తియనునది వ్యావహారిక మగునేగాని పారమార్థికముగాదు. ఏల యందురా? పురుషుఁడు (ఆత్మ) నిత్యముక్తుఁడు. నిత్యముక్తునకు బంధమే లేదు. బంధములేనినాఁడు ముక్తికి నవకాశ మేమిగలదు? ఈ మతములుగూడ నిర్విషయంబున న్యాయవైశేషికంబులకు ఛాయామాత్రంబులగును గావున నివియు నదేకోటిలోఁ జేరును.

మీమాంసక మతస్థులలో జైమిని, శబరుఁడు వీరిరువురును ముక్తియనుదానినే యంగీకరింపరు. ప్రభాకర మత ప్రకారము ముక్తి యనఁగా నేమి? ముక్తియనునది కార్యఫలమే యగుననియు ధర్మాధర్మంబులు కార్యంబులగుననియు, వానిని రెంటిని విడనాడినచో ఫలోదయంబునకే యవకా

శము గలుగదనియు, ఫలోదయంబు లేనప్పుడు ఫలానుభవ రూపమైన జన్మము గలుగదనియు ఇదియే ముక్తియనియుఁ బ్రభాకరమతము. ఈ మతప్రకారము బాధ నివృత్తియగునే గాని సుఖానుభవంబునకు నవకాశములేదు. ముక్తియన నది దుఃఖాభావరూపం బగునేగాని సుఖానుభావరూపంబు గానేరదనియు, భావంబునకు హాని తప్పదనియుఁ గుమారిలభట్టు గారి మతము.

బౌద్ధులకు జీవితపరమావధి నిర్వాణ మగును. నిర్వాణ మనఁగా ఆత్మ యనునది సమగ్రముగా నశించుటే యని వారి భావము. జైనమత ప్రకారము కర్మశరీరము నశించి పంచభూతంబులలోఁ జేరుట నిర్వాణమగును.

ముక్తియనుమాటయందు దుఃఖాభావమేగాక సుఖానుభూతియుఁ గలదని వేదాంతము మాత్రమే నొక్కి పల్కుచున్నది.* అనఁగా వేదాంత మతప్రకారము ముక్తియందుఁ బైనఁజెప్పిన అన్వయ వ్యతిరేకంబులు రెండును సమన్వయమొందుచున్నవి. వేదాంతి జ్ఞానియగుఁగాక, భక్తుఁడగుఁగాక; వానికి ఆత్మస్వరూపానుసంధానమే ముక్తియగునుగాని తదితరంబులుకావు. ఈ వేదాంత ముక్తినే నారదమహర్షి భక్తియుఁ బ్రతిపాదించుచున్నది.

---

* "దుఃఖ సంయోగ వియోగమ్"
"సుఖమాత్యంతికంయత్ తద్బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్"
అను గీతావాక్యము లిందులకుఁ బ్రమాణములు.

## ముక్తి యెప్పుడు ?

ఈ ముక్తియనునది జీవితకాలములోనే కలుగుచున్నదా ? మరణానంతరము గలుగుచున్నదా ? అను విషయమై వేదాంతమందు మతాంతరంబులు గలవు. మరణానంతరమే అనఁగా శరీరపతనానంతరమే ముక్తిగాని తత్పూర్వము గలుగదని మండనాద్యద్వైతులు వచింతురు. క్రైస్తవ మతమును మహమ్మదీయ మతమును అదేభావంబును బోధించును. భక్తిమార్గావలంబులు గొందఱా భావంబునే యంగీకరింతురు.

ఈ సూత్రమన్నను పరాభక్తిని గూర్చి ప్రశంసించుచున్నది. ఈ పరాభక్తియందలి స్థితికిని శంకరానందుల జీవన భక్తిస్థితికిని భేదము గాన్పింపదు. జీవిత దశలోనే దుఃఖాభావము నిర్వికల్ప సుఖానుభూతియు రెండును జేకూరవేని భక్తియనునది అమృతమనుట యర్థములేనిదగును. చచ్చినతర్వాత మరణాభావమనుట పరస్పర విరుద్ధమగును గదా. ముక్తియనుమాటకు చావులేమి యర్థమగునేని ఆభావంబును జీవుఁడు జీవితకాలమందే అనఁగా సశరీరుఁడై యున్నప్పుడే యనుభవింపవలయును. కావున జీవిత దశయందే ముక్తియను భావంబును నారదమహర్షియు శంకర భగవత్పాదులవారు నంగీకరించుట యెంతయు సమంజసమగును. సర్వసత్త్వములకు ఇచ్చటనే సుఖము హితము గలుగుట తత్త్వసారాంశమని గౌడపాదులవారు పల్కిరి.

ఈ యిరువురమతంబులకు నుపబృంహితంబులుగా నుపనిష ద్వాక్యంబు లెన్నో గలవు. 'అథమర్త్యోఽమృతో భవతి అత్ర బ్రహ్మ సమశ్నుతే' (కఠోపనిషత్తు 6-14) ఇచ్చటనే మర్త్యుఁ డమర్త్యుఁడై బ్రహ్మమును బొందు చున్నాఁడు. 'త్వమేవం విదానమృత ఇహాభవతి' (పురుష సూక్త. తై.) అత్ర బ్రహ్మ సమశ్నుతే (బృహదారణ్యకము 4. 4. 12), ఇహాచేదవేదీత్ అథసత్యమస్తి (కేన 11-5) ఇహైవసంతః అథ విద్మస్తద్ వయమ్ (బృహదారణ్యకము 4-4-14.)

8 అమృతశబ్దమునకు అయాచితమైన భైక్ష్యము అను అర్థముగూడఁ గలదు. భక్తుఁడు ముక్తినెన్నఁడు యాచింపఁడు. కేవల ప్రేమార్థము భగవత్ప్రీమానందంబు ననుభవించుటయు, సేవార్థము భగవత్సేవచేయుటయు, ఈ రెంటితోనతఁడు సంతృప్తుఁడై యుండును. భక్తుఁడట్లున్నను వానికి దైవానుగ్రహమువలననే ముక్తి గలుగుచున్నది. అనఁగా భగవంతుఁడు భక్తునకు ముక్తిని స్వయముగా ననుగ్రహించునని భావము. ఈ విషయంబును నారాయణీయము బహు రమ్యముగా వర్ణించుచున్నది.

'నమ్రాణాం సన్నిదత్తే సతతమపి పురస్తైర నభ్యర్థితానప్యర్థాన్, కామానజస్రం వితరతి పరమానంద సాంద్రాం గతించ ఇత్థం నిశ్శేషలభ్యో నిరవధికఫలః పారిజాతో హరే త్వం; క్షుద్రం తం శకవాటీద్రుమ మభిలషతి వ్యర్థమర్థివ్రజోఽయమ్!'

'కల్పవృక్షంబొకటి కలదఁట. అది యున్నదో లేదో తెలియదు. అది దేవేంద్రుని యుద్యానవనవాటిలో నున్నదఁట. యజ్ఞయాగాది క్రతువు లొనర్చినవారు మాత్రమే యటకుఁ బోఁజాలుదురఁట. కాఁబట్టి దేవేంద్ర లోకమునకుఁ బోవుటయే మహాదుర్ఘటకార్యము; ఆపని యెల్లరకును సాధ్యముగాదు. ఎట్లో యటకుఁ బోవుదురు గాక. పోయినంతనే యాకల్పశాఖి కోరికల నీయదు. దానిని బ్రార్థింపవలయును. ఒకవేళ ప్రార్థించినను దేనిని బ్రార్థింతురో దానిని మాత్రమే యది యిచ్చును. అర్థికి నేమివలయునో యూహించి యీయదు. ఇది పిసినారితనము గాక త్యాగమగునా? అది యిచ్చు ఫలంబులన్నో భుక్తమై నశించునవేగాని శాశ్వతములైనవిగావు. ఇంత శ్రమించి నను తుదకు క్షణభంగురమైన ఫలమే సిద్ధించుచున్నది. ఫలము క్షణభంగురమే యగుఁగాక. దాని యుపభోగంబునఁ గల్గు నానందమైనను జిరస్థాయి యగునాయనిన నదియు లేదు.

స్వామీ! నీ వుండుట సత్యము. నీ యునికి ఎందో మిన్నులు రాలుచోటఁగాదు. నీ భక్తులచెంతనే సంచరించు చుందువు. కావున నీకై వెదకు క్లేశమే లేదు. నిన్నుఁ జేరుట మహాసులభకార్యము. వేలకొలఁది ద్రవ్యముగాని, ఏండ్లుపూఁడ్లు తపోదీక్షగాని యవసరము లేదు. గోరంత భక్తి పుష్పంబుచు నీకు సమర్పించి నీవాఁడ నన్నంతనే నీవు వానినిఁ గవుంగిటఁగూర్తువు. అంతియగాదు. అది యిది యిమ్మని నిన్నుఁ గోరవలసిన యవసరమే లేదు. నీ భక్తులకు

నేది యవసరమో యేది శుభదాయకమో యది నీవే యూహించి యిత్తువు. నీ విచ్చుదానికి నెన్నఁడును గొదువ లేదు. అంతియగాదు. దానివలనఁగల్గునట్టి యానందమునకు మేరయే లేదు; మఱియు నది యెన్నఁడును ఖిలము గాదు. స్వామీ! అతిసులభుఁడవు, తోడునీడవై చరించు వాఁడవును, సర్వలోకగమ్యుఁడవును నిరవధికఫలదాతవును నైన నీ వుండఁగా నిన్ను వదలి దుర్లభమును క్షుద్రఫలదంబు నైన సురశాఖి నాశ్రయించుట వ్యర్థప్రయాసమే గదా!

ముక్తి యనుదానిని భక్తులేల కోరరు? అను శంక గలుగవచ్చును. అది ప్రయత్నసిద్ధముగాదనియు భగవదనుగ్రహ ఫలంబగుననియు పెద్దలు నిశ్చయించిరి. "యమేవైష వృణుతే తేన లభ్యః" భగవంతుఁ డెవ్వాని ననుగ్రహించునో వానికది లభ్యమగును (కఠ 11-22). "జుష్టః తేనామృతత్వమేతి." (భగవంతుఁ డనుగ్రహించినవానికే ముక్తి సిద్ధించును, (శ్వేత. 1-6) భారతమందుఁగూడఁ బెక్కుచోట్ల నిదే భావము వెల్లడింపఁబడియున్నది. అనుగ్రహము భగవదధీనము. అట్టి యనుగ్రహంబునకుఁ బాత్రులుగా నోఁచు భాగ్యంబునకై, అనఁగా నట్టి యర్హత సిద్ధించుటకై పురుషప్రయత్న మగునేగాని, భగవంతునిఁ గట్టివైచి నాకిది యిచ్చిపొమ్మనుటకుఁగాదు. అట్టి భావం బున్నచో నయ్యది సర్వాత్మక శరణాగతి కానేరదు. ముక్తికై పురుష ప్రయత్నం బావశ్యకంబని శ్రీ శంకరభగవత్పాదులవారు చెప్పిరిగదా యనవచ్చును. ముక్తికిఁబాత్రులగుటకై పురుష ప్రయత్నం బవసరంబని వారి భావమేగాని ప్రయత్న ఫలం

బుగా భగవదనుగ్రహంబు గలుగనిదే ముక్తి లభించునని వారి తాత్పర్యముగాదు. ఆకారణంబుననే వారు వారి రచనయందుఁ బెక్కుచోట్ల భగవదనుగ్రహంబునుగూర్చి యుత్కర్షించి రచించిరి. నిదర్శనార్థము సూత్రభాష్యములు చూడనగును.

9. 'అట్లగునేని భక్తి మాత్రము భగవదనుగ్రహ ఫలమే యగుఁగదా? దానికిమాత్రము ప్రయత్నమేల?' అని శంకింపవచ్చును. ఈ సూత్రమందలి 'అమృత' శబ్దము వలన నట్టి శంకయు నిరాకృతమగుచున్నది. ఎట్లందురా? అమృత మనఁగా యజ్ఞశేషమనియు నర్థముగలదు. యజ్ఞ మనునది ప్రయత్నసిద్ధమగునేగాని స్వతస్సిద్ధముగాదు. యజ్ఞమే యట్టిదగుచుండఁగా యజ్ఞశేషముగూడ నట్టిదే యగుఁగదా. ఇచ్చటఁ బురుషప్రయత్నమే యజ్ఞము; తచ్ఛేషమే అమృతము. ఆ యమృతమే భక్తి. ఈ భక్తి యట్టె యాకాశమునుండి యూడిపడునదిగాదు. అది మహా సాధన ఫలమై యున్నది. సాధన సంపత్తివలనఁ జిత్తము శుద్ధమై యహంకారమమకారరూప మలినరహితమై నప్పుడు భగవదనుగ్రహం బట్టి చిత్తమందుఁ బ్రసరించును. కాఁబట్టి భగవదనుగ్రహ సిద్ధాంతమందుఁ బురుషస్వాతంత్ర్య పురుష ప్రయత్నంబులకుఁ బూర్ణమైన యవకాశము గలదు. ఈ భావంబు సూత్రభాష్యము 11-3-42 *; 11-1-34 † ల

* కృత ప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః

† వైషమ్యనైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్, తథాహి దర్శయతి.

లోను యోగవాసిష్ఠము 11-6-14; 11-6-27 ల లోను వివరింపఁబడియున్నది. శ్రీ కృష్ణభగవానుఁడుగూడ గీత లలో నిట్లు స్పష్టీకరించెను :

శ్లో. 'ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ॥
ఆత్మైవహ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః ॥
—(గీ. 6-5).

కాఁబట్టి యీ సూత్రమందు 'అమృత' పదంబు నేటికి కూర్చుటయందు నారదమహర్షికి నెంతో తాత్పర్యముండుట స్పష్టము. వేయేల! పరాభక్తి తత్త్వమెల్ల నీయొక్క మాటలో నిమిడియున్నది. స్వేచ్ఛానందామృతత్వంబు లనెడి ఈ త్రిపుటి యెల్లయోగంబులకుఁ బరమావధిగా నున్నది. ఆ యవధిని జేరుటకుఁ బురుషప్రయత్నంబు దైవానుగ్రహంబు ననునవి రెండును రమసాధనంబు లగును. ఈ సాధనద్వయ సంపత్తి ఫలంబుగాఁ జేకూరునట్టి స్థితియే పరాభక్తి యగును. అదియే ముక్తి యనఁబడును.



సూ. యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధోభవతి, అమృతోభవతి,
తృప్తో భవతి. 4

(దానిని బొందెనేని పురుషుఁడు సిద్ధుఁడును అమృతుఁడును దృప్తుఁడును నగును.)

ముక్తి యన్నను మోక్ష మన్నను బరాభక్తియే యని మూఁడవ సూత్రములోఁ జెప్పఁబడెను.

అట్టి పరాభక్తి తత్త్వంబు నీ సూత్రము వివరించు చున్నది.

భక్తికి జీవభూతమైన యీ యమృతత్వము భక్తుఁడు కోరుటగాని దానికై యత్నించుటగాని లేదు. అయా చితముగానే యది వానికి భగవదనుగ్రహ ఫలంబుగాఁ గలుగుచున్నది. ఆ యమృతత్వం బొకరి సొమ్ముగాదు. దాని నెల్లరును బడయనగును. జాతి వర్ణ మత లింగ వివక్షత లకు నం దవకాశమే లేదు. ఆ యనుగ్రహం బెవ్వనిపయి వర్షించునో యతఁ డెవ్వఁడైనఁగానిమ్ము సిద్ధుఁడు, అమృతుఁడు, తృప్తుఁడు నగును. ఈ భావంబును సూత్రమందలి 'లబ్ధ్వా' అను పదము సూచించును. భగవంతుని బ్రేమిం చుటయు (భగవంతునిచే సృష్టింపఁబడిన లోకంబును సేవిం చుట మూలకంబుగా) భగవత్సేవ చేయుటయు—ఇవి భక్తునకుఁ గర్తవ్యములు. భక్తుఁడు భగవత్ప్రేమాబ్ధిలో నోలలాడుచుఁ దదేక భావంబుతో నుండును; ఇతఃపరం బెఱుఁగఁడు. అహో, ఈ యానందసాగరమందు మునిఁగి భగవన్నామ గుణసంకీర్తనంబులతో జీవితంబును గడుపు మహాభాగ్యంబును నిరసించు మందుఁడు గలఁడా? 'ధర్మజా! భగవంతునితోడిదే లోకముగాఁ దలంచి తద్వ్యామోహితుఁ డవై యుండు వేల? అని వాని నడిగిరి. అందులకు బదులుగా 'హిమవత్పర్వతంబు నంతగాఁ బ్రేమింతు రేల?' అని ధర్మజుఁడు పలికెను. అనఁగా భక్తిస్వభావంబట్టిదని భావము.

భగవంతుఁడు తనకన్నఁ దన భక్తుల నత్యధికం బుగాఁ బ్రేమించును; తన భక్తులకుఁ దాను దాసుఁడై యుండుట మహాభాగ్యంబుగా భావించును; వారి కెప్పుడు మేలుచేయనోతునో యని సమయము వేచియుండును; వారికి ముక్తినొసంగ సిద్ధముగా నుండును. 'దయాళువైన రాజు తన్నుఁ ద్రికరణశుద్ధిగఁగొల్చు సేవకుని గౌరవించుట యాత్మగౌరవంబుగా భావించును; వానినిఁ దనచెంగటఁ గూర్చుండు మనును. వాఁడు వలదన్నను వినఁడు. అట్లే భగవంతుఁడుగూడఁ బరాభక్తుని గౌరవించుట యాత్మ గౌరవంబుగా భావించును. ఆ భక్తుఁడు కోరకున్నను వానినిఁ దనలోనికి నైక్యముచేసికొనును. భక్తుఁడును భగవ దిచ్ఛకుఁ దలయొగ్గును; వలదన్నచో భగవంతునకు నతృప్తి గలుగునేమో యను శంక వానిని మాటాడనీయదు. భగవ దనుగ్రహ ఫలంబుగా ముక్తిగల్గినప్పుడు 'అహో! నా కిది లభించెనను తృప్తియైనను నుండదా? అని శంకింపవచ్చును. భక్తునకు నదియు నుండదు. అనుగ్రహఫలంబు నతఁడు దలఁదాల్చియుండును. బంధముక్తులౌండె స్వర్గనరకంబు లౌండె ఏదియైన నగుఁగాక అది భగవదనుగ్రహ ఫలమే యని వాని విశ్వాసము.

భక్తితత్త్వంబును శ్రీ శంకర భగవత్పాదుల వారు శివానందలహరిలో బహురమ్యంబుగా నిట్లు వర్ణించిరి :

శ్లో॥ నరత్వం దేవత్వం నగవన మృగత్వం మశకతా,
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్।

సదా త్వత్పాదాబ్జ స్మరణ పరమానంద లహరీ
విహారాసక్తం చేత్ హృదయమిహ కిం తేన వపుషా॥

ఇదే భావంబును కులశేఖరుఁడు ముకుందమాలలో నిట్లే పల్కెను. కావున భక్తిగలుగుటకు ఉపాధి యంత ప్రధానమైనదిగాదు. భక్తి చేయుటకుఁ జండాలత్వముగూడ నడ్డుపడదనుటకు మనీషాపంచకమే నిదర్శనము.

భక్తుఁడు భక్తినిదప్ప నొండు కోరఁడనుటకుఁ గారణము భక్తునెడ భగవంతుని ప్రీతియేగాని యొండుగాదు. ఆ ప్రీతి యెట్టి దందురా?

శ్లో॥ మయ్యర్పితాత్మనః సభ్య
నిరపేక్షస్య సర్వతః
మయాత్మనా సుఖం యత్త
త్కృతస్స్యాద్విష యాతనామ్॥ భాగ.11-14-12.

న పారమేష్ఠ్యం న మహేంద్ర ధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్॥
న యోగసిద్ధి రపునర్భవం వా
మయ్యర్పి తాత్మేచ్ఛతి మద్వినాన్యత్॥
భాగ. 11-14-13.

నిరపేక్షం మునిం శాంతం
నిర్వైరం సమదర్శనమ్
అనువ్రజా మ్యహం నిత్యం
పూయే యేత్యంఘ్రి రేణుభిః॥ భాగ. 11-14-15

మున్నగు భాగవత శ్లోకములందు భగవానుని భావంబును తెలిసికొనవచ్చును.

ఈ సూత్రమందలి 'యత్' అను దానికి పూర్వ సూత్రమందలి 'అమృత' పదముతో నన్వయము. భక్తి సాధనక్రమ మందుఁగాని, తత్ఫలముగా ముక్తినొందుట యందుఁగాని జాతి వర్ణ లింగభేదమే లేదని 'పుమాన్' శబ్దము సూచించును. తీవ్రమైన యిచ్ఛగల ప్రతి వ్యక్తియు భక్తి సాధనక్రమంబు ననుష్ఠించి ముక్తినొందఁదగును. భక్తి సాధనమునకు నుపాధి యవసరము. ఆ యుపాధులలో మనుష్యోపాధి యుత్తమము గావచ్చును. అట్లనుటవలనఁ బశు మృగ పక్ష్యాదుల యుపాధులందు నాత్మ లేదనుటగాదు. ఆత్మ యనునది సర్వాంతర్యామియై యున్నది. భక్తిచేయుటకు నొకవిధమైన మనఃపరిణామము కావలయును. అట్టి పరిణామంబును మనస్సు పడయుటకు మర్త్యోపాధి యెంతయు యోగ్యమగును. పక్షులును మృగంబులును భక్తిచేసి ముక్తినొందినట్లు మన పురాణంబులం దెన్నో కథలు గలవు. ప్రాణిజాలమెల్ల భక్తిచేయఁదగి యున్నదని శ్రీ మధుసూదన సరస్వతిగారుగూడ నుడివిరి. ఇవి యెల్ల భక్తిప్రభావంబునుగూర్చిన శ్లాఘావచనంబులనియు, భక్తికి నరజన్మము మాత్రమే యోగ్యమైనదనియు బ్రహ్మసూత్రభాష్యమందు (1-3-25 లో), * శ్రీ శంకర భగవత్పాదులవారుగూడ సిద్ధాంతము చేసిరనియుఁ గొందఱ

* 'హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్'

యభిప్రాయము. దేవాసురుల సంగతి యేమందురా? వారుఁగూడ మోక్షార్హులేయని సూత్రభాష్యము. ఈ సూత్రమందు నారదమహర్షి దేవాసురుల నుద్దేశించెనో లేదో నిశ్చయింపరాదు.

భక్తికి ముక్తికి జాతి లింగ భేదములేదని నారద మహర్షి వచించిన భావంబును భక్తిమత ప్రచారకులెల్లరు నంగీకరించిరి. అందులకుఁ దార్కాణముగా నెందరో స్త్రీ పురుషులు నీచజాతిలోనివారుగూడ పరాభక్తులై ముక్తి గాంచినవారు గలరు.

బ్రాహ్మణజాతివారికిఁ దక్కఁ దదితరులకు ముక్తి యెన్నఁడును గల్గదని శంకరుని భావంబనియు బ్రాహ్మణ జాతిలోఁగూడ నుపనీతులు గానివారికి ముక్తి లేదని వారు పల్కిరనియుఁ గొందఱు భావింతురు.

శంకరుల తాత్పర్యం బది యెన్నఁడును గానేరదు. ఉపనీతులు గానివారు వేదాధ్యయనంబునకు వేదచోదిత జ్ఞానయోగానుష్ఠానంబునకును దగరని వారు పల్కిరేగాని బ్రాహ్మణేతరులు ముక్తికి నర్హులుగారని వారు బోధింపలేదు. ముక్తియన్నను జ్ఞానమన్నను వారిభావంబున నొక్కటే యగును. అట్టి ముక్తికి జాతి మత లింగ భేదమే లేదనియు, అందులకు విదురుఁడు ధర్మవ్యాధుఁడు అను వారలు నిదర్శన మగుదురనియు శంకరులవారే వారి సూత్రభాష్యము 1-3-38 లో నుడివిరి. అంతియగాదు. జప తపః పూజా దులవలన నెల్లరును ముక్తిని బడయవచ్చుననికూడఁ దెలిపిరి.

మఱియు అపశూద్రాధికరణ విచారమందుఁ బౌరాణిక భావంబు నివ్విషయమైన దాని నంగీకరించుచుఁ బురాణేతిహాసంబుల నెల్లరకుఁ గఱపవలయుననిరి.

పురాణముల తత్త్వమేమి? అవి వేదచోదిత మైన యాధ్యాత్మిక తత్త్వజ్ఞానంబును జనసామాన్య సుబోధార్థము కథల మూలకంబుగా వివరించునవిగా నున్నవి. భారతము ఇతిహాసంబులకు శిరోభూషణం బగును. అందులో గీత గలదు. గీత యన్ననో యుపనిషత్సారమైన ప్రస్థానత్రయ మందొకటిగా నున్నది.

## భక్తిసాధనకు ఎల్లరును అర్హులే

పురాణములు, ఇతిహాసములు ఎల్లరకు గఱపవలయు నని శ్రీ శంకరులు అంగీకరించిరిగదా. మహాభారతము ఇతిహాస మనఁబడుచున్నది. ఇట్టి మహాభారతమందు ఉపనిషత్సారమైనట్టియు, ప్రస్థానత్రియములో నొకటియు నైన శ్రీమద్భగవద్గీత కానవచ్చుచున్నది. కనుక నిది యెల్లరకును దెలియఁజెప్పనగును. కాగా, ఆధ్యాత్మిక జ్ఞానభిక్ష అందరకును బెట్టవచ్చును అని శ్రీ శంకరులు ఒప్పుకొనినట్టులేగదా. ముక్తిగాని, ముక్తిని బొందు నవకాశముగాని ఎవరికిని శ్రీ శంకరులు నిషేధించియుండలేదు. కనుక, అందరును—జాతి, మతము మొదలైన భేదముల నేమియుఁ బాటింప నవసరము లేకయే—ముక్తికి అర్హులగుదురు అను నీ విషయములో శ్రీ శంకరులు, నారదులు పూర్తిగా నేకీభవించుచున్నారు.

## సిద్ధపురుషుఁడన నెవరు ?

ఆధ్యాత్మిక సాధనయొక్క గమ్యమును జేరిన యాతఁడే 'సిద్ధో భవతి' యందు సూచింపఁబడిన సిద్ధపురుషుఁడు. సిద్ధత్వము నొందుటయే మానవుని సర్వకర్మములయొక్కయు సర్వాభిలాషలయొక్కయు గమ్యము. అది చేరనంతవరకు మానసికశక్తులు కొలఁదిగాఁదనకబ్బినను, వానిని లెక్క చేయక —మానవుఁడు సాధన పూర్తి చేయుచుండవలయును. దివ్యత్వము మానవునియందు అంతర్యాతమై యుండనే యున్నది. కాని, అవిద్యచేఁ గప్పఁబడి యున్నది. ఆధ్యాత్మిక సాధనలవలన ఈ అవిద్య లేక మాయ యను తెరను దొలఁగించినచో, మబ్బులు వీడినప్పుడు సూర్యుఁడు తిరిగి ప్రకాశించుపగిది, ఆత్మయొక్క సహజ దివ్యత్వము, పరిపూర్ణత బహిర్యాతములై భాసించును. ఈ మాయ యను తెరను దొలఁగించుటయే, ఆధ్యాత్మిక సాధనల ప్రయోజనము. సిద్ధత్వమునొందుటకు, దైవభక్తి మిక్కిలి తేలికయు సన్నిహితమునగు మార్గము అని పతంజలి యోగసూత్రములలో "ఈశ్వర ప్రణిధానాద్వా" (౧-23) అను సూత్రము స్పష్టీకరించుచున్నది.

మామూలువాడుకలో 'సిద్ధుఁడు' అను పదము అణిమాది అష్టసిద్ధులను బొందినవానికి ఉపయోగింపఁబడుచున్నది. ఆత్మసాక్షాత్కారకమగు సమాధికి ఈ 'సిద్ధులు' అడ్డంకులు అని "తే సమాధే ఉపసర్గాః వ్యుత్థానే సిద్ధయః" (3-38) అను యోగసూత్రము తెలియఁజెప్పుచున్నది. ఈ

భక్తిసూత్రమునందలి 'సిద్ధుఁడు' అను పదము పైయర్థములో, అణిమాది సిద్ధులను బొందినయాతఁడు అను నర్థములో, నుపయోగింపఁబడలేదు; ఈ మాటయే తరువాతి 'అమృతో భవతి' యందలి 'అమృత' శబ్దము నొక్కి చెప్పుచున్నది. కావున సిద్ధునియొక్క లక్షణము అణిమాది సిద్ధుల నొందుట గాదు; పరమాత్మతో నైక్యము నొందుటయే. 'పరిపూర్ణత' ఒక ఈశ్వరునియందు మాత్రమే చెల్లును గాన, పరమ సాక్షాత్కారము నొందినయాతఁడు, ఈశ్వరునితో నైక్యము నొందెను అని చెప్పఁబడుచున్నాఁడు; ఏలన, పరమసాక్షాత్కారము నొందినయప్పుడు సాధకుని వ్యక్తిత్వము పరమేశ్వరుని యందు లీనమైపోవునుగదా.

## భక్తునియొక్క 'తృప్తి' యెట్టిది ?

ఇఁక సూత్రమందలి 'తృప్తోభవతి' (తృప్తుఁడగుచున్నాఁడు) అను వాక్యమందలి 'తృప్తి' ఎట్టిది అని విచారింతము. ఈ 'తృప్తి' కిని సామాన్యమానవుని ఆత్మ తృప్తికిని జాల భేదమున్నదని గమనింపవలయును. సిద్ధి నొంద నంతవఱకును, 'అయ్యో! నేనింకను దేవుని గాంచనైతినే' అను దైవికమైన అసంతృప్తితో, సాధకుని మనస్సు నిండిపోవలయును. పరమవస్తువు అయిన భగవానునికంటెఁ దక్కువైన వస్తువు లన్నిటియందును అసంతృప్తుఁడు, అసంతుష్టుఁడు గానిచో, సాధకుఁడు ఆధ్యాత్మిక జీవితమున అభివృద్ధి నొందనేరఁడు. పరమగమ్యమును జేరినపిదప మాత్రమే మానవుఁడు నిరపాయముగా ఆత్మతృప్తి పొందనగును.

ఇచట, ఈ సూత్రమందుఁ జెప్పఁబడిన 'తృప్తి' ఏదేనొక కోరిక సిద్ధించినపుడు కల్గు తృప్తివంటిదిగాదు; ఎట్టి కోరికయు లేకపోవుటచేఁ గల్గు సంపూర్ణమైన తృప్తి. మఱి యిట్టి కోరికలేవియు లేని సిద్ధపురుషుఁడు నిర్వ్యాపారుఁడగునా? కాఁజాలఁడు. ఏలన, అతనిని భగవానుని యొద్దకుఁ జేర్చిన పరమ ప్రేమయే, ఆధ్యాత్మికముగాఁ దనకన్న దురదృష్టవంతులగు నితరుల శ్రేయస్సుకొఱకుఁ బాటువడునట్లు అతనిని బ్రోత్సహించును. మరియుఁ గేవలము తృప్తిని సిద్ధత్వమునకుఁ బ్రమాణముగా గ్రహింపరాదు; ఏ కొలఁదియో సాధించి తృప్తిఁజెంది యూరకున్నచో, సాధకుఁడు పరమగమ్యమును జేరుకొనఁజాలఁడు. కావున, ఈ సూత్రమందుఁ జెప్పఁబడిన 'తృప్తి' సిద్ధత్వముయొక్క ఉపకరణమే కాని సాధకుఁడు తానుగా వాంఛింపఁదగినది కాదు.

సాధకుఁడు కోరఁదగినది ఒకటియే; అది ఈశ్వర సాక్షాత్కారము. మరి యెట్టికోరికకును సాధకుని మనసునందుఁ దావులేదు. కావుననే, కుంతి శ్రీకృష్ణు నిట్లు ప్రార్థించినది :

శ్లో. "విపదః సంతునః శశ్వత్ తత్ర తత్ర జగద్గురో।
భవతో దర్శనం యత్ స్యాత్ అపునర్భవ దర్శనమ్॥"
(భాగవతము 1-8-24)

అందువలన, పునర్జన్మమును దొలఁగించు నీ దర్శనము మాకుఁ గలుగుచో, హే జగద్గురూ! మా కెల్లపుడును గష్టములే కల్గుగాక!

పరమవస్తువును అభిలషించి పొందవలయునన్నచో భక్తున కిట్టి మనస్తత్త్వము అబ్బవలయును. అపుడు సుఖ దుఃఖములను లెక్కసేయక, ఆత్మతృప్తికై ప్రాఁకులాడక, తీవ్రముగా, నిరాటంకముగా సాధననొనర్చి సత్యవస్తువును గ్రహించినపిమ్మట, అనఁగా, ముక్తి స్వరూపమైన పరాభక్తి యబ్బినప్పుడు,—'యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః' (గీత, 6–22)— దేనిని పొందినచో మానవుఁడు మరి యే యితరలాభమును అధికముగా గణింపఁడో అట్టి పరిపూర్ణతృప్తి భక్తునకుఁగలుగును.



సూ. యత్ ప్రాప్య న కించిద్వాంఛతి, న శోచతి,
న ద్వేష్టి, న రమతే, నోత్సాహీ భవతి. 5

యత్ = పూర్వోక్తమైన యమృతస్వరూపంబును, ప్రాప్య = పొందినతర్వాత (పుమాన్ = పురుషుఁడు) కించిత్ = దేనినిగాని. న వాంఛతి = కోరఁడు; న శోచతి = ఎట్టి దుఃఖంబులు పైకొన్నను వ్యసనపడఁడు; న ద్వేష్టి = దేనియందును ద్వేషబుద్ధిని జూపఁడు; న రమతే = దేనికిని సంతోషింపఁడు; నోత్సాహీభవతి = ఆత్మార్థము గోరంతగూడ నుద్యోగింపఁడు.

'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్, ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే' అను ద్వితీయాధ్యాయములోని 55–వ శ్లోకము మొదలు 70–వ శ్లోకమువఱకును, పదునాల్గవ అధ్యాయము 'ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ। న ద్వేష్టి సంప్ర

వృత్తాని న నివృత్తాని కాంక్షతి’ అను 22-వ శ్లోకము మొదలు 26-వ శ్లోకమువఱకును, పంద్రెండవ అధ్యాయము ‘అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ। నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥ అను 13-వ శ్లోకము మొదలు పందొమ్మిదవ శ్లోకమువఱకును శ్రీ భగవానుఁడు చెప్పిన భావంబులనే యీ సూత్ర మనువదించుచున్నది.

రెండవ యధ్యాయమందలి పై శ్లోకంబులు స్థితప్రజ్ఞుని యొక్క సమాధ్యవస్థా లక్షణంబులను వ్యుత్థితావస్థా లక్షణంబులను దెల్పుచున్నవి. పదునాల్గవ యధ్యాయమందలి పై శ్లోకములు స్థితప్రజ్ఞుని లక్షణములనే ప్రకారాంతరముగాఁ జెప్పుచున్నవి. పంద్రెండవ యధ్యాయమందలి పై శ్లోకములు నిర్గుణబ్రహ్మనిష్ఠుఁడైన కృతకృత్యుని లక్షణంబులఁ జెప్పుచున్నవి.

ఇదే భావము భాగవతము ఏకాదశస్కంధము 2. 48-55 వఱకును, లఘుయోగవాసిష్ఠమందు 5. 90-97 వఱకును, సూతసంహితలో ముక్తికాండము 5 లోను, మహాభారతము 13-వ పర్వము 251 లోను బ్రతిపాదింపఁబడియున్నది.

ఈ వివరముంబట్టి చూడఁగా భక్తునకును జీవన్ముక్తునకును భేదములేదనియు, వారు అహంకారమునకును త్రిగుణరూపమైన ప్రకృతికిని వర్ణాశ్రమ ధర్మంబులకును అతీతులై యుందురనియు స్పష్టపడుచున్నది. అట్లున్నను వారి

వర్తనము దయాపూర్వకంబును లోకోపకారపరమును నయియే యుండును. ఏల యందురా? వారి బ్రహ్మానందమే వారి నట్లు వర్తింపఁజేయును.

అనుగ్రహము భగవదధీనమనియు అందులకు యోగ్యతను సంపాదించుట మనుష్యాధీనమనియు నాల్గవ సూత్రమందుఁ దెలుపఁబడెను. ఆభావంబును స్పష్టీకరించుటకై నాల్గవ సూత్రమందు 'లబ్ధ్వా' అను పదంబును, ఈ సూత్రమందు 'ప్రాప్య' అను పదంబును మహర్షి ప్రయోగించెను. ఈ రెండు పదంబులకుఁగల సూక్ష్మార్థములను గ్రహింపవలయును.

అమృతస్వరూపుఁడైన భక్తునకుఁ గోరికయే యుండదని సూత్రము చెప్పుచున్నది. ఏల యందురా? కోరికలెల్ల అహంకార మమకార కార్యములు. భక్తునకు నవి రెండు నశించియుండును. ఆకారణంబున వానికిఁ గోరికలే కలుగవు.

ఇహాముత్ర ఫలవైరాగ్యము భగవత్ప్రాప్తికి మొదటి మెట్టుగా నుండఁగాఁ, గృతకృత్యుఁడైన భక్తునకు మరల నట్టిది యొక లక్షణముగాఁ జెప్పనేల? అని శంకింపవచ్చును. వైరాగ్యము అపరము – పరము అని రెండు విధములు. సాధనావస్థయందలిది అపరవైరాగ్యమని చెప్పఁబడును. సిద్ధావస్థ కలుగనిచోఁ బరవైరాగ్యము సిద్ధింపదు. సాధనావస్థయందు వైరాగ్యము ప్రయత్నపూర్వకంబుగానుండును. సిద్ధావస్థయందు అది స్వతస్సిద్ధముగా నుండును. సాధనావస్థ

యందు మనోవృత్తు లుండుటంజేసి వాని నరికట్టుటకై ప్రయత్నము వలయును. సిద్ధావస్థయందు మనోవృత్తి యేకాగ్రమై యుండును. దానికి వికల్పంబులు గలుగవు. ఆ వృత్తియు భగవన్ముఖంబుగా నుండును. దానంజేసి యావృత్తి మార్పునకు నవసరమే లేదు. కాఁబట్టి సిద్ధునకు వాంఛలు లేవని చెప్పఁబడెను. అపర వైరాగ్యము నిరోధ రూపంబనియుఁ బరవైరాగ్యము స్వతస్సిద్ధమనియు భావము. అపరవైరాగ్యమందు గుణవ్యవహారములయెడ నుపేక్షాభావ ముండును. పరవైరాగ్యమందు గుణవ్యవహారజ్ఞానమే యుండదు.

సిద్ధునియందుఁగూడ రాగద్వేషంబు లప్పుడప్పుడు బాహ్యదృష్టికిఁ గానవచ్చుటగలదు. అవియెల్లఁ బూర్వాశ్రమ సహజభావంబుల ఛాయలేగాని కార్యరూపంబును దాల్చునవిగావు. నిర్మలమైన యాకాశమందు ధూళిధూమంబులు గప్పినను దాని నైజనైర్మల్యంబునకు నెట్లు సేఁగిలేదో యట్లే సిద్ధునందుఁ బూర్వవాసనల ఫలంబులుగా రాగద్వేషంబులు బాహ్యదృష్టికిఁ గానవచ్చినను వాని యంతఃకరణంబు స్వచ్ఛముగానే యుండునుగాని రాగద్వేష కలితమై వ్యవహరింపదు. ఈ విషయమై పై రెండవస్థలందుఁగల తారతమ్యంబునుగూర్చి నైష్కర్మ్యసిద్ధియను గ్రంథమం దిట్లుగలదు. 'ఉత్పన్నాత్మావబోధస్య హ్యద్వేష్టృత్వాదయోగుణాః। అయత్నతో భవంత్యేతే నతుసాధకరూపిణః॥ (4-69). ఇదే భావంబును శ్రేయోమార్గమను గ్రంథముగూడ ననువదించుచున్నది.

ముముక్షువునకు యోగక్షేమేచ్ఛ యుండును గదా. అదిమాత్రము కోరికగాదా యని శంకింపవచ్చును. అదియుఁ గోరికయే యగునుగాని యాకోరికవలన నుదయించుఫలము మోక్షముగా నున్నది. మోక్షమన్నంతనే జన్మరాహిత్య మని స్పష్టము. దానంజేసి మోక్షేచ్ఛ యెప్పుడు శుభదాయకమేగాని యితరములైన కోర్కెలవలెఁ దత్ఫలానుభవార్థము పరజన్మంబులను గలిగింపదు. ద్వివిధమైన యీ కోర్కెలకుఁగల తారతమ్యమును గ్రహింపనగును.

పరాభక్తు లైహికాముష్మిక సంపదలకేగాక మోక్షార్థముగూడ భగవంతునిఁ బ్రార్థింపరు. ఈ సంగతిని భక్తిప్రబోధక గ్రంథములేగాక భక్తుల చరిత్రలుగూడఁ బ్రకటించుచున్నవి. ఈ రహస్యంబును దెల్పుటకై మహర్షి యీ సూత్రమందు 'కించిత్' అను పదంబును బ్రయోగించెను. ఆ పదప్రయోజనం బదియని గ్రహింపవలయును.

ముక్తులలోఁగూడ రెండు తెగలు గలవు. అందొక తెగవారు ఆత్మ ముక్తియందే తగిలియుందురు. ఇంకొక తెగవారు తాము ముక్తులగుటయేగాక యన్య ప్రాణుల ముక్తికిఁగూడఁ బాటుపడుదురు. అట్టి మహాత్ములైన రంతిదేవాదుల చరిత్రలెన్నో మనపురాణంబులందుఁ గలవు. బుద్ధుఁడు, క్రీస్తు, శ్రీరామకృష్ణపరమహంస మున్నగు నిదానీంతను లీతెగలోఁ జేరుదురు. సంసారసాగరమందు మునింగియున్న వారి నుద్ధరింపవలయుననెడి యీ కోరిక యహంకారప్రేరిత వాంఛలవంటిదిగాదని యెఱుంగవలయును.

బుద్ధుఁడు లోకోద్ధరణార్థము మరల మరల జన్మింతుఁ గాక అనెడి తలంపుతో నిర్వాణానందంబునుగూడఁద్యజించెను. వివేకానందస్వామిగారు బ్రాహ్మీభూతుఁడనై యానందాబ్ధిలో మునింగియుందునని శ్రీరామకృష్ణపరమహంస గారితో ననెను. ఆమాటవిని 'ఈ తలంపు భవదన్యులకు నొప్పుఁగాని నీయెడఁ బొసఁగదు. నీవలన నింతకన్న విశేషంబు నపేక్షింతు'నని వారు బదులాడిరి. వివేకానందుల వారు వారి స్వకీయ ముక్తికిఁగా మాత్రమే ప్రాఁకులాడఁగూడదనియు లోకకళ్యాణార్థము పరిశ్రమింపవలసినదనియుఁ పరమహంసగారి తాత్పర్యము. పరమహంసగారంతతో మిన్నకుండరైరి. ఒకనాఁడు వివేకానందులవారిని బిల్చి లౌకికభోగార్థము దేవినిఁ బ్రార్థింపుమని వారితోఁ జెప్పెను. అట్లే వివేకానందులవారు పెక్కుసార్లు ప్రయత్నించిరి గాని యది వారికి సాధ్యముగాదయ్యెను. ఏల సాధ్యపడలేదని పరమహంసగారు వారినడిగిరి. దేవినిగూర్చిన తలంపు లోన నుదయించినంతనే, లోకమే మఱపునకు వచ్చుచున్నదని వారు జవాబు చెప్పిరి. కాఁబట్టి నిక్కమైన భక్తులకు భోగకాంక్ష యుదయింపదు. వారి జీవితము పరోపకారార్థము వినియోగమగుచుండును. పాపాత్ముల నుద్ధరించుటకై క్రీస్తువు తన జీవితకాలమెల్ల అనుతాపపడుటయేగాక, తుదకు తన ప్రాణంబులనుగూడ ధారవోసెను. అరబ్బీలకు వాస్తవమైన మతతత్త్వంబును బోధించుటకుగా మహమ్మదు ఎంతో పాటుపడెను. భక్తులు లోకోపకార పరాయణులై వర్తింతురనుటకు నెన్నో తార్కాణములు గలవు. లోకోప

కార్థమైన యిట్టి కోరిక పరాభక్తులకు నుండుట తగునను తలంపు మహర్షికిఁగలదు. అందులకు వాని చరిత్రయే నిదర్శనము.

'న శోచతి' అనునది దుఃఖాభావంబును సూచించును. దుఃఖములు సాత్త్వికరాజసిక తామసికంబులని మూఁడు విధంబులు. అట్లే సుఖంబులుగూడ మూఁడు విధములు. సుఖంబునంటి దుఃఖముండును. ఈతత్త్వంబును శ్రీ భగవానుఁడు గీతలోఁ జెప్పెను. ఈ దుఃఖంబులను క్లేశములందురు. ఇవి యన్నియు—ఆత్మసాక్షాత్కారమందిన వానికి మాత్రమే నశించును. ఏల యందురా? అతఁడు సర్వద్వంద్వాతీతుఁడై యుండుటయే కారణము.

అట్లనుటవలన భక్తుని హృదయమునందు జాలి యనునదియే లేక యది శిలాకర్కశంబుగా నుండునని భావింపరాదు. భక్తుఁ డెల్లజీవులను ఆత్మసములుగాఁ జూచునప్పుడు పరుల సుఖదుఃఖంబులు వానికిఁ దెలియకుండవు. దుఃఖభాగులకై యతఁడు కరుణపడఁడని యెన్నరాదు. కరుణ యనునది భగవల్లక్షణంబులలో నుత్తమోత్తమ లక్షణము. అట్టికరుణంజేసియే భగవంతుఁడు లోకదుఃఖ నివారణార్థము తాను స్వయముగా నవతరించుచున్నాఁడు. ఇంతకన్న మిక్కిలియైన కరుణగాని త్యాగముగాని కలదా? పరాభక్తుఁడు భగవల్లీనుఁడుగాని వేఱుగాఁడు. భగవంతుని యందు లీనమైనవానికి భగవల్లక్షణంబులలో నుత్తమోత్తమ లక్షణంబైన కరుణ లేకుండునా?

ప్రేమ భావంబు లెల్ల దైవీకరుణారసార్ద్రంబులని తలంపరాదు. సుతునియందలి తల్లి వాత్సల్యంబును, వేఁట కుక్కయందు వేఁటగానికిఁ గల యాదరంబును, కృషీవలునకు వాని దుక్కి యెద్దువలనఁగల ప్రీతియు నివి కరుణా లక్షణంబులుగావు. ఇవియెల్ల నాత్మార్థములైన కరణాభాసంబులు. భక్తునికరుణకు స్వార్థమే గలుగదు. అది నిర్హేతుకమై పొరలివచ్చును.

అన్యులకై భక్తులు అనుతాపపడుదురా యని శంకింపఁ బనిలేదు. ఈ క్రింది ప్రహ్లాదుని పలుకులే యందులకు నిదర్శనము.

"నైవోద్విజే పర దురత్యయ వైతరణ్యా స్త్వ ద్వీర్య గాయన మహామృత మగ్నచిత్తః। శోచే తతో విముఖ చేతస ఇంద్రియార్థ మాయా సుఖాయ భరముద్వహతో విమూఢాన్ ॥ ప్రాయేణ దేవ మునయః స్వవిముక్తి కామా మౌనం చరంతి విజనే నపరార్థనిష్ఠాః। నైతాన్ విహాయ కృపణాన్ విముముక్ష ఏకో నాన్యం త్వదస్య శరణం భ్రమ తోఽనుపశ్యే ॥" (భాగ. స్కం. 8-9-43-44).

"స్వామీ! నీ మహిమలను బాడుచుండుటచేతఁ గలిగెడి పరమానందరూపమైన యమృతసాగరములో నా చిత్తం బెప్పుడు నోలలాడుచున్నది. వైతరణీప్రవాహము నరకలోక మందలిది పరులకు దుస్తరమైన నగుఁగాక. నాకుఁ జిఱు కాల్వ యగును. నాకై నే నంతగాఁ జింతపడుటలేదు. ఇంద్రియార్థములవలనఁ గలుగు మాయాసుఖంబులఁ దగిలి

దుర్భరమైన సంసార భారంబును దలమోయుచు అదే పరమార్థమనియున్న యీ మూఢుల యజ్ఞానంబును జూచి నంతనే నా గుండియ నీరగుచున్నది. వీరికై నాకు జనించు చున్న యనుతాపంబునకు మేరయే గలుగదు. ఈ శోకము దుర్వహమై నీ చింతనామృతంబునకుఁగూడ నన్ను దవ్వు చేయుచున్నది. వారిని గాదని నీ స్మరణామృతంబు నొక్క బిందువైనను జవిచూడనొల్లను. మౌనులు తమ ముక్తిని మాత్రమే గోరి గహనాంతర సీమలందు మౌనవ్రతులై చరింతురనియు, వారికిఁ గలుగని పరార్థనిష్ఠ నీకుమాత్రం బుండనేల యనియు నందువా? స్వామీ! ఈ కృపణులను వదలి నేనొక్కండఁ గృతార్థుఁడనగు కోర్కి నాకు రుచింపదు. వీరికెల్ల నీవే పరమగతి. భవదన్యులెవ్వరుఁ గలుగరు. వీరి భ్రమలు మాన్పి వారికి శరణంబవై తర్వాత నా సంగతి తలంపుము.''

ప్రహ్లాదుని యీ పల్కులందుఁ బరోపకారపరత్వము స్వార్థత్యాగంబు నెంత యున్నదో గ్రహింపనగును. జీవితము పరార్థమే గాని స్వార్థము గారాదనియు, శిబిచక్రవర్తి, జీమూతవాహనుఁడు, దధీచి మున్నగు మహాత్ములఁ జూచి నైనను మూఢులు నేర్చుకొనవలసినదనియు మన పురాణంబులు ఘోషించుచున్నవి. కావున మనుష్యులకుఁ బరమ కర్తవ్యమేదో గ్రహింపనగును.

పరాభక్తునకు ద్వేషముండదని 'న ద్వేష్టి' యనునది బోధించుచున్నది. ద్వేషమనఁగా నేమి? కోరికను సాధించు

టకై చేయు ప్రయత్నంబునకు నెవరేని యడ్డుకలిగించి నప్పుడు వారియెడ జనించు భావంబును ద్వేషమందురు. అనఁగా నడ్డుపాటును దొలఁగించుటకైన యాగ్రహము ద్వేషమగును. కామమే ప్రతిహతమై ద్వేషరూపంబునఁ బరిణమించుచున్నదని భావము. దీనింబట్టి ద్వేషమునకుఁ గోరికయే బీజముగా నేర్పడుచున్నది.

కోరిక యెప్పుడు లేదో యప్పుడే ద్వేషాంకురంబునకుఁ దావు గలుగదు. పరాభక్తునకుఁ గోరిక లేకుండుట వలన వానికి ద్వేషకారణముండదు. ఈ భావంబును 'న ద్వేష్టి' యనునది సూచించుచున్నది.

శుభాశుభంబులెల్ల భగవదిచ్ఛానుసారంబుగాఁ గలుగుచుండుననియు, అశుభము గలిగినప్పుడు దానిని ద్వేషించుట భగవదిచ్ఛను ద్వేషించుటే యగుననియు, భగవదిచ్ఛను ద్వేషించుటనఁగా భగవంతుని ద్వేషించుటే యనియు భక్తుఁడు భావించును. అంతియగాదు. భక్తుఁడు దేనినైనను సహించును గాని భగవత్తిరస్కారంబునుమాత్రము సహింపఁడు. మఱియు భగవంతునివలనఁ గలుగునది యెద్దియైనను అది వాని ప్రేమచిహ్నంబుగనే భక్తుఁడు త్రిశుద్ధిగ విశ్వసించి దానినిఁ బ్రీతిపూర్వకంబుగా గ్రహించును. ఈ కారణంబునఁగూడ భక్తునకు ద్వేషభావము దూరమగుచున్నది.

అట్లగుచో భక్తులు లోకకంటకులయెడ సయితము ప్రేమను జూపవలసినదేనా ? వారి నాగ్రహింపఁగూడదు గదా ? అను శంక గలుగవచ్చును.

ద్వేషభావంబునకు నాగ్రహంబునకు నెంతో భేదము గలదు. ద్వేషించినవానిని దుదముట్టింపవలయునను తలంపు రూఢముగా ద్వేషభావంబునందుఁ గలదు. ఎవనిపై నాగ్రహింతుమో యతఁడు బాగుపడవలయుననెడి తలంపు రెండవ దానియందున్నది. కాఁబట్టి యాగ్రహమందుఁ బ్రేమ యంత ర్యాతమై యుండును. ద్వేషంబునం దట్లుగాదు. ఈ తార తమ్యంబును గ్రహింపవలయును.

భక్తులు సంఘదురాచారంబులనుగాని వ్యక్తిదుర్గుణం బులనుగాని ప్రేమింపరు. వారట్టివాని నాగ్రహింతురు. వారి యాగ్రహ తాత్పర్యము పైన వివరింపఁబడెను. కాఁబట్టి యట్టిసందర్భములలో భక్తుల యాగ్రహంబును బ్రేమాభావం బనిగాని ద్వేషంబనిగాని యూహింపరాదు. తల్లి తన శిశువు నాగ్రహించుటవలె భక్తులచర్య యిట్టి పట్లనుండును.

శ్రీరాములవారును శ్రీకృష్ణభగవానులును కేవల ప్రేమమూర్తులనియు వారికి రాగద్వేషంబులు లేవనియు లోకంబు తలంచుటయే గాక వారు స్వయముగాఁ గూడఁ జెప్పిరి. 'సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః' అను గీతావచనమే యిందులకు దృష్టాంతము. విరాధరావణాదులను శ్రీరాముఁడును, గంసనరకాసురాదు లను శ్రీకృష్ణుఁడును జేతులార సంహరించిరి. ఇది ద్వేషము గాదా ? అని శంకింపవచ్చును.

పైనఁ జెప్పినవారు లోకకంటకులు. లోకరక్ష ణార్థము శ్రీరామాదు లవతరించిరి. లోకరక్షణార్థమై వారు

రావణాదులను సంహరించిరే గాని యాత్మార్థముగాదు. ధర్మసంస్థాపక విషయంబున నిట్టివి బాహ్యదృష్టికిఁ గ్రూరంబులుగా ద్వేషపూరితంబులుగాఁ గాన్పించినను వాస్తవము విచారించినచో నవి యట్టివి కానేరవు. ద్వేషశబ్దమునకుఁ గల యర్థంబును జక్కఁగా గ్రహించి యాదృష్టితో విచారించినచో రామకృష్ణాదుల యీ కార్యంబులందు ద్వేషభావమే గలుగదని స్పష్టపడును.

ఇట్టి వధలు ద్వేషఫలంబులు గాకున్నను ప్రేమాభావంబును స్పష్టీకరించునుగదా యనియు, దయామూర్తులకు నది తగునా ? యనియు శంకింపవచ్చును. రామకృష్ణాదులు గావించిన వధలందుఁ బ్రేమభావంబు పూర్ణముగాఁ గలదని యంతర్భావంబున విచారించినచో స్పష్టపడును. ఎట్లందురా? రావణాదులు పరమదుష్టాత్మకులై యుండిరి. వారి దౌష్ట్యంబు వారి దేహంబులున్నంతదాఁకఁ దగ్గునది కాదు. వారట్టివారగుట శాప ఫలము. శాపంబులకు నవధియుఁ గలదు. శాపంబులు అక్షరాక్షరంబుల జరుగవలయును. వానిని దాఱుమాఱు చేయరాదు. దుష్టులు బాగుపడుట ముఖ్యాంశము. వారిని బాగుచేయవలెననెడి తలంపు ప్రేమ ఫలమే గాని వేఱుగాదు. శాప ఫలమై వచ్చిన యుపాధులున్నంత కాలము వారికి మేలుగలుగు మార్గములేదు. భగవంతుఁ డిన్ని భావంబుల మది నిడికొని, యాదుష్టుల నుపాధులను దొలఁగించెను. ఈ దృష్టితోఁ బరిశీలించినచో వారి వధలు ద్వేషాదిఫలములు గానేరవు. వడ్డీవ్యాపారముతో జీవించు చున్నవారిని దేవాలయంబునుండి క్రీస్తువు తరుమగొట్టుట

యందును, భగవంతుఁ డొక్కఁడే యని భక్తిచేయు తన మతస్థులను బాధించినవారిని మహాత్ములుగారు శిక్షించుట యందును వారికిఁ గల భావం బిట్టిదే గాని వేఱుగాదు. మహాత్ముల చర్యలను బాహ్యదృష్టితో విమర్శించి సిద్ధాంతీకరించుట ప్రమాదమగును.

మఱియు రామాదులెల్లరు నధికారపురుషులు. వారి యవతారంబులును వారి చర్యలును లోకాతీతంబులు. ఈ సంగతి మఱవరాదు.

'న రమతే' భక్తుఁ డెందును సంతోషింపఁడనియర్థము. అట్లనుటవలన భక్తుఁడు సర్వభావ శూన్యుఁడై ఱాయివలె నుండునని తాత్పర్యముగాదు. సుఖసంతోషంబులెల్ల సామాన్యులందు నింద్రియకార్యములై యుండును. ఇంద్రియ వ్యవహారమెల్ల నహంకారముపై నాధారపడియున్నది. అహంకారమన్ననో, అది యవిద్యాఫలమేగాని వేఱుగాదు. భక్తుని యందు అహంకారము నశించియుండును. దానంజేసి యహంకార ప్రేరితేంద్రియంబులవలనఁ గలుగు సుఖమే యతఁడెఱుంగఁడు. వాఁడు నిరంతరము నాత్మారాముఁడై యుండును. అంతకుమించిన సంతోషమేగలుగదు. భక్తుని సంతోషంబు తద్విధమైనదనియు, ఇంద్రియజన్యంబులును క్షణికంబులునైన సంతోషంబులవంకఁగూడ భక్తుఁడు తలఁ ద్రిప్పఁడనియు, వాస్తవము విచారించినచో నాత్మానందమే యానందముగాని తక్కినవి యానందంబులే గావనియు 'నరమతే' అను ముక్క బోధించుచున్నది.

భక్తుని యానందము నిరవద్యంబును నిర్మలంబును విక్రియ లేనిదియునై యుండును. సామాన్యుని యానందంబు తద్విరుద్ధమై తుదకు దుఃఖరూపంబున వికారము చెందును. సామాన్యుఁ డానందానుభవకాలంబున నహంకారవృత్తిలో నుండును; భక్తునియం దట్టి యహంకారవృత్తియే యుండదు. సామాన్యుఁ డొక యానందంబుననుభవించిన తర్వాత నంతకన్న మిక్కుటమైనదాని ననుభవింపఁ దలంపు గలిగియుండును. అనఁగా వాని యానందం బెప్పుడును నపూర్ణము. భక్తుని యానందంబు పరిపూర్ణంబు నఖండంబునై యుండును.

ఈ సూత్రములో 'నోత్సాహీ భవతి' అనుటవలన భక్తుఁడేమియుఁ జేయక మిన్నులు మీఁదఁబడ్డను జట్రాతివలె నుండవలయునని తాత్పర్యముగాదు. భక్తునకుఁ గోరఁదగిన కోరికలు లేవు గావునఁ దద్విధమైన వ్యవహారము వానికిఁ గలుగదనియు, బాహ్యదృష్టికిఁ గష్టముగానుండునది ప్రాపించినను, సర్వము నీశ్వరేచ్ఛానుసారముగాఁ గలుగుచుండు ననియు, అట్లు కలిగినదెల్ల శుభమునకే యగుననియు భావించి తన్నిరోధరూపకార్యమునే యతఁడు తలపెట్టఁ డనియు, అట్లుండుటవలన భక్తుఁడు స్పర్శాది జ్ఞానశూన్యుఁ డని భావింపరాదనియు గ్రహింపవలయును.

'నోత్సాహీ భవతి' అనుదాని భావమునే గీతలోని 'సర్వారంభ పరిత్యాగి' యనునది తెల్పుచున్నది. సర్వారంభ పరిత్యాగ మెట్టిదందురా? ఆత్మార్థమై యుద్యమింపకుండుట

యని భావము. 'సర్వారంభ పరిత్యాగి' యన్నప్పుడు దానికి నపార్థముగావించి ప్రమాదపడకుండుటకై దానికి వివరణంబుగా శ్రీకృష్ణభగవానులు గీతయందు

శ్లో. 'నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతేహ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ 3-5.

అని వచించి, దీని భావంబును

శ్లో. 'కామ్యానాం కర్మణాం న్యాస సన్న్యాసంకవయోవిదుః,
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః''
18-2.

యని విస్తరించి తెలిపెను. దేహమున్నంతకాలము దాని వ్యవహారము తప్పదు. ఈ విషయంబున భక్తునకును (జ్ఞానికిని) సామాన్యునకును భేదమే గల్గదు. కాని సామాన్యుని దేహావ్యవహారమెల్ల నహంకార ప్రేరితమై జరుగుచుండును; భక్తుని దేహావ్యవహారమందు నహంకార ప్రేరణంబునకే యవకాశములేదు. అది యీశ్వరప్రేరణంబున వర్తించుచుండును. సామాన్యుని వ్యవహారము అహంకారప్రేరితమగుటంజేసి యా వ్యవహారంబులకుఁ దాను కర్తయనియు, ఫలంబునకు దాను భోక్తననియు నతఁడు భావించుచు సుఖదుఃఖంబులకు లాభాలాభంబులకు సంతోషశోకంబులఁ జెందుచుండును. భక్తునకుఁ గర్తృత్వ భోక్తృత్వ భావంబులే లేవు గావున వానికి వాని వ్యవహారఫలంబుతో జోక్యమే యుండదు.

శ్లో. 'సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథాకుర్వంతి భారత।
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తః చికీర్షుః లోకసంగ్రహమ్॥
గీ. 3-25.

శ్లో. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః।
గుణా గుణేషు వర్తంత ఇతిమత్వా న సజ్జతే॥
గీ. 3-28.

శ్లో. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥
గీ. 3-33.

అను శ్లోకంబులు భక్తుని వ్యవహార తత్త్వంబును బోధించు చున్నవి.

సంగతి యట్లుండగా జ్ఞానికి సర్వవ్యవహారవిరక్తి విధి విధానముగా శ్రీ శంకరభగవత్పాదులవారు చెప్పినట్లు కొందఱు భావింతురు. జ్ఞాని గుణాతీతుఁడు గావున గుణ ప్రయుక్తములైన వర్ణాశ్రమ ధర్మరూప కర్మములు జ్ఞానికి సంబంధింపవని శంకరులవారి తాత్పర్యమేగాని దేహవ్యావ హారముగూడ జ్ఞానికి లేదని వారెన్నఁడు నెచ్చటఁ జెప్పలేదు. కర్మకలాపమెల్ల అజ్ఞానావస్థకు సంబంధించినదేగాని జ్ఞానా వస్థకు సంబంధించినదిగాదని యాచార్యులవారి భావము. జ్ఞానికిఁగూడ వైదికకర్మంబులు విధివిధానంబులని కొందఱు వేదాంతులు పల్కిరి. వారి వచనంబులను ఖండించుచు నాచార్యస్వామివా రట్లు చెప్పిరి. అంతియగాదు. జ్ఞాని

వ్యవహారము కర్మమేగాదని వారి మతము. అందులకు నిదర్శనంబుగా భగవద్గీతలో 2–11; 3–25; 4–20; 5–7; 18–66 శ్లోకములకు వారు వ్రాసిన భాష్యముఁ జూడనగును. ఇదే భావంబును భాగవతము ఏకాదశస్కంధము 7–11 లో నిట్లు గలదు.

శ్లో. 'దోషబుద్ధ్యా భయాతీతో నిషేధా న్నివర్తతే।
గుణబుద్ధ్యా చ విహితం న కరోతి యథార్భకః॥

జ్ఞానికి ఇది గుణము ఇది దోషము అను భావమే గలుగదు. ఏలయందురా? అతఁ డెన్నఁడో గుణదోషబుద్ధికి నతీతుఁడయ్యెను. అగుఁగాక. వ్యవహారమన్నప్పు డది యెల్లప్పుడును మంచిదిగానే యుండనేరదు; మంచి చెడుగుల రెంటితోఁ గలసియుండును. జ్ఞాని గావున నతఁడు చెడుగు చేయనోపఁడు. అతఁడట్లు చెడుకార్యంబులను జేయకుండుట దోషబుద్ధిచేత నేగదా యని శంకింపవచ్చును. అట్లుగాదు. జ్ఞానియొక్క ప్రాక్తన సంస్కారమే వానిని జెడుకార్యంబుల నుండి మరలించుచుండునుగాని, యతఁడు మంచి చెడుగులను విచారించి చెడుగులు త్యజించుటగాదు. అట్లే విహిత కార్యంబుల విషయంబునఁగూడ నిది గుణమని జ్ఞాని వర్తించుటలేదు. పసిబాలుఁడెట్లు సంకల్ప వికల్పంబులు అనఁగా నిది చేయుదును ఇది వలదనెడి తలంపులు లేక వర్తించునో, జ్ఞానియు నట్లే సంకల్పవికల్ప రహితుఁడై వర్తించును. ఎప్పుడు సంకల్పాదులు లేవో యప్పుడే వానిపనుల ఫలాఫలంబులందు వానికి మమకార తిరస్కారంబులుగాని వాని

వలనఁ గలుగు రాగద్వేషంబులుగాని వానివలనఁగలుగు సంతోష దుఃఖంబులుగాని యుండవు. అర్జునునకును జ్ఞానికి నిందుఁ జెప్పఁబడిన సామ్యంబు సంకల్ప వికల్పరహితమైన వ్యవహారంబునందు మాత్రమే వర్తించునని గ్రహింప వలయును.

జ్ఞానియైనవాఁడు వైదికకర్మంబులను జేయవచ్చునా? లేదా? అను శంకగూడఁగలదు. జ్ఞాని కర్మములెల్లఁ బ్రతి ఫలాపేక్షారహితములై యీశ్వర ప్రేరితంబులై యుండునని చెప్పఁబడెను. వైదికకర్మంబుల విషయంబునఁగూడ నీశ్వర ప్రేరితమైనచో జ్ఞాని వానినిగూడఁ జేయవచ్చును. వానికి ఫలాపేక్ష యుండదు. కాఁబట్టి జ్ఞానియైనవాఁడు చట్రాయి వలెఁ బడియుండవలయుననుట శాస్త్రవిరుద్ధమేగాక పెద్దల యాచారముగూడఁ గాదనియు, జ్ఞానిగూడ ఇతరులవలెనే సర్వకర్మ ధర్మంబుల నీశ్వరేచ్ఛానుసారంబుగాఁ జేయు చున్నాఁడనియు, వాని వ్యవహారంబన్నదో సంకల్ప పూర్వ కంబును తదనుగుణ ప్రయత్నాధీనంబును మాత్రము గాదనియు, అతఁ డేమిచేసినను అది భగవత్సేవయే యను భావంబుతోఁ జేయుననియు, వానికి రాగద్వేషంబులు లేకు న్నను దుర్మార్గ దార్జన్యాదులయెడ నాగ్రహముమాత్ర ముండుననియు, అది ద్వేషముగాదనియు, వాని యానందంబు లౌకికవిషయ సంబంధమైనది కాదనియు నిరంతరము భగవ ద్భక్తి సేయుటయే వానికి నానందముగా నుండుననియుఁ బైని వ్రాసినదానివలన స్పష్టపడును.

జ్ఞానికి కర్మము చేయుటకు సాధ్యమా? కాదా? అను ప్రశ్న గలదు. జ్ఞానికి కర్మాచరణము సాధ్యమే యని శ్రీ శంకరులవారు 'కామప్రహాణేతు' అని బృహదారణ్యక భాష్యములోను, 'విదుషామపి' అను గీత 4–20 భాష్యము లోను సూచించిరి. విద్యారణ్యులవారుగూడ పంచదశి. ప్ర. 7 లో 'విద్వాంశ్చేత్' అనుచోట అదేభావంబును దెలిపిరి. కావున జ్ఞానికి కర్మము శక్యమే యనుట స్పష్టము. శుకాదులు జ్ఞానులుగారా? శుకుఁడు లోకకళ్యాణార్థము భాగవతంబును బలుకలేదా?

జ్ఞానులు ప్రవృత్తులనియు, నివృత్తులనియు రెండు తెగలు గలరనియు, జ్ఞానికి వాని జీవితము గడపుటకు రెండు స్వతంత్రమార్గములున్నవనియు నిర్ణయించి, కొందఱు జ్ఞానులు తమ యిచ్ఛానుసారముగా లోకసంగ్రహమొనర్తురనియు, గీత 4–19 లో ఆచార్యులవారే తెలిపిరి. జ్ఞానుల కర్మము ఐచ్ఛికమాత్రమై యుండును.

మఱియు ఏ వర్ణమువాఁడైనను జ్ఞానికావచ్చుననియు, బ్రాహ్మణవర్ణ జ్ఞానికిమాత్రమే సన్న్యాసాధికారమున్నదనియు సూచించిరి. ఈ వర్ణవిభాగము మరలఁ బ్రతి వర్ణములోఁ గలదు. కావుననే జననమాత్రముచేత బ్రాహ్మణులందరు సన్న్యాసయోగ్యతఁ బడయరైరి.

జ్ఞాని యనఁగా భావమేమి? సర్వము బ్రహ్మాత్మకమే గాని తద్భిన్నముగాదను దృఢభావమే జ్ఞానము. బ్రహ్మా భిన్నము గాదన్నప్పుడు లోకము సర్వశూన్యమనుటగాదు.

అదియు బ్రహ్మాత్మకమే యని భావము. ఆ భావముతో జ్ఞాని వర్తించును. ఆ వర్తనమే లోకదృష్టికి భగవత్సేవ యగును.

ముక్తిని సంపాదించుటకై 1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానసత్వము, 4. సత్వాపత్తి, 5. అసంసక్తి, 6. పదార్థభావన, 7. తురీయము అని సాధనంబులు 7 చెప్పఁబడియున్నవి. ఆత్మ అనఁగా ఏమో యెఱుంగు సంకల్పము శుభేచ్ఛ యనఁబడును. అనాత్మపదార్థంబులను బరిత్యజించుటయే దీనికి మార్గము. అద్వైతమునుగూర్చి చెప్పు శాస్త్రములను గాఢముగా విచారించుట విచారణయగును. ద్వైతభావమును క్రమక్రమముగాఁ దగ్గించుకొనుచు వృత్తిజ్ఞానంబు లేకుండఁ జేసికొనుట తనుమానసత్వమగును. ఈ మూఁడవస్థలను దాఁటినవాఁడు అద్వైతసిద్ధుఁడనఁబడును. తక్కిన నాల్గవస్థలందు జ్ఞాత జ్ఞేయము, జ్ఞానము అనువానికిఁ గల సంబంధమునుగూర్చిన ద్వైతభావముగూడ నశింపగును. అందు సత్వాపత్తి అను నాల్గవ యవస్థయందు అద్వైతభావము మిక్కుటముగాఁ బ్రకాశించును. వానిని బ్రహ్మవేత్త అని పేర్కొందురు. ఈ స్థితిలో నున్నవాఁడు వాని ప్రారబ్ధకర్మానుసారముగా లోకకళ్యాణార్థము పాటుపడును. అసంసక్తి యనెడి అయిదవ యవస్థయందు సంకల్పంబులుగాని మనోవృత్తులుగాని యుండవు. అప్పుడు వానికి ద్వైతభావము వాసనామాత్రముగాఁ గూడ నుండదు. వానిని బ్రహ్మవిద్వరుఁ డందురు. వానికి దేహంబున్నదను భావంబుండును గాని దానియం దెట్టి యాసక్తియు నుండదు.

పదార్థభావన అనెడి అవస్థకు వచ్చినప్పుడు త్రిపుటీజ్ఞానము గూడ నుండదు. అనఁగా దేహభావముగూడ నుండదు. అతఁడు సమాధిస్థుఁడై యుండును. వానిని బ్రహ్మవిద్వరేణ్యుఁ డందురు. తురీయావస్థకు వచ్చిన వానిని బ్రహ్మవిద్వరిష్ఠుఁ డందురు. వాఁడు బ్రహ్మమే యగును. అతఁడు పరమశాంత స్థితితో నుండును. దీనినే బ్రహ్మానందమందురు.

ఆనందము 1. విషయానందము, 2. ఆత్మానందము, 3. అద్వైతానందము, 4. నిజానందము, 5. ముఖ్యానందము, 6. బ్రహ్మానందము, 7. వాసనానందము, 8. విద్యానందము అని స్వాంతర్భేదములనుబట్టి విభజింపఁ బడెను. సాత్త్వికస్థితియందు బ్రహ్మాభాసము గల్గినప్పుడు గలుగు మానసిక సుఖము విషయానందమగును. సమాధి స్థితియందు గలుగు సంవృత్తి ఆత్మానందమగును. ఇది ఆత్మ సాక్షిమాత్రమనెడి భావంబు గల్గుటవలన జనించు సుఖ రూపముగా నున్నది. భోక్తృ భోగ్యరూపములైన ద్వైత భావంబులేని స్థితిని సాధించునప్పుడు గల్గు సుఖము అద్వైతా నందమగును. ప్రారబ్ధకర్మఫలములైన సుఖదుఃఖంబులకు దూరమై సమత్వస్థితిలో నున్నప్పుడు కలుగు సుఖము నిజా నందమగును. అహంకారనాశనమగుటవలన నుండు సుఖము ముఖ్యానందము. బ్రహ్మజ్ఞానమువలనఁ గలుగు ఫలము బ్రహ్మానందము. అలసిన బాటసారి వేదే నొక సత్రమును జేరి సుఖముండునట్లుగా జీవుఁడు జాగ్రత్స్వప్నావస్థలందలి క్లేశములకు విసిగి బ్రహ్మమును జేరి శాంతించును. వాసనా

నందమనఁగా ప్రారబ్ధకర్మఫలముగా ఆనందమయమునుండి విజ్ఞానమయమునకుఁ బోవునప్పుడు గల్గు బ్రహ్మానందాభాస మనవచ్చును. ఆనందబోధము విద్యానందమగును. ఇందు భోగ్యవస్తుజ్ఞానమే యుండదు. దీనినే నిర్వికల్పసమాధి యందురు. ఇందు అనుభూతమగునది తృప్తిగాదు; సంతోషముగాదు; సుఖముగాదు. కేవలానందముగాదు. తత్త్వ మొక్కటియే యగును.

వేదాంతము ఎచ్చటను జడసమాధిని బోధింపదు. అది అద్వైతసమాధిని బోధించును. దీనిని చైతన్యసమాధి యనియుఁ గొంద అందురు. ఈ సమాధి నుండువారికి స్వధర్మము జరుగుచునేయుండును. అది అద్వైతభావముతో కర్తృత్వ భోక్తృత్వ రహితముగా జరుగుచుండును. వారే లోకోద్ధారకులు. అట్టి స్థితిని సంపాదించుటయే సర్వయోగ భావము. అట్టివాఁడే ముక్తుఁడు.

వేదాంతముయొక్క పరతత్త్వము పూర్ణము. ఆ పూర్ణమును వారివారి అవస్థాభేదములతో దర్శించి అట్లు దర్శించినదానిని వాక్కునకది అందినంతమాత్రము తెలిపిరి. ఈ రహస్యమును గ్రహింపఁజాలక మతభేదము లేర్పడి వివాద ములు వెడలెను. ఈ వివాదములెల్ల వేదాంతతత్త్వము యొక్క అంతర్భావములే గావున వేదాంతము వానినెల్ల అంగీకరించుచు, అంతకుఁబైనఁ గూడఁ గలదని 'నేతి నేతి' వాక్యములతోఁ దెలుపుచుఁ దుట్టతుదకుఁ బూర్ణమును జూపించుచున్నది.

ఈదృష్టి గలిగినవారు సర్వసత్త్వసుఖహితైకవర్తులగుదురు. ఇది వారికి ఉపాధి యున్నంతకాలము స్వధర్మమగును. అదియు నైజమగునే గాని బలవంత మాఘుస్నానము గానేరదు. అట్టివారే వాస్తవమైన ధీరులు. వారే జ్ఞానులును బరాభక్తులు నగుదురు.



సూ. యత్ జ్ఞాత్వా మత్తో భవతి, స్తబ్ధో భవతి,
ఆత్మారామో భవతి. 6

యత్ అనునది పూర్వసూత్రములందలి 'ప్రేమ', 'అమృత' అను వానిని సూచించును.

నాల్గవ సూత్రములోని ప్రేమస్వరూపంబును, ఐదవ సూత్రములోని అమృతస్వరూపంబును దెలిసినవాఁడు మత్తుఁడును, స్తబ్ధుఁడును, ఆత్మారాముఁడు నగును.

పరాభక్తుని విషయమే యీ సూత్రమందుఁగూడఁ జెప్పఁబడుచున్నది. పరాభక్తుని వ్యవహారంబునకు విధానము గాని పద్ధతిగాని యుండనేరదనియు, అతఁడు భగవంతునకు సర్వాత్మ సమర్పణంబుచేసి తల్లీనుఁడై ప్రత్యేకావస్థ యనునదే లేక యుండును గావున స్వబుద్ధిపూర్వకంబుగా స్వార్థముగా వ్యవహరించుచున్నాననెడి భావమే వానికిఁ గలుగదనియు, గాలికి నెండుటాకువలె నీశ్వరేచ్ఛానుసారంబుగా నీశ్వరసంకల్పంబులను అపగమ్యంబులు నగోచరంబులునైన వానిని గొనసాగించుటకుఁగా సాధనమాత్రుఁడై వర్తించు

చుండుననియుఁ జెప్పఁబడెను. ఆత్మారాముఁడై యట్లు వ్యవహరించుచున్నవాని వ్యవహారంబులు కొన్నియెడల లోకసామాన్యంబులుగా, అనఁగా వర్ణాశ్రమధర్మనిబద్ధంబులైన వైదికకర్మానుష్ఠానరూపకంబులుగా నుండవచ్చును. అతఁ డట్లు వ్యవహరించుట లోకులకు మార్గముఁ జూపు నిమిత్తమే గాని యాత్మార్థము గాదు. పరాభక్తుఁ డొక్కొక్కప్పుడు సర్వధర్మంబులను సమస్తాచారముల నుల్లంఘించి నిషిద్ధమార్గంబును ద్రొక్కి వర్తించుచున్నట్లుగాఁ గూడఁ దోఁచుచుండును. అప్పుడు వానిని ఆచారనిబద్ధమైన లోకంబు భ్రష్టునిగా భావించి నిందించుటయుఁ గలదు. మఱియు నతఁడొక్కొక్కప్పుడు నిర్వ్యాపారస్థితిలో సమాధ్యవస్థలో నుండి బాహ్యప్రపంచజ్ఞానమే లేక కేవల శిలారూపంబున నుండుటయుఁ గలదు.

పరాభక్తుని వ్యవహారం బట్లు చిత్రముగా నుండును గావున, బాహ్యలక్షణంబులఁబట్టి యతఁడు పరాభక్తుఁడో కాఁడో యని యెఱుంగుట సులభకార్యంబుగాదనియు, భక్తుఁడు బాహ్యదృష్టికి వ్యవహారపరుఁడై యున్నట్లు గాన్పించినను, అతఁడు అంతరంబునఁ బ్రశాంతుఁడై యుండుననియు, భక్తునియందుఁ బ్రశాంత వ్యవహారవృత్తులకు రెంటికిఁ గల ఏకకాలవ్యవహారంబు లోకాద్భుతంబుగా నుండుననియు, దానంజేసి బాహ్యలక్షణంబులు వ్యక్తితత్త్వనిర్ణయంబునకు అస్ఖలనరూపనిదానంబులు గావనియు మహర్షి యిందు **మూలంబున** సూచించుచున్నాఁడు.

ఈ సూత్రమందలి 'జ్ఞాత్వా' అను పదంబునకును బూర్వసూత్రమందలి 'ప్రాప్య' అను పదంబునకును గల భావవిశేషంబుల నిదానంబుగా మహర్షి యభిప్రాయంబును గ్రహింపవలయును. భగవత్ప్రాప్తి యన్నప్పుడు బ్రహ్మాది లోకంబును బొందుటవంటిది గాని, నూతనాధికారంబును బొందుటవంటిదిగాని కాదనియు, ప్రాప్యపదార్థము వానికి వెలుపల నెక్కడనో యుండునదిగాదనియు, అది యెల్లప్పుడుఁ దనలోనే యున్నదనియు, అది వైదికకర్మంబుల ఫలంబుగా నొండెఁ దపఃకర్మఫలంబుగానొండె, నుభయాత్మక ఫలంబుగా నొండెఁ బొందఁబడుచున్నది గాదనియు, అది పూర్వము లేనిదియు నిప్పుడు క్రొత్తగా వచ్చునదియుఁ గాదనియు, అది స్వతస్సిద్ధమును స్వయంప్రకాశమానంబునై యున్నను అహంకారాజ్ఞానావరణంబులయొక్క నిరోధంబునఁ గాన్పింప కుండుననియు, దాని తత్త్వంబు నెఱుంగుటయే దానిని బొందుటగుననియు, అదియే ప్రాప్యమనఁబడుననియు మహర్షి తెలుపుచున్నాఁడు.

'ప్రాప్య' అన్నపుడు ప్రాపక ప్రాప్యభావంబును, 'జ్ఞాత్వా' అన్నప్పుడు జ్ఞాన జ్ఞేయభావంబును సూచితంబులు. ఈ రెండవస్థలందు భక్తుని మనోవృత్తి యెట్లు పరిణామమందు చున్నది గ్రహింపవలయును. ప్రాపక ప్రాప్యభావంబునందు వృత్తివ్యాపారము గలదు. రెండవదానియందు వృత్తి స్తంభనము గలుగును. ఎప్పుడు వృత్తిస్తంభనంబగునో యప్పుడది ఏకాంతభక్తి యగును. ఆ స్థితిని బరాభక్తి యని కొందఱును, జ్ఞానంబని కొందఱును వచింతురు. ఇట్టి నామ

భేదంబునఁజేసి స్థితిభేదంబు నూహింపరాదు. ఆ స్థితిలో నున్న వానిని జ్ఞాని యన్నను భక్తుఁ డన్నను నొక్కటే యగును.

భక్తి యున్నచోట జ్ఞానంబును, జ్ఞానమున్నచోట భక్తియు నుండును. అవి రెండు నొకదానిని వదలి మఱి యొకటి యుండవు. ఏల యందురా? ఏకస్థితినే దృష్టిభేదము చేత భిన్నములుగా భావింతురు. అంతమాత్రానసే వస్తు భేదము గలుగదు.

శ్లో. "దైవీ హ్యేషా గుణమయీ
మమ మాయాదురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే
మాయామేతాం తరంతి తే॥" (భ.గీ. 7-14)

శ్లో. "బహూనాం జన్మనామంతే
జ్ఞానవాన్ మాం ప్రపద్యతే।
వాసుదేవ స్సర్వమితి
స మహాత్మా సు దుర్లభః॥" (భ.గీ. 7-19)

శ్లో. "జరామరణ మోక్షాయ
మామాశ్రిత్య యతంతి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న
మధ్యాత్మం కర్మచాఖిలమ్॥" (భ.గీ. 7-29)

శ్లో. "మహాత్మానస్తు మాం పార్థ
దైవీం ప్రకృతి మాశ్రితాః।

భజంత్యనన్య మనసో
జ్ఞాత్వాభూతాది మవ్యయమ్॥'' (భ.గీ.9-13)

శ్లో. ''తేషాం సతత యుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం
యేన మా ముపయాంతి తే॥''(భ.గీ. 10-10)

శ్లో. ''తేషా మేవానుకంపార్థ
మహామజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో
జ్ఞానదీపేన భాస్వతా॥'' (భ.గీ. 10-11)

శ్లో. ''భక్త్యా త్వ నన్యయా శక్య
అహమేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరంతప॥'' (భ.గీ. 11-54)

శ్లో. ''మాం చ యోఽవ్యభిచారేణ
భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్
బ్రహ్మభూయాయ కల్పతే॥'' (భ.గీ. 14-26)

శ్లో. ''యో మామేవ మసమ్మూఢో
జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం
సర్వభావేన భారత॥'' (భ.గీ. 15-19)

శ్లో. "బ్రహ్మభూతః ప్రసన్నాత్మా
న శోచతి న కాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు
మద్భక్తిం లభతే పరామ్॥" (భ.గీ. 18-54)

ఈ శ్లోకంబులెల్ల భక్తిజ్ఞానంబులు అవినాభూతంబులను భావంబును స్పష్టపఱచుచున్నవి. మఱియు గీత 12 వ యధ్యాయంబులోని భక్తినిగూర్చిన వర్ణనంబునకును, 13 వ యధ్యాయములోని జ్ఞానమునుగూర్చిన వర్ణనంబునకునుఁ దాత్పర్యమందు భేదం బంతగాఁ గాన్పింపదు. దీనింబట్టి భక్తిజ్ఞానంబులకు అవస్థాభేదంబుగాని, కాలస్థితిభేదంబుగాని గల్గదని శ్రీ భగవానుల తాత్పర్యముగా బోధపడును.

శ్లో. "భక్త్యా మా మభిజానాతి
యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా
విశతే తదనంతరమ్॥" (భ.గీ. 18-55)

అను శ్లోకంబునకు శ్రీ శంకర భగవత్పాదులవారి భాష్యంబునుబట్టి భక్తి యనునది జ్ఞానంబునకుఁ బూర్వాంగంబగునని కొందఱు భావించిరి.

శ్రీ స్వామివారు అపరభక్తి యట్టిదగునని యుద్దేశించిరే గాని పరాభక్తి యట్టిదని యుద్దేశింపలేదు. అపరభక్తి యెప్పుడును సాధనమాత్రమే యగును. సాధనము సాధ్యంబునకు నంగమగుట నిర్వివాదాంశము. జ్ఞానము భక్తికి

సాధనంబగునని శ్రీ రామానుజాచార్యులు మున్నగువారు మఱి కొందఱు వచించిరి. అపరజ్ఞానంబునుగూర్చి వారట్లు పల్కిరేగాని పరజ్ఞానంబునుగూర్చిగాదు. అపరజ్ఞానంబు సాధనమాత్రమే గదా.

వేయేల! ఉత్తమగతి యనునది ఒక్కటగునే గాని రెండు కాఁజాలవు. మఱియు నుత్తమగతికన్న నుత్తమమైన గతి మఱియొకటి యూహకుఁగూడ నందదు. అట్టి యుత్తమ గతికి ఎవరే పేరు పెట్టినను బెట్టవచ్చునుగాక. పేరు మార్పు వలన అసలు స్థితికి నెంతమాత్రము మార్పు గలుగదు.

భక్తికిని బ్రహ్మవిద్యకును భేదములేదా? అను ప్రశ్ననుగూర్చి శ్రీ మధుసూదనసరస్వతిగారు వారి 'భక్తి రసాయన గ్రంథమందు విమర్శించి, భక్తియు బ్రహ్మవిద్యయు నొక్కటే యైనను, వానియొక్క స్వరూపసాధన ఫలాధి కారంబులందు మాత్రము భేదమున్నదని నిర్వచించి యీ విధముగా వ్రాసిరి :

(1) భక్తియందుఁ జిత్తము ద్రవీభూతమై ప్రేమా కారంబును దాల్చుచున్నది. బ్రహ్మవిద్యయందుఁ జిత్తము ద్రవీభూతముగాదు. అది యేకాగ్రవృత్తితో నవ్యక్తమందు నిల్చుచున్నది. (2) భక్తియందు మనస్సు సవికల్పంబుగా నుండును; బ్రహ్మవిద్యయం దది నిర్వికల్పము. (3) భక్తికి భగవల్లీలావిశేషజ్ఞానంబు సాధనంబగును; బ్రహ్మవిద్య యందుఁ దత్త్వమసి యనునట్టి యుపనిషద్వాక్యజ్ఞానము సాధనమగును. (4) భక్తికి భగవత్ప్రీతి ఫలమగును;

బ్రహ్మవిద్యకు అజ్ఞాననాశనము ఫలంబగును. (5) భక్తి యందుఁ బ్రాణిలోకంబునకెల్ల నధికారము గలదు; బ్రహ్మవిద్యకు సాధనచతుష్టయాది సంపత్తి తప్పక యుండ వలయును.

ఈ భేదమెల్ల సాధనక్రమసంబంధమే గాని అనుభూతి సంబంధంబు గాదనియు, సాధకులు వారికి యోగ్యమైన మార్గమును ద్రొక్కి ఏకమైన గంతవ్యంబును జేరవచ్చు ననియు, ఈ రెండు మార్గములందు హెచ్చు తక్కువలు లేవనియు నిశ్చయించిరి.

ఈ సూత్రమందలి 'మత్తో భవతి' అనునది భక్తి రసంబును గ్రోలిన భక్తుఁడు మకరందంబును గ్రోలిన మత్త భృంగంబు రీతి మైమఱచి విహరించుచుండునను భావంబును సూచించును. భక్తిరసంబును మధువునకుఁ బోల్చుట వైదిక సాంప్రదాయము మాత్రమే గాదు. సుఫీ మతస్థులును, క్రైస్తవ మతస్థులు నట్లే పోల్చిరి. భక్తిరసపానప్రభావం బును మహోరసోల్లిసితంబుగా 'మందార మకరంద' అను పద్యంబున భాగవతము వర్ణించెను. ఈ భక్తిరసముయొక్క శక్తి యింతనరాదు. 'మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్' అను వాక్యము భక్తిరసమహిమను సుంత వివరించును.

ఈ రసపానమత్తుఁడు భగవంతునిదక్క మఱియొండు లక్ష్యమే చేయఁడు. నిదర్శనము వలయునందురా? రోము దేశచక్రవర్తివంటివానిని ఏసుక్రీస్తు లెక్కచేయకపోవుటయు,

ముల్లోకంబులను దన కనుసన్నల నడిపించుచుండిన హిరణ్యకశ్యపునిఁ బ్రహ్లాదుఁడు చీరికిఁ గొనమియు నిదర్శనంబులుగా గ్రహింపవచ్చును. వారిని వారి భక్తిరస పారవశ్యం బట్లు చేయించెను.

భక్తుల చర్యలు భగవల్లీలలవలె దురూహ్యంబులు. వా రెప్పు డేమి చేయుదురో యూహింపఁగూడఁ దరముగాదు. వారు వారి బుద్ధికి లోనై వర్తించువారు గాకుండుటయే యిందులకుఁ గారణము. వారు నిరంతరము భగవదధీనవర్తనులై భగవదిచ్ఛానుసారంబుగా వర్తించుచుండుటం జేసి వారి వర్తనంబులు ఒక్కొక్కప్పుడు శాస్త్రాచారంబులకు లోఁబడియుండనట్లు కాన్పించును. వేయేల! లోకదృష్టికి భక్తులు, నున్మత్తులు నొకటిగా నుందురు. ' అయిన నున్మత్తుల చర్యలు ధర్మబాహ్యంబులుగా నుండును. భక్తుల చర్యలు మాత్రము ధర్మబాహ్యంబులు గానేరవు. [ధర్మ మనఁగా నీశ్వరేచ్ఛయే గాని మానవకల్పితంబు గాదని గ్రహింపవలయును.]

ఒక భక్తుఁడు పశులను దోఁబుట్టువులుగా నెంచి వానికి భక్తిని బోధించెను. ఒక భక్తుఁడు తోఁడేలును సహోదరునిగా నెంచి దానికి హితము గఱపెను. ఒకఁడు మేఁక కొఱకుఁ దన ప్రాణమిచ్చెను; ఒకఁడు లోకపాపంబును దాను గ్రహించి, తన మరణంబునకుఁ గారకులైనవారినే దీవించెను. ఇవియెల్ల మనదృష్టికి బిచ్చిపను లగునుగదా. భక్తుఁ డొకపరి నవ్వును; ఒకపరి యేడ్చును; ఒకపరి

నృత్యమాడును ; ఒకపరి పాడును ; కట్టుబట్ట యున్నదియు లేనిదియు నెఱుంగకయే సంచరించును. ఇవి యున్మత్తవ్యవహారములే గదా.

శ్లో. ''ఏవం వ్రత స్స్వప్రియ నామకీర్త్యా
జా తానురాగో ద్రుతచిత్త ఉచ్చైః।
హ సత్యసౌ రోదితి రౌతి గాయ
త్యున్మాదవన్నృత్యతి లోకబాహ్యః॥''
(భా. 11-2-40)

భక్తుఁడు వానికిఁ బ్రేమస్థానమైన హరిని గీర్తించుట వలని యనురాగవిశేషంబున ద్రుఢచిత్తుఁడై భగవద్దర్శనంబైనప్పుడు 'అహో! నా భక్తికిఁ బరాజితుఁడవై వచ్చితివా?' అని నవ్వును. భగవద్దర్శనంబునకుఁ గొంత వ్యవధి గల్గినప్పుడు 'స్వామీ! నన్నుపేక్షించితివా?' అని యేడ్చును. ఇంకను గొంత విలంబమగునేని 'ఏమి! నా మొఱ యాలకింపవా? అట్లయిన నిదిగో చూడు ని న్నేమిచేయుదునో' యని యాగ్రహపడును. భగవద్దర్శనమైనంతనే 'అహో! నీ యనుగ్రహం. బెంతనవచ్చు' నని యానందించుచుఁ దత్పారవశ్యంబునఁ గీర్తించును. పిశాచగ్రస్తునివలె నృత్యమాడును. ఇవియెల్ల వివశుని చర్యలే గదా.

ఈ సూత్రమందలి 'స్తబ్ధ' శబ్దము నైష్కర్మ్య పర్యాయముగాఁ బ్రయోగింపఁబడినది. నైష్కర్మ్య మనఁగా నెట్టిదో గీత వేనోళ్లఁ జాటుచున్నది.

శ్లో. "కర్మణ్యకర్మ యః పశ్యే
దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు
స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥"

అను శ్లోకభావంబును గ్రహించినచో నైష్కర్మ్యతత్త్వము సమగ్రంబుగా బోధపడును.

ఈ సూత్రమందలి 'ఆత్మారామ' శబ్దమువలన భక్తుని దదేకపరాయణత్వము సూచితము. భక్తుఁ డట్లాత్మారాముఁడై యున్నచో సర్వవ్యాపారశూన్యుఁడే గదా యని తలంపవలదు. భక్తుని వ్యాపారతత్త్వమెల్లఁ బైన వివరింపఁబడెను.



## సూ. సా న కామయమానా, నిరోధరూపత్వాత్. 7

పరమ ప్రేమరూపమైన యీ భక్తియనునది లౌకిక వస్తువులందలి ప్రీతిరూపమగు కామము కాదు. మఱి యేమనిన దానికి వ్యతిరేకమైన దగును.

భక్తికినిఁ గామంబునకునుగల భేదంబును ఈ సూత్రము తెలుపుచున్నది. భక్తిభావమందుఁ జిత్తమెప్పుడు నింద్రియానందంబునకు విముఖమైయుండును; కామభావమునందది యింద్రియవశమై యదేలోకంబుగానుండును. కావున భక్తియందలి ప్రీతికిని గామమందలి ప్రీతికిని నెన్నఁడును సామ్యము గలుగదు.

రెండు భావంబులందును బ్రీతియే ప్రధానమైనప్పుడు ప్రీతికి రెండురూపంబు లెట్లుండునని శంకించువారును ఆధునికులలోఁగలరు. ఈ కోటిలోనివా రిట్లు వాదింతురు.

'కామము ప్రాణిలోకంబునకెల్ల నైజము. కామోదయమైనప్పుడు మనస్సు బాహ్యవస్తువులవంకఁ బఱచుననుట విధివిధానముగాదు. ఈప్సితసిద్ధికి బాహ్యప్రపంచంబున నేదైన నడ్డుతగిలినచో లాలస యంతర్ముఖమై హృదయాంతరంబునఁజేరి యావ్యక్తికిఁగూడ గోచరింపనివిధంబున నందే దాఁగియుండి, నిరోధకారణంబునఁ జెండువలె నినుమడించినశక్తితో సూహాప్రపంచంబు నాశ్రయించును. ఆ కారణంబుననే యావ్యక్తియం దట్టిస్థితిలో అస్వాభావిక మనోలక్షణంబులు గానవచ్చుచున్నవి. అట్టిస్థితిలోని మానసికానుభవంబులకు యౌగిక స్ఫురణంబులనియు ఆత్మవచనంబులనియు వేదాంతులు పేరుపెట్టిరి. ఇవి సహజమైన కామంబును, అందునను స్త్రీవిషయిక కామంబును నిరోధించుటవలనఁ గలుగుచున్న వైపరీత్యములేగాని యన్యములుగావు. ఇట్లు భావించుటకుఁ బెక్కు నిదర్శనంబులు గలవు.'

(1) వ్యక్తులయందు యౌవన ప్రాదుర్భావ కాలముతోడ ఆధ్యాత్మిక జ్ఞానోదయమనెడి మార్పు గలుగుచున్నది.

(2) యోగాభ్యాసమునకు బ్రహ్మచర్యము తప్పని నియమమనియు, అదిలేనిచో యోగసిద్ధి కలుగదనియు యౌగికమతంబులెల్లఁ జెప్పుచున్నవి.

(3) ఇట్టి కారణంబులనుబట్టి విమర్శించినచో భగవత్ప్రీతియుఁ దదనుభూతియు నిరుద్ధకామ వ్యవహారమే గాని యన్యముగాదు.'

ఇందలి ప్రతిశంకకును సమాధానముగలదు.

(1) యౌవన ప్రాదుర్భావకాలంబు సూతగాఁగొని మొదటిశంకను బ్రతిపాదించిరి. అట్టి కాలంబునకు నెన్నియో యేండ్లకుఁబూర్వమే భగవత్ప్రీతి జనించినవారు గలరు. ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు, నచికేతువు వీరలకుఁ గేవల శైశవ దశయందే భగవత్ప్రీతి యుదయించెను. వీరెల్లరుఁ బౌరాణిక పురుషులు అనఁగాఁ గల్పితమూర్తులందురా? కన్నప్ప మొదలైన యిదానీంతనులసంగతి యేమందురు? వారిని జూడలేదందురా? నిన్న మొన్న మనయెదుట జీవించిన శ్రీరామకృష్ణపరమహంస, దయానందుఁడు, వివేకానందుఁడు మున్నగువారి సంగతి యేమందురు? కావున భగవత్ప్రీతి జననంబునకును యౌవన ప్రాదుర్భావ కాలంబునకును నెట్టి సంబంధమును లేదు.

(2) భగవత్ప్రీతియనునది నిరుద్ధకామముయొక్క యభివ్యక్తియని రెండవశంక. ఇది కేవలము ప్రమాదము. కామసిద్ధికి నాలంబనం బుండవలయుననియు, అట్టి యాలంబనము బాహ్యమైనది ఏకారణముచేతనైనను నిరోధింపఁబడినప్పుడు లోపల నంకురించిన కామము తిరోముఖము దాల్చి, సర్వేంద్రియంబులకు రాజగు హృదయమందు దాఁగి దానిబలంబును బలువిధంబుల వెల్లడించి తుదకు

వ్యక్తికి వైకల్యము దెచ్చుననియు పైవాదముయొక్క తాత్పర్యము.

కామనిరోధము రెండురూపంబులు. అందు బలాత్కార నిరోధంబునఁ బైని వివరించిన వైపరీత్యములు గలుగును. ఈ నిరోధమందు బాహ్యవ్యవహారము మాత్రమే యుండదుగాని యాంతరవ్యవహారము నిలుచును. వాసనలు శేషించియుండును. రెండవది బ్రహ్మచర్యరూప నిరోధము. ఇందు బలాత్కారము లేదు. ఆలంబనము భగవంతుఁడే యగును. ఈ యాలంబనము ప్రశాంతిని గూర్చునేగాని యుద్దీపకమును గలిగింపదు. అందువలన మనోవైకల్యంబునకు నవకాశము లేదు.

ఈ బ్రహ్మచర్యరూప నిరోధమందు వీర్యము తేజోరూపంబునొంది వ్యక్తియందొక యపూర్వశక్తిని గలిగించును. ఆ శక్తివలన ఆవ్యక్తి యెంతో యున్నతదశకు వచ్చును. బ్రహ్మచర్యరూపంబునఁ గామంబును నిరోధించుటయందు నిరోధ తత్త్వంబును తత్ఫలంబును సాంతముగా విచారించి, తేజస్సును క్షణికానందంబులకై వ్యర్థము చేయుటకన్న శాశ్వతానందంబును సంపాదించుటకై వినియోగించుట యుత్తమమని నిశ్చయించి యట్లు చేయుదురు. ఆ కారణంబునఁ గామముయొక్క వ్యభిచారి వాసనలు నశించుచున్నవి. అందువలనఁ జిత్తవైకల్యము గలుగనేరదు.

బ్రహ్మచర్యంబొక సాధనమాత్రమేగాని సిద్ధిగాదు. దానివలన దేహబుద్ధులు రెండును విశుద్ధములై

యనుభూతికిఁగల ముఖ్యావరణ నిరోధంబును దొలఁగించును.

(3) కామమనునది ప్రాణికోటికెల్ల సర్వసాధారణము. కామముయొక్క యుద్దేశమేమో విచారించినచో నున్నతదశను సంపాదించుటయే దాని యుద్దేశమై యున్నది. ఉన్నతదశయేది? అని విచారించినచో దేని కెప్పుడును నేఁగిలేదో యదియే యున్నతదశయగును. ఆ దశనే యాత్మానుసంధానంబనియు భగవదైక్యమనియు నానావిధంబులఁ బేర్కొందురు. ఆదశయందలి విశేషమేమి? అన్నచో అఖండము శాశ్వతము అనన్యలభ్యమునైన యానంద మాదశయందు లభించును. అదియే జీవిత పరమావధి.

అట్టి దానినిఁ బడయుతలంపు ఎల్లరకుఁ గలుగదేల? అని యడుగవచ్చును. కామము వాసనారూపంబున నుండును. ఆ వాసనలు పూర్వకర్మానుసారంబుగా శుభాశుభములుగా నుండును. అశుభవాసనలు సంస్కారము నొందినప్పుడు శుభంబులగును. ఎవరి వాసనలు సంస్కృతంబులగునో వారికిమాత్రమే వాస్తవస్థితి బోధపడుటయు, దానికై యత్నించుటయు, దానిని బడయుటయు సాధ్యమగును. ఈ సంస్కార మొకనాఁటితో సిద్ధించునదిగాదు. దానంజేసియే 'బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే' అని భగవానుఁడు చెప్పెను.

ఈ వాసనలు వాని యదను వచ్చినప్పుడు పరిమళించి తద్రూప కార్యంబులకుఁ బ్రేరేపించుచుండును. ఈ వాసనలనే

పూర్వాభ్యాసఫలంబులందురు. ఆయభ్యాసము నియతిపూర్వ కంబగునేని దానిని సంస్కారమందురు. ఎట్లు సువర్ణము సంస్కారమువలన శుద్ధమగునో యట్లే వాసనయు సంస్కారమువలన శుద్ధమగును.

మనస్తత్వంబును గూర్చియు, వాసనాతత్వంబును గూర్చియు దేశాంతర మతాంతర గ్రంథంబులు పలురీతుల వచించుచున్నవి. ఎవి యెట్లు పలికినను సారాంశం బొక్కటే యగును; నామ వివరణాదులందు భేదంబుండ వచ్చును.

ఏ ప్రాణియైనను కేవలాశుభవాసనతో నిండియుండదు. అంతో యింతో శుభవాసనయుఁ గలిగియుండును. అది పరిమళించినప్పుడు తద్రూప కర్మంబులు జరుగుటయు, తత్ఫలంబుగా నవ్వాసనకు బలంబుగలుగుటయు, మరలనది జన్మాంతరమందుఁ దఱివచ్చినప్పుడు పరిమళించుటయు నిట్లు జరుగుచుండును. అశుభవాసన పరిమళించినతఱి దానికి సంస్కారము అడ్డుపడునేని, ఆవాసన శీఘ్రకాలముననే పరిశుద్ధతఁ గాంచును.

శుభవాసన యంతో యింతో యెల్ల వ్యక్తులందుండును గావున, శుభవాసనకుఁ బరమఫలమైన బ్రహ్మానందానుభవంబునకు నంకురం బెల్లరయందు స్వతస్సిద్ధముగ నే యున్నది. అనఁగా భగవద్భక్తి యెల్లరకును స్వభావసిద్ధము. దాని వ్యవహారము కారణాంతరంబులఁబట్టి మందము

గనో మధ్యమముగనో తీవ్రముగనో యుండును. భగవంతుఁ డనెడి సూదంటురాయి యీ వాసన యనెడి యినుప ముక్కను సమాకర్షించును. అది యా రెంటికి నైజము. ఈ సమాకర్షణమునే భక్తి యని భక్తిశాస్త్రము చెప్పును.

పరాభక్తి యనఁగా జీవాత్మ పరమాత్మల యైక్యము. ఈ యైక్యభావంబు లోకులకు బుద్ధిగోచరమగుటకై స్త్రీ పురుషుల సంయోగంబును, ఐక్యభావమందలి యానందంబును దెల్పుటకై సంయోగఫలంబైన రత్యానందంబును సాదృశ్యముగాఁ గొని మహాభక్తులును జ్ఞానులును వచించిరి. ఆ వచనంబుల నాధారంబుగాఁ గొని, యట్టివారియందుఁ గూడ మైథునప్రీతి నశింపలేదనియు, మధుమాంస మైథునంబులందలి ప్రీతి నైజమనియుఁ గొందఱు పాటించుట గలదు. ఇది ప్రమాణసిద్ధముగాదు.

భావంబును బ్రధానముచేసి వారట్లు వాదింతురు. భక్తులీ యైక్యభావంబును జెప్పునప్పు డొక్క మిథున భావంబునే గ్రహించుటలేదు. దాస్యభావము, సఖ్యభావము, వాత్సల్యభావము, శాంతభావము—వీనినిగూడఁ బురస్కరించుకొని భక్తికి జీవబీజమైన ప్రీతిని వర్ణించియున్నారు. ఈ దాస్యాదిభావంబులందలి ప్రీతికి స్త్రీ పుంస సంయోగరూపమైన కామప్రీతియొక్క స్పర్శగూడఁ దగులదు గదా. కావున లోకగ్రాహ్యార్థమైన భావవర్ణనంబునుబట్టి విపరీతాభిప్రాయంబులు పడరాదు.



సూ. నిరోధస్తు లోకవేదవ్యాపారన్యాసః.　　8

పరాభక్తి లక్షణమైనట్టియు, 7 వ సూత్రములోఁ జెప్పఁబడినట్టియు నిరోధమెట్టిదంగురా ? లౌకికవ్యాపారంబులను వైదికవ్యాపారంబులను సమర్పణంబు చేయుటయే నిరోధమగును.

నిరోధ మనునది ఉత్పన్నభావంబు నడంచిపెట్టుటగు ననియు, అట్లు చేయుటవలనఁ గీడగునే గాని మేలుగాదనియు మన స్తత్త్వశాస్త్రవేత్తలు కొందఱు వచించిరి. నిరోధంబట్టిదిగాదనియు, లోకవేదవ్యాపారంబునెల్ల సన్న్యసించుట నిరోధంబగుననియు మహర్షి వచించి వారి భ్రాంతిని దీర్చుచున్నాఁడు.

వ్యాపారంబులు లౌకికంబులనియు, నైతికంబులనియు రెండు విధంబులు. మోక్షార్థమైన ధర్మానుష్ఠానము నైతిక వ్యాపారమగును. కేవల భోగార్థమైన వ్యాపారము లౌకికమగును. పరాభక్తుఁ డీ రెంటిని సన్న్యసింపవలయును.

సన్న్యాసశబ్దమందుఁ గేవలత్యాగమే గాక సమర్పణముగూడఁ గలదు. మఱియు లోకవేదవ్యాపార సన్న్యాసమన్నప్పుడు ఎట్టి పనిని జేయకుండుటగాదు. అహంకార మమకార ఫలాభిసంధిరహితంబుగా వానిని జేయుట యని భావము.

శ్లో. న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥

శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే॥

శ్లో. యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః స విశిష్యతే॥

శ్లో. నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥

శ్లో. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥

అను గీత 3 వ అధ్యాయములోని 5–9 శ్లోకంబులు కర్మాచరణతత్త్వంబును దెలుపుచున్నవి. మఱియు,

శ్లో. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః ॥
(భ.గీ. 3–30)

శ్లో. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవః ॥
(భ.గీ. 18–57)

అను శ్లోకంబులు సమర్పణ విధానంబును దెల్పుచున్నవి. మఱియు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనునది సర్వాత్మ సమర్పణ విధానంబును బోధించుచున్నది. ఈ సూత్రమందలి 'న్యాస' శబ్ద మీ విధమైన త్యాగసమర్పణంబులను సూచించును. ఈ న్యాస విశేషంబును పాఠకులకుఁ జవి

చూపుటకై మఱికొన్ని శ్లోకంబుల గీతనుండియు గ్రంథాంతరంబులనుండియు నుదహరింతును :

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥
(భ.గీ. 9-27)

శ్లో. త్వత్పాదపద్మార్పిత చిత్తవృత్తిః। త్వన్నామసంగీత కథాసు వాణీ। త్వద్భక్తసేవానిరతౌ కరౌ మే। త్వదంగ సంగం లభతాం మదంగమ్ ॥ త్వన్మూర్తి భక్తాన్ స్వ గురుం చ చక్షుః। పశ్యత్వజస్రం స శృణోతు కర్ణః। త్వజ్జన్మ కర్మాణి చ పాదయుగ్మం। వ్రజత్వజస్రం తవ మందిరాణి॥ అంగాని తే పాదరజో విమిశ్ర। తీర్థాణిబిభ్రత్వహి శత్రుకేతో। శిరస్త్వదీయం భవపద్మజాద్యై। ర్జుష్టం పదం రామ నమత్వజస్రమ్ ॥　　(అధ్యాత్మరామాయణము)

శ్లో. వాణీ గుణానుకథనే శ్రవణౌ కథాయాం। హస్తౌ చ కర్మసు మనస్తవపాదయోర్నః। స్మృత్యాం శిరస్తవనివాస జగత్ప్రణామే। దృష్టిః సతాం దర్శనేఽస్తు భవత్తనూనామ్॥
(భాగ. 10-10-38)

శ్లో. జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు। కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం। జిఘ్ర ఘ్రాణ ముకుందపాద తులసీం మూర్ధన్ నమాధోక్షజమ్ ॥　　(ముకుందమాల)

శ్లో. మనస్తే పాదాబ్జే నివసతు, వచః స్తోత్రఫణితౌ,
కరౌచాభ్యర్చాయాం, శ్రుతిరపి కథాకర్ణనవిధౌ,
తవధ్యానే బుద్ధి, ర్నయనయుగళం మూర్తివిభవే,
పరగ్రంథాన్ కైర్వా పరమశివ! జానే పరమతః.
(శివానందలహరి)

ఈ స్తుతివచనంబుల ధోరణిఁబట్టి చూడఁగా భక్తుని సర్వవ్యాపారంబులు భగవత్కైంకర్యంబులే యగుననియు, భక్తుఁడు అహంకారమును మాత్రమే త్యజించుచున్నాఁడు గాని, బాహ్యవ్యాపారంబులను త్యజించుటలేదనియు స్పష్టమగును. 'యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్' అనుటవలన భక్తుని ప్రతికర్మము పవిత్రకర్మమే యగును. కర్మముయొక్క పరమపావనత కర్మమునందు లేదు; చేయువాని భక్తియందున్నది. దానంజేసి భక్తునకు హేయోపాదేయములు గలుగవు. వాని వృత్తమే యన్యులకు శాస్త్రమగును.

ఈ సూత్రమందుఁ జెప్పఁబడిన సమర్పణము, అనఁగా జీవాత్మ సమగ్రశరణాగతిపూర్వకంబుగాఁ బరమాత్మలో నైక్యమగుట వేదాంత తాత్పర్యమేగాక ప్రపంచమందలి సర్వమత సర్వశాస్త్రంబుల చరమవాక్యమగును. బాహ్యదృష్టికిఁ గానవచ్చుచున్న భేదంబులెల్లఁ బరమాత్మస్వరూప నిర్వచన విషయంబునను, ఐక్య విధానమందును వారివారి మనఃపరిణామ భేదంబునుబట్టి గల్గుచున్నవి. ఆ పరతత్త్వంబునకు నొక్కొక్క శాస్త్రవేత్త వాని మతానుసారంబుగా

నొక్కొక్క సాంకేతిక నామంబిచ్చెను; ఆ పరతత్త్వము యొక్క వ్యాపారంబు నొక్కొక్క విధంబుగా నూహించి వచించెను. ప్రకృతివాదులుగూడ వారి నింగిపల్లిటీలను మాని క్రిందికివచ్చి 'అన్నిఁటికి మూలమైన దేదో యొకటి గలదనియు, అది యిట్టిదని చెప్ప సాధ్యముగా'దనియు వచించి మౌనము ధరించుచున్నారు.

ఆ మూలమును పాశ్చాత్యతత్త్వశాస్త్రజ్ఞులు సార్వ లౌకిక జ్ఞాన మనుచున్నారు. దానినే మన యుపనిషత్తులు హిరణ్యగర్భుఁడనియుఁ బ్రాణమనియు వచించెను. దానినే బౌద్ధులు ధర్మకాయమనియు శూన్యమనియుఁ బల్కిరి; మహమ్మదీయులు హల్లా అనిరి; బ్రహ్మము, పరమాత్మ, ఈశ్వరుఁడు, పురుషోత్తముఁడు, భగవానుఁడు, సత్పదార్థము అని పురాణాదులు పల్కుచున్నవి. ఈ సత్పదార్థమునే భక్తుఁడు స్వానుభూతి పూర్వకంబుగాఁ బ్రేమించి సేవించు చున్నాఁడు.

కాఁబట్టి యన్నిఁటికి మూలము నాధారము ప్రాప్యము నొక్కటిగానేయున్నది. ఆ యొక్కటినే 'జన్మాద్యస్యయతః' అను సూత్రము పల్కరించుచున్నది. అది సర్వాంతర్యా మియై యాబ్రహ్మపిపీలికాంతము వ్యాపించి సమస్తమును నడిపించుచున్నది. అది యెందున్నను అఖండమేగాని వేఱు గాదు. దానికి నుపాధి రూప పరిచ్ఛిన్నత్వముగలిగినప్పుడు, అది యా యావరణంబును దాఁటి సహజమైన తన యఖండా కారంబునుగలయ నుద్యమించును. ఈ యుద్యమంబు

జీవునివిషయంబున భక్తి యగును. ఆ జీవునిఁ దనలోనికిఁ బరమాత్మ యాకర్షించును. ఈ యాకర్షణంబునే యను గ్రహమనిరి. ఈ రెండును స్వతస్సిద్ధంబులు. ఈ సమర్పణ సమాకర్షణంబులకు మధ్యఁగల యడ్డంకులను దొలఁగించుటను సాధనమందురు.

కావున నీ సూత్రమందలి 'న్యాస' శబ్దమునకు నెంతో యర్థముగలదు. న్యాసము సహజము; ఆధ్యాత్మిక సాధన కోటిలో నది యుత్తమోత్తమము; సులభమార్గము; మనో రంజకము. ఈన్యాసము ననుష్ఠించుటకొఱకే వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థ యేర్పడెను. ఎవఁ డీ న్యాసమందు నిష్ణాతుఁడో వాని జీవితమెల్ల యజ్ఞమగును; వాఁడే పూర్ణుఁడును సిద్ధుఁడు నగును.

పరా.—ఈ సూత్రమందలి 'న్యాస' శబ్దమునకు సర్వకర్మ సన్న్యాసమర్థ మని కొందఱు భావింతురు. సర్వకర్మ సన్న్యాసమనగా జడసమాధి కానేరదనియు, అట్లగునేని దానికిని గాఢ సుషుప్తికిని భేదముండ దనియు, జ్ఞానిగూడ సర్వకర్మముల నొనర్చుననియు, వాని కర్మ ములు అహంకార ప్రేరితములుగాక వానియంతస్థమైయున్న యీశ్వరుని ప్రేరితములై యుండుననియు, జడసమాధి ఒక అవస్థ యగుననియు, అవస్థకు అవస్థాంతరము తప్పదనియు, అవస్థ ఎన్నఁ డును సహజస్థితి కానేరదనియు, జ్ఞాని (ముక్తుని) స్థితి సహజమై మార్పు నొందక యుండుననియు, అట్టి సహజసమాధిలోనుండి అతఁడు వ్యవహరించుననియు శ్రీ రమణమహర్షిగారు తెలుపు చున్నారు.



సూ. తస్మిన్ననన్యతా తద్విరోధి షూదాసీనతా చ.



ఈ సూత్రము న్యాసలక్షణంబులను దెలుపుచున్నది. అనన్యత యనఁగా మఱియొకటి యాధారములేకుండుట, ఉదాసీనత అనఁగా అనన్యత్వమునకు భంగకరములైనవానియెడ నుపేక్షాభావము. ఇవి రెండు న్యాస లక్షణంబులగును.

భావంబులు సర్వజన సాధారణంబులు. అవి సామాన్యులందు వివిధరూపంబులనుదాల్చి వ్యవహరించు చుండును. పరాభక్తునియందన్ననో యవి యెల్ల నేకముఖమై ప్రీతి భావమందు లయించియుండును. అట్లనుటవలన నితర భావంబులెల్ల స్వరూపనాశనము నొందునని తలంపవలదు. అవి వానివాని లక్షణంబులను వ్యవహారంబుల నుడిగి దైవ ప్రీతి భావమందుఁగలసి యేకముఖంబున వర్తించునని తాత్ప ర్యము. అనఁగా నవి తమశక్తినిగూడఁ బ్రీతిభావ శక్తియందే మేళవించి దాని నుజ్జీవింపఁజేయును. అప్పుడు భగవదిచ్ఛయే వాని యిచ్ఛయగును; అతఁడా యిచ్ఛానుసారంబుగా వర్తించును.

వాని యితరభావంబు లట్లు భగవత్ప్రీతిభావంబుతో మేళవించుటంజేసి యవి జీవచ్ఛవంబులగును. అప్పు డవి తత్తద్భావోద్దీపక దర్శనాదులుగలిగినను తా మట్లుద్దీపితం బులై వర్తింపవు. ఇదియే వాని యౌదాసీన్యము.



సూ. అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా. 10

పై సూత్రమందలి అనన్యతా భావమునే యీ సూత్రము వివరించుచున్నది.

భగవత్సాక్షాత్కారమునకుఁ బూర్వము అహంకారమే సర్వమునకు నాధారముగానుండి యాయాభావంబుల నాడించుచుండును. సాక్షాత్కారమైనప్పుడు అహంకారము నశించిపోవును. అప్పుడు భగవంతుఁడే సర్వాధిష్ఠానమగును. ఇతరమైన యధిష్ఠానముగాని, యుద్దీపకముగాని లేకుండుట అనన్యతయగునని తాత్పర్యము.

సూ. లోకవేదేషు తదనుకూలాచరణం తద్విరోధిషూదాసీనతా. 11

భక్తుఁడు తన యేకాగ్ర భగవత్ప్రీతికి నడ్డుపడు పనులనెల్ల వదలును. అట్లు వదలుటచేత వాని యంతశ్శక్తి వేఱువిధంబునఁ బ్రసరింప వెఱవుగానక అనన్యగతికమై వాని యేకాగ్రభక్తినే పుంజీకరించును. అప్పు డతఁడు వేయి మడుంగుల బలంబుతో వర్తించును.

భక్తుని కార్యంబులెల్ల భక్తికి ననుగుణంబులును దానిని బోషించునవియు నైయుండును. శ్రీకృష్ణభగవానుఁడు చెప్పిన లోకసంగ్రహార్థ కార్యంబులు లౌకికంబులొండె వైదికంబులొండె నీ తరగతిలోఁ జేరును. ఈ కర్మంబులను భక్తుఁడు భగవత్కైంకర్యబుద్ధితోఁ జేయును.

సూ. భవతు నిశ్చయదార్ఢ్యా దూర్ధ్వం శాస్త్రరక్షణమ్. 12

శాస్త్రమనఁగా నేమి? ఋషుల యధ్యాత్మాను భూతుల సముచ్చయము శాస్త్రమనఁబడును. అట్టి శాస్త్రంబు లాదరణంబును గాంచక మూలఁబడుచున్నవి. కారణ మేమందురా? అందలి విషయంబు లిచానీంతనులకు బూటకంబులుగాఁ దోఁచుటయే కారణము. ఋషుల యనుభూతులు సత్యములేని నవి నాఁటికి నేఁటికిని సత్యములే యై మనకుఁ గూడ ననుభవంబునకు రావలయును. అప్పుడు వానియందు జనులకు గౌరవము గలుగును. గౌరవముతోడ వానిని బడయు తలంపును, వానివెంటఁ దదనుగుణ పరిశ్రమయుఁ దత్ఫలముగా సిద్ధియుఁ గలుగును. శాస్త్రం బట్టిదని మనకు స్వానుష్ఠానపూర్వకంబుగాఁ జూపు దక్షుఁ డుండవలయును. వారి మార్గంబు నన్యు లనుసరింతురు. 'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః' అను శ్రీకృష్ణభగవానుని వాక్యంబునకు నిదే తాత్పర్యము. సిద్ధులుగూడ నిట్టి కారణంబున శాస్త్రార్థంబుల ననుష్ఠించుట కర్తవ్యమగును. ఇదియే శాస్త్ర రక్షణము.

తాను తరించి పిదప నన్యులఁ దరింపఁజేయనగుననెడి సామెత ప్రకారము, మొట్టమొదట శాస్త్రార్థంబును దా నాచరించి దాని సత్యంబును స్వానుభవపూర్వకంబుగా నిశ్చయించి పిదప లోకార్థము తా ననుష్ఠింపవలయును. కృతకృత్యులుగూడ శాస్త్రానుష్ఠానపరులగుటకు నిదియే కారణము.

శాస్త్రము సాధ్య సాధకంబుల రెంటినిఁ దెలుపును. సాధ్యము త్రికాలాబాధ్యము. దానికెన్నఁడును మార్పు గలుగదు. సాధనము దేశకాలపాత్రోచితంబుగా మారు చుండును. ఈ మార్పు నెఱింగి తత్తద్దేశకాలపాత్రములకుఁ దగినట్లు సాధనంబులనుగూడ మార్పవలయును. అట్లు మార్చి నప్పుడే సాధకములు అనుష్ఠానయోగ్యములగును. అట్లు మార్చుటకు సిద్ధులకు సర్వాధికారము గలదు. అట్లు గావించినవాఁడే శాస్త్రరక్షకుఁడగును.

సాధనంబును మార్చినందున సాధ్యంబునకు నెట్టి భంగమును గలుగదు. అది యథాస్థితినే యుండును. ఈ మార్పునే సంస్కార మందురు. ఈ రహస్యంబు నెఱుంగక సంస్కార మన్నంతనే కొంద ఱుట్టిపడుదురు. ఆమూలాగ్ర సంస్కారంబును మఱికొందఱు పట్టుదలతోఁ గోరుదురు. ఎచ్చట లోపమో యచ్చట దిద్దుబాటు వలయును. లోపము లేనిచోట దిద్దుబాటునకు నవకాశమేమి? కాదని యట్లు చేయుట నాశనమగుఁ గాని సంస్కారము కానేరదు.

పరమార్థము పూర్ణము. పూర్ణ మెట్టివానికిని సమగ్రంబుగా గోచరింపదు. సిద్ధులు వారివారికి గోచరించినంత శాస్త్రీకరింతురు. అనుభూతియందుఁ దర తమ తారతమ్యంబు లుండును గావున వారు రచించిన శాస్త్రంబు లొక్క విషయమందే భేదంబులను జూపవచ్చును. ఏ శాస్త్రమైనను సంపూర్ణముగాదనియు, అందలి విషయం బా శాస్త్రకారుని యనుభూతిని మాత్రమే తెలుపుననియు, అదే చరమ

వాక్యంబుగా గ్రహింపరాదనియు, అనుభూతి తారతమ్యం బునుబట్టి యే శాస్త్రంబును నిరాకరింపఁదగదనియు, దాని సత్తా అంతమాత్రమే యనియు గ్రహింపనగును.

సిద్ధుఁడైనవానికిఁ త్రికాలజ్ఞానముండును. కావున నతఁ డెప్పటి కేది మేలో నిశ్చయించి చేయును. ఆ కారణంబుననే పెద్దలత్రోవఁ ద్రొక్కుమనిరి. ఈ దేశకాలపాత్రల తారతమ్యమునుబట్టియే యొక కాలంబున యోగ్యమైన యాచారములు మఱియొక కాలంబున నిషిద్ధంబులాయెను. ఇందులకు మన శాస్త్రంబులే నిదర్శనములు.

పెద్ద లన్నప్పుడు మిథ్యాచార్యుల సంగతి మఱవవలదు.



## సూ. అన్యథా పావిత్ర్య శంకయా. 13

నిశ్చయదార్ఢ్యము గల్గిన తర్వాత సిద్ధుఁడు తా నాచరించుచుఁ దద్రూపంబున శాస్త్రోక్తవిషయంబులు సత్యములని యితరులకుఁ జూపవలయుననియుఁ దనకే నిశ్చయము కుదురనినాఁడు శాస్త్రము సంగతి యతఁడు చెప్పినను ఫలము లేదనియుఁ బై సూత్రము.

అట్లు స్వానుభవపూర్వకంబుగా నిశ్చయదార్ఢ్యము గలుగకమున్నే బుద్ధికిఁ దోఁచినట్లు వర్తింతురేని వారు పతితులగుటయేగాక, 'తాఁజెడ్డ కోఁతి వనమెల్లఁ జెఱచె' నన్నట్లు వారినిజూచి యితరులుగూడ నట్లే వర్తించి చెడుదురు. ఈ విషయము మనకెల్లరకు నిక్కాలంబున స్పష్టము. ఊరూర

నాయకు లేర్పడుటయు, వారినిజూచి యన్యులుగూడ నట్లే వర్తించుటయుఁ దుదకు నుభయులు భ్రష్టులగుటయుఁ జూచు చున్నాము.

ధర్మ మనునది గొప్ప విషయంబనియు ధర్మ ప్రతి పాదకుఁ డెంతో జాగరూకుఁడై నిశ్చయార్థమును దేల్చి యితరులకు దారిచూపవలసినదనియు నీ సూత్రము చెప్పు చున్నది. ఇది గురుకులంబున కెల్ల హెచ్చరికగాఁ దోఁచును.



సూ. లోకోఽపి తావదేవ; భోజనాదివ్యాపారస్త్వా
శరీరధారణావధి. 14

ఈ సూత్రమందలి 'లోక' శబ్దము లౌకికాచారాదు లను సూచించును. అవి దేశకాలపాత్రాదులనుబట్టి యుండును. కావున వానింగూర్చి యొక నియతి సార్వ ప్రాపంచికంబుగా నియమింపఁ దరముగాదు. ఈ విషయంబున సిద్ధునకు నెట్టి కట్టుబాటు లేదు. అతఁడు వాని యిచ్ఛాను సారంబుగా నుండనగును. అనఁగా భగవదిచ్ఛయే వాని యిచ్ఛ యగును. అట్టి విషయములందు వాని వ్యవహారము శాస్త్రోక్తరార్థప్రకారముగాని నాఁటియాచారానుసారంబుగాఁ గాని యుండనంతమాత్రాననే యది ధర్మవిరుద్ధము కానేరదు. ఏల యందురా? ధర్మతత్త్వము సిద్ధునకు ననుభవసిద్ధము. అతఁడు ఈశ్వరప్రేరణమునకు విరుద్ధముగా వర్తింపఁడు. కావున నతఁ డాచరించునదే ధర్మమగును. అట్టి యాచా

రము ధర్మనిబద్ధమైయున్నను బూర్వాచారంబునకు వ్యతిరేకంబు గావచ్చును. కారణమేమందురా? దేశకాలపాత్రల యందుఁ గలుగుచున్న మార్పే కారణము. ఇట్టి మార్పులు గలిగించుట పూర్వశాస్త్రతిరస్కారముగాదు. ఇవియెల్ల వ్యావహారికంబులు. లోకనియతి వ్యవహారసిద్ధము; అది యెన్నఁడు అచంచలముగాదు.

అట్లని మార్పులను విచ్చలవిడిగాఁ జేయరాదు. ఎప్పటి కేది ప్రస్తుతమో యప్పటికి నంతమాత్రమే గ్రహింపవలయును. అపక్వకషాయము కూడదు. ఈ భావంబు నీ సూత్రమందలి 'తావత్' అనునది సూచించును.

సూత్రమందలి 'భోజనాదివ్యాపారము'లలో నిద్రాది స్వాభావికంబులెల్ల జీవితంబునకు ననివార్యంబులైనవి చేరును. 'శరీరధారణ' మన్నప్పుడు ఊపిరితో నుండుట మాత్రమే గాదు. భగవంతుని సేవచేయుటకుగా దేహంబునకు నెంత పాటవము వలయునో యంతవఱకు శరీరంబును బోషింపవలయునని భావము. వాస్తవము విచారించినచో, భక్తుఁడు వాని దేహంబును భగవంతునకు సమర్పణంబొనర్చెను. కావున వాని దేహమే వానిసొమ్ముగాదు. అది భగవంతుని సొమ్ముగా నుండును. భక్తుఁడు విచారణకర్తగా నుండి యా పదవికిఁ దగిన ధర్మంబును నడుపును. విచారణకర్తకు నుపేక్షాభావము ధర్మవిరుద్ధమగునుగదా.

సూ. తల్లక్షణాని వాచ్యంతే నానామతభేదాత్. 15

భక్తుని లక్షణంబులనుగూర్చి యొక్కొక్క రొక్కొక్కవిధముగాఁ జెప్పిరి.

భక్తుని తత్త్వం బెప్పుడును అనుభవగోచరమేగాని యూహింపను వ్రాయను సాధ్యముగాదు. ఊహింపసాగి నచో వారిగారి యూహల తారతమ్యంబులనుబట్టి లక్షణంబు లందుఁగూడఁ దారతమ్యము గల్గును.

ఎంత గట్టిగా లోఁతుగా నూహించి వ్రాసినను, ఆ వ్రాఁతలెల్ల అపూర్ణంబులగునే గాని సమగ్రంబులు కానేరవు. ఊహలన్ననో, వారివారి శక్తిసామర్థ్యంబులను బట్టియు, లోకానుభవంబునుబట్టియు, పరిశీలనశక్తినిబట్టియు, రుచులనుబట్టియు నుండును. దానంజేసి మతభేదంబునకు నెంతయో యవకాశము గలుగుచున్నది. దాని ఫలమే మందురా? విషయంబొక్కటేయయ్యు దాని వివరణంబులు వివిధంబులై లోకంబునకు భ్రాంతిగలిగించుచున్నవి. వివరణ భేదంబునుబట్టి తత్త్వమందు భేదంబు నూహింపరాదు.

(1) శ్లో. దేవానాం గుణలింగానా మానుశ్రవికకర్మణే।
సత్త్వ ఏవైకమనసో వృత్తి స్స్వాభావిక తు యా॥
అనిమిత్తా భగవతి భక్తిస్సిద్ధే ర్గరీయసీ।
జరయత్యాశు యాకోశం నిగీర్ణమనలో యథా॥
(భాగ. 3. 25-32, 33)

(మనస్సును ఏకాగ్రముచేసి స్వస్వదేవాధిష్ఠితములైన జ్ఞానేంద్రియములను శాస్త్రసిద్ధవ్యాపారానుష్ఠానపదకర్మం

ద్రియములను శుద్ధసత్త్వమయ భగవన్మూర్తికి నప్పగించి మనోవృత్తి నట్లు స్వాభావసిద్ధము చేయవలయును. అట్లు చేయుట ఫలాభిసంధిరహితముగా నుండవలయును. ఇది భక్తి యగును. తత్ఫలముగా నిరతిశయానందరూప భగవదనుభూతి గలుగును. ఈ భక్తి అనాదిపుణ్యాపుణ్యరూపకర్మ వాసనాకోశమును నశింపఁజేయును. భుజించిన యన్నపానాదులను జఠరాగ్ని యెట్లు జీర్ణించునో యట్లే యీ భక్తియుఁ బుణ్యపాపంబులను జీర్ణింపఁజేయును.)

(2) శ్లో. మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుణాశ్రయే।
మనోగతి రవిచ్ఛిన్నా యథాగఙ్గాంభసోఽంబుధౌ॥
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతం।
అహైతుక్య వ్యవహితా యా భక్తిః పురుషోత్తమే॥
(భాగ. 3. 29-11, 12)

ఎల్లప్రాణుల హృదయమం దంతర్యామియైయున్న యా భగవంతుని గుణంబులను విన్నంతనే ఫలాభిసంధిశూన్యముగా భేదదర్శనరహితంబుగ, గంగాజలము సముద్రమువంకఁ బ్రవహించునట్లు భక్తుఁడు తన భావంబును అవిచ్ఛిన్నంబుగాఁ భగవంతునివంకఁ బ్రవహింపఁజేయుట భక్తియగునని కపిల మహర్షి వర్ణించెను.

(3) మూఢులకు నింద్రియార్థంబులం దెట్టి ప్రీతి గలదో యా ప్రీతిని భగవంతునెడ నెఱపుట భక్తియగునని ప్రహ్లాదుఁడు చెప్పెను. (విష్ణుపురాణము)

(4) ఒక పాత్రనుండి మఱియొక పాత్రకుఁ దైలంబును బోయునప్పు డది యెట్లు తెంపులేక ధారారూపంబునఁ బడునో, యట్టి ధారారూపంబుగా మనోవృత్తిని భగవంతునివంకఁ బ్రవహింపఁజేయుట పరాభక్తి యని దేవీ భాగవతము.

(5) ఫలాభిసంధిరహితంబుగా భగవత్ప్రీతి నాలంబనముచేసి యందు భావంబు నేకాగ్రముగా నుంచుట భక్తి యగునని నారదపాంచరాత్రము.

(6) శ్రీ శంకరులవారు 'స్వస్వరూపానుసంధానము' భక్తి యని వివేకచూడామణిలోను, 'పశుపతేః పాదారవిందద్వయం చేతో వృత్తి దుపేత్య తిష్ఠతి సదా సా భక్తి' అని శివానందలహరిలోను వర్ణించిరి.

(7) 'తత్ర భక్తిర్నామ నిరవధికానంతానవద్యకళ్యాణగుణత్వ జ్ఞానపూర్వకః స్వస్వాత్మాత్మీయ సమస్తవస్తుభ్యోఽనేకగుణాధికోఽంతరాయ సహస్రేణా ప్యప్రతిబద్ధో నిరంతరప్రేమప్రవాహః' అని శ్రీ రామానుజాచార్యులవారు తమ శ్రీభాష్యమందు నుడివిరి. (భగవంతుఁడు నిరవధికానంతానవద్యకళ్యాణగుణసంపన్నుఁడను జ్ఞానముతోఁ దనయందుఁగాని తనవారియందుఁగాని తుదకు సమస్తవస్తుజాతమందుఁగాని తనకుఁ గల ప్రీతికంటె పెక్కుమడుంగు లధికమైన ప్రీతితో నంతరాయంబులు లక్షలకొలఁది వచ్చినను బట్టువదలక ప్రేమప్రవాహంబును నిరంతరంబుగా భగవంతునియెడఁ బఱపుట భక్తి యగును.)

(8) భగవంతునెడఁ బరమ ప్రేమయుండుట భక్తి యగునని శాండిల్యుఁడు తన భక్తిమీమాంసయందు రచించెను.

(9) భగవన్మహిమానుభూతివలన గలుగు ప్రీతి భక్తి యని స్వప్నేశ్వరుఁడు వచించెను.

(10) ఆర్ద్రీభూతమైన హృదయమందు బింబితమై చలింపకుండునట్టి భగవద్రూపమువంక నిరంతర ప్రవాహ రూపంబున భావము పఱచుట భక్తియగునని భక్తిరసాయన గ్రంథకారుఁడనెను.

(11) జ్ఞానకర్మరూపావరణంబులను ద్రుల్చివైచి యనన్య కాంతారూపంబుగా భగవదనుభూతి నొందుట భక్తియగు నని రూపగోస్వామిగారును వచించిరి.

(12) భగవత్సాక్షాత్కారము పరాభక్తియనియు, భగవదైక్యము పరజ్ఞానమనియు, భగవద్వియోగభయము పరమభక్తి యనియు యామునాచార్యులు పల్కిరి. ఈభక్తిని గూర్చిన యన్యుల భావంబులు మఱికొన్ని రెండవసూత్రంబున వివరింపఁబడెను. కావున భక్తిలక్షణంబులఁగూర్చి నానామతంబులు గలవని గ్రహింపనగును. మతభేదంబు లెన్నియున్నను సారాంశం బొక్కటియేయగును.



సూ. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః. 16

భగవంతునిఁ బూజించుట మున్నగువానియందలి అనురాగము భక్తి యగునని పారాశర్యమతము.

## కాయికభక్తి *

ఇది కాయికభక్తి యగును. ఈ కాయికభక్తి యనునది భక్తి తత్త్వంబున మొదటి మెట్టని సామాన్యముగా భావింతురు. అది వాస్తవముగాదు. శంకర రామానుజ మధ్వ గౌరాంగ రామకృష్ణ పరమహంసాదులు పరాభక్తులును జ్ఞానులునై యుండియు సాక్షాత్కారానంతరముగూడఁ బూజాదికంబులొనర్చిరి. సాక్షాత్కారానంతరముగూడఁ బూజాదులు చేయవచ్చునని వ్యాసభగవానుఁడుగూడఁ జెప్పెను. కావునఁ బూజాదులు చేయుట తక్కువతరగతి భక్తి కానేరదు.

దీర్ఘముగా విచారించినచో సాక్షాత్కారముగానిచో భగవత్తత్త్వము బోధపడదు. అట్లు బోధపడినఁగాని యందు రుచి జనింపదు. రుచిజనించినఁగాని మది కుదురదు. మది కుదురకున్న నది భక్తియేగాదు. కావున సాక్షాత్కార

* ఈ భక్తియనునది కాయికము వాచికము మానసికమని స్థూల దృష్టికిఁ ద్రివిధముగా నుండును. అందొక్కొక్కదానికి నొక్కొక్క మహర్షి మతంబును నారదులవా రుదహరించుచున్నారు. మొత్తముమీఁద మనస్సు వర్తింపనిదే వాక్కుగాని కాయముగాని పనిచేయవు. అనఁగా మనఃకార్యము మూఁటియందు వర్తించుచుండును. అయినను బాహ్య దృష్టికి ఏది ప్రధానమో దానినే లక్షణంబుగా గ్రహింతురు.

మందినవాని భక్తియే నిక్కమైన భక్తియగును. అట్టివాని భక్తి సర్వాత్మ సమర్పణపూర్వకంబుగా అహంకార రహితంబుగా నుండును.

భక్తులు భక్తిపారవశ్యంబున నృత్యమాడుట ఉత్సవాదులు జరుపుట, దేవాలయాదులను నిర్మించుట, సాంఘిక సేవచేయుట, దానధర్మంబు లొనర్చుట మున్నగునవియెల్లఁ బూజలేయగునని సూత్రములోని 'పూజాది' పదమువలన ద్యోతకములగును.



సూ. కథాదిష్వితి గర్గః. 17

భగవత్కథాదులను వినుట భక్తియగునని గర్గమహర్షి మతము.

## వాచికభక్తి

ఇది వాచికభక్తి యగును. జపము, కీర్తనము, పురాణపఠనము, తద్వ్యాఖ్యానము, హరికథ చెప్పుట, సంకీర్తనము, స్తోత్రాదులను రచించుట పాడుట మున్నగునవి యెల్ల నీకోటిలోఁ జేరును. భక్తుఁడు వానికిఁగల భగవత్ప్రీతి నిన్నివిధంబుల వాగ్రూపంబున వెల్లడించును. ఇదే భావంబును గీతలో భగవానుఁడు సూచించెను.

శ్లో. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ.
(భ.గీ. 10-9)

(నాకు జీవిత మర్పించి నాయందే మదినిల్పి నాకు భక్తిచేయుదురు. భక్తికి ధ్యానావస్థయనియు, విక్షేపావస్థ యనియు రెండవస్థలుగలవు. ధ్యానావస్థయందు వారిచిత్తము నాయందేయుండును. విక్షేపావస్థ మరల గోష్ఠీరూపయనియు గోష్ఠీరహితయనియు రెండు విధములు. గోష్ఠీరూపయందు భక్తులు వారివారి యనుభవప్రకారము భగవత్కల్యాణ గుణంబుల నొండొరులకు నభివర్ణించుచు నానందించు చుందురు. రెండవదానియందు ఏకాంతమున భగవన్నామ స్మరణంబుచేయుచు లోలోన నానందించుచుందురు.)

శ్లో. నివృత్త తర్షై రుపగీయమానాత్
భవౌషధాచ్ఛ్రోత్రమనోభిరామాత్,
క ఉత్తమశ్లోకగుణానువాదా
త్పుమాన్విరజ్యేత వినా పశుఘ్నాత్.
(భాగ. 10-1-4)

'ముక్తులైనవారు వారి యాత్మానందము పొంగి పొరలి వచ్చినప్పుడు దానిని భగవత్కల్యాణగుణాది కీర్తన రూపంబున వెల్లడింతురు. ఆ కీర్తనామృతంబును గర్ణపుటం బులఁ ద్రావుటకుఁ గసాయివాఁడు తప్ప మఱెవ్వరైన నిచ్ఛ గింపకుందురా?' అని పై భావమునే భాగవతము 10-వ స్కంధము ప్రథమాధ్యాయము నాల్గవ శ్లోకము సూచించు చున్నది. వేయేల, నారదమహర్షి నిరంతరము వీణవాయిం చుచు హరికీర్తనము చేయుచు ముల్లోకంబుల సంచరించు

చుండుటవలననే యీవిధమగు భక్తియొక్క గౌరవము వెల్లడి యగుచున్నది. ఈ భక్తియొక్క యుద్వేగమేగదా వాల్మీకి వ్యాస తులసీదాసులవలనఁ బురాణేతిహాసంబులను, జయదేవాదులచేత గీతగోవిందాది కృతులను లోకమనోహరంబుగా రచియింపఁజేసినది! శుకమహర్షి బోధితమైనట్టియు భగవల్లీలాభివర్ణన రూపమైనట్టియు భాగవతంబు నేకాగ్రమతితో పరీక్షిత్తును వినునట్లు చేసినది యీ భక్త్యుద్వేగమే గదా.

శ్లో. వాసుదేవకథా ప్రశ్నః పురుషాం స్త్రీన్ పునాతి హి।
వక్తారం పృచ్ఛకం శ్రోతౄంస్తత్పాదసలిలంయథా ॥

(వాసుదేవుని పాదసలిలంబెట్లో యట్లే వాని కథలుగూడ అడుగువారినిఁ జెప్పువారిని వినువారిని ఈ మూఁడు రకముల వారిని—స్త్రీలనుగాని పురుషులఁగాని తప్పక పవిత్రులఁజేయును) అని శుకమహర్షి చెప్పిన పల్కులు అక్షరాక్షరంబులు సత్యంబులు.

ధర్మములలోనెల్ల నుత్తమధర్మమేది? అని ధర్మరాజు భీష్ములవారి నడుగఁగా 'భగవంతుని నామస్మరణార్చన ధ్యాన స్తుతిరూపకమైన భజనమే యుత్తమోత్తమ ధర్మ మనిరి. వేయేల? యజ్ఞములలోనెల్ల జపయజ్ఞము తానేయని భగవానుఁడే చెప్పెను.



సూ. ఆత్మర త్యవిరోధేనేతి శాండిల్యః. 18

ఆత్మానందవీచికాపరంపరల హతులంజేసి దేహముగాని వాక్కుగాని వ్యవహరించునేని యది భక్తిలక్షణంబగునని శాండిల్యమహర్షి భావము.

## మానసిక భక్తి

శాండిల్యమహర్షి యింకొక పైమెట్టు త్రొక్కుచున్నారు. భక్తికి నాత్మానందము జీవగఱ్ఱ యగును. అది లేని కాయిక వాచిక పూజాకీర్తనాదులు నిరర్థకంబులనియు, అట్టి వట్టి పూజాకీర్తనాదులను భక్తిలక్షణంబులనుగా గ్రహింపరాదనియు, భక్తి యనునది యధ్యాత్మికమగునే గాని కాయిక వాచిక మాత్రము గాఁజాలదనియు, వారి భావము. 'ఆత్మరతికి విరోధములేకుండ' అను ముక్కలో నింత తాత్పర్యము గలదు.



సూ. నారదస్తు తదర్పితాఖిలాచరతా తద్విస్మరణే
పరమవ్యాకులతేతి (చ). 19

(సమస్తాచారవ్యవహారంబులను భగవంతునకు నర్పించుటయు, భగవంతుఁడు మరపునకు వచ్చేనేని మిక్కిలి వ్యాకులమందుటయు నారద మతప్రకారము భక్తిలక్షణంబులగును.)

సర్వాత్మసమర్పణము, భగవద్వియోగ దుస్సహత్వము—ఇవి రెండును నారదమహర్షి మతప్రకారము భక్తి లక్షణంబు లగునే గాని వట్టి పూజాదులుగాని కీర్తనాదులు

గాని భక్తిలక్షణంబులు గానేరవు. నారదుని మతము భక్తి తత్త్వసారమగును. సర్వాత్మసమర్పణము భక్తికిఁ బ్రథమ లక్షణము. ఆ స్థితిలో భక్తుఁ డేమి చేసిన నది భక్తియే యగును. ఎప్పుడు సర్వాత్మసమర్పణమగునో యప్పుడు అహంకారము నశించినదే యగును. నిక్కమైన భక్తునకు భగవద్విస్మృతి యెన్నఁడును గలుగదు. విస్మృతి దుఃఖము భక్తుని మనంబును నిరంతరము భగవంతునియందే నిల్పి యుంచును.



సూ. అస్త్యేవమేవమ్. 20

అట్టి భక్తులు గలరా ? అని శంకింపవలదు.

సూ. యథా వ్రజగోపికానామ్. 21

వ్రజపురమందలి గోపికలే యిందులకు నిదర్శనము.

బృందావనమందలి గోపికలకుఁ జదువు సంధ్యలు రావు. అయినను వారిని బరాభక్తురాండ్రగా భక్తలోక మెల్ల నంగీకరించెను.

"గోపికలారా! మీ భక్తి యిట్టిదనఁజాల. నిర్మలమైన చిత్తవృత్తితో ఏకనిష్ఠతో గృహబంధంబులనెల్లఁ ద్రెంచివైచి, వివిధభావానుభావంబుల నాయందు రమించుచు నన్ను భజించితిరి. మీరు చూపిన భావంబులందు లేశమాత్ర కళంకముగూడఁ గలుగదు. మీ భక్తికిఁ బ్రతికృతిగా మీకు నేనేమియు నొసఁగలేదు ? సురలోకవాసంబునొండె దేవతల యమరత్వంబునొండె నిత్తునా యన్నచో నవి

మీ భక్తికి సాటిగానేరవు. ఆ తలంపు నాకే సిగ్గగుచున్నది. మీ కేమి ప్రత్యుపకారమొనర్తు? నాకేమియుఁ దోఁపదు. కళ్యాణులారా! మీరు మీ సౌశీల్యముచేత మీ ఋణానుబంధునిగా నన్నొనర్చితిరి. మీకు నాపడిన ఋణము తీఱదు.''

''ఉద్ధవా! గోపికలు నాయందే మనఃప్రాణంబుల నిల్పి నా కొఱకుఁ బతి పుత్ర భోజన పాన వస్త్రభూషణాదుల నెల్ల నువ్వెత్తుగాఁ ద్యజించి నాతోడిదే లోకంబుగా నేనే వారి ప్రాణంబునుగా భావించియున్నారు. నేను మరల వత్తు ననెడి పేరాస వారి ప్రాణంబుల నిల్చియున్నది'' అను శ్రీకృష్ణభగవానుని పల్కులవలననే గోపికల భక్తి యెట్టిదో యూహింపనగును.

ఉద్ధవుఁడు కృష్ణసందేశమును గైకొని బృందావనంబునకుఁ జని యందుఁ గొంతకాలంబుండి గోపికల తత్త్వమెల్ల నామూలాగ్రము పరిశీలించి ''అహో! ఈ గోపికల పాద ధూళి సోఁకుటంజేసి బృందావనమందలి తీఁగలు పొదలు సయితము పరమపావనంబులాయెను. ఆపాటిభాగ్యమునేని నేను నోఁచనైతిని. నేను ఇందొక తీఁగనో పొదనో యై పుట్టియుందునేని నేనుఁగూడ నీ గోపికల చరణరజము సోఁకునం జేసి కృతకృత్యుఁడనై యుందుఁగదా. ఏ ముకుందుని పాద పద్మంబులను వేదంబులు వెదకి వెదకి వేసారినవో, ఏ ముకుం దుని పాదపద్మంబుల నర్చించుటకై లక్ష్మియుఁ బరమేష్ఠియు యోగీశ్వరులును బ్రాఁకులాడుదురో, యా ముకుందుని

చరణారవిందంబులను ఈ గోపిక యురంబునఁ దాల్చి కవుంగిటం గూర్చి తాపంబును బాసి యానందవార్ధి నోలలాడు చున్నారు. అహో! వీరి భాగ్యమే భాగ్యముసుమీ. బృందావన గోపికాంగనలారా! ఏ మీ పాదంబులు ముల్లోకంబులను బావనం బొనర్చునో యా మీ పాదంబులకు నమస్కరించుచున్నాను. మీ పాదధూళి నాపయి రవంత సోఁకనిండు' అని ప్రార్థించెను. ఉద్ధవు నంతటి భక్తునకుఁ గూడ నాశ్చర్యంబును గలిగించిన యీ గోపికల భక్తి యెట్టిదో తలపోయనగు.

మధురలోని స్త్రీలు గోపికలనుగాంచి 'అహో? వీరెంతయు ధన్యధన్యలు. వీరు పాలుపిదుకుట చిలుకుట మొదలుగాగల సర్వావస్థలందును భక్తిప్రపూర్ణహృదయంబులతో హరికీర్తనంబులు గావించుచుఁ బ్రొద్దుచాలకుందురు. వారి భక్తిరసంబు వారి కంఠంబుల నిరోధించి యిమ్ముగానక యానందబాష్పంబుల రూపంబున వెడలుచున్నది. భగవత్స్మరణంబుదక్క రెండవదెద్దియు నెఱుంగరు. వీరి నెట్లు శ్లాఘింపనగు' ననిరి. నాఁటి గోపికలభక్తియే నేఁటి మన మధురగానంబులకును రసోల్లసిత కవిత్వంబునకు నాధారం బాయెను. ఆ భక్తి యిదానీంతన వైష్ణవభక్తులకు జీవగఱ్ఱ యయ్యెను; గోపికలనాఁటి బృందావన లీలలే నింబార్క జయదేవ గౌరాంగ వల్లభాచార్యాదుల మతంబులకు నంకురంబులయ్యెను. ఆ గోపికల రాసక్రీడ యిటీవలి పరమహంస వివేకానందులకుఁగూడ భక్త్యాస్వాదంబును గలిగించెను. గోపికలన్నంతనే పరమహంసగారు భావసమాధి నొందెడి

వారు. 'పరాభక్తి మతంబునకు గోపీలీలలు పరమాదర్శకములగును. భావసమాధికి వారినే దృష్టాంతముగాఁ గొనవలయు నని వివేకానందులవారనిరి. 'భక్తితత్త్వంబును గ్రహింపవలయునన్నచో బృందావనలీలల నాశ్రయింపు'మని భగవానుఁడు చెప్పినమాటయం దెంత యర్థముగలదో యూహింపనగును.

శ్రీకృష్ణలీలలైన రాసక్రీడాదులనుగూర్చి విపరీత భావముగలదు. ఇట్టితలంపు నాఁడే పరీక్షిత్తువంటి వానికిఁ గలుగఁగా నేఁటివారికిఁ గలుగుట వింతగాదు. ఈ లీలలను గూర్చి శ్రీశుకమహర్షి చెప్పినదంతయుఁ బరీక్షిత్తు సాకల్యంబుగా విని 'మహాత్మా! గోపికలచర్యలంబట్టి చూడఁగా వారు కృష్ణునిఁ బ్రియకాంతుఁడను భావంబుతో సేవించిరే గాని పరబ్రహ్మమను భావంబుతో సేవింపరైరి. కావున గోపికలు గుణకార్యంబులకు లోనైనవారే యగుదురుగాని గుణాతీతలుగారు. గుణబంధనంబునకుఁ జిక్కి యున్నంత వఱకు గుణాతీతస్థితిఫలమగు ముక్తి యెట్లు గలుగును? కేవల గుణకార్యమైన కామబుద్ధితో వర్తించిన గోపికలు తద్రూపప్రీతివలన ముక్తలైరని చెప్పుట శాస్త్రసమ్మతము గాని, తమబోంట్ల యనుభవసిద్ధముగాని యగునా?' అని యడిగెను. శుకమహర్షి వాని భావంబును గ్రహించి 'రాజా! ముక్తియనునది యేకాగ్రభావరూపమేగాని వేఱుగాదు. ఏకాగ్రత యేకారణంబున సిద్ధించినను సిద్ధింపనగును. కారణము ప్రధానముగాదు. ఆ యేకాగ్రత నశ్వరంబులందుఁ గలిగినచో ఫలముగూడ నశ్వరమే యగును. ఏదిగాని దాని

నైజశక్తి ప్రకారమే ఫలమిచ్చును. ఏకాగ్రత యనశ్వర మందు నిల్చినప్పుడు ఫలంబు నట్టిదేయగును. 'యథా రాజా తథా ప్రజా' యన వినమా? గోపికలు నీవన్నట్లు కామ భావంబుతోడనే యనశ్వరమైన భగవత్తత్త్వమందు మది నిల్పిరనుకొందము. అనశ్వరఫలంబు వారికిఁ జేకూరెననుట యందు వింతయేమిగలదు? రాజా! కామభావమందుఁ గొంత ప్రీతి శుద్ధమో యశుద్ధమోగలదు. ద్వేషభావమందుఁ బ్రీతియనునదే యుండదుగదా. అట్టి ద్వేషభావంబుతో భగవంతునెడ బుద్ధి నేకాగ్రముచేసినవారుగూడఁ ముక్తిఁ గాంచలేదా?

శ్లో. యత్ర యత్ర మనో దేహీ ధారయే త్సకలంధియా।
స్నేహా ద్ద్వేషాద్భయాద్వాపి యాతితత్తత్సరూపతామ్॥
(భాగ. 11. 9. 22)

అని భగవానుఁడే చెప్పెనుగదా. ద్వేషము వలననో స్నేహమువలననో భయమువలననో మఱి యేకారణము వలననో చిత్తము సమగ్రముగా నెందెందు నిల్చునో అది దాని సారూప్యంబును బొందును. ఈ పరిణామము భ్రమర కీట న్యాయంబు ననుసరించును. ఒకపఱి మది యట్లు నిల్చిన తర్వాత ధ్యేయమే తన తత్త్వంబునకుఁ బ్రతికూలంబులైన వాని నెడముచేసి యీ చిత్తంబునకుఁ దనతత్త్వంబును గూర్చును. గోపికలు మొట్టమొదటఁ గామబుద్ధితో నేకాగ్ర చిత్తలైరని తలంచినను, వారికి ధ్యేయమైన భగవంతుఁడు పరిశుద్ధుఁడు గావున ఆయన నిజతత్త్వప్రభావంబున గోపికల

యంతఃకరణమందలి కామరూప మాలిన్యంబును దొలఁగించెను. వారి యేకాగ్రత యట్లే యుండెను. అట్లు వారు నివృత్త చిత్తదోషులైరి; ఎట్టకేలకు ముక్తిఁగాంచిరి, ఇందు విచిత్రమేమిగలదు?" దని చెప్పెను.

అంతతోఁ బరీక్షిత్తునకు సందేహము తొలఁగక 'మహాత్మా! నాకింకను దృప్తికలుగదు. భగవంతుఁడెక్కడ? గోపికలకుఁగల తుచ్ఛ కామ సంకల్పంబులెక్కడ? ఆ తుచ్ఛభావంబులను భగవంతుఁడు తీర్చుటెక్కడ?' అనెను.

శ్రీశుకమహర్షి యామాటవిని "అహో! నావచించిన దత్త్వరహస్యం బితనికి గోచరింపదు. వీని మనఃపరిణతిం బట్టి యితనికి సమాధానము చెప్పనగు"నని తలపోసి "రాజా! మహాప్రభావవంతులయెడ ధర్మవ్యతిక్రమము శంకించుట సాహసంబగును. తేజోవంతుల నెట్టి దోషంబును జెనకనేరదు. అగ్ని సమస్తంబును భక్షించుచునే తాను నిత్యపరిశుద్ధుఁడుగా నుండుట తెలియదా? పెద్దలే యట్లు చేసినచో వారిత్రోవనే యితరులు ద్రొక్కుదురుగదా యని శంకింతువు గాఁబోలు. ఒకవేళ పెద్దలత్రోవ యొకటి యున్నను, ఎల్లరు దానిని ద్రొక్కరాదు. ఎవని శక్తిని వాఁడు గ్రహించి వర్తింపవలయును. సాంబమూర్తి విషము మ్రింగెను; ఎల్లరు నందులకుఁ దగుదురా? అట్లు కాదని మూర్ఖించి యెవఁడేని విషము మ్రింగెనేని వాఁడు చెడక తీఱునా? కావునఁ బెద్దలు చెప్పినది చేయనగునే గాని వారు చేసినది చేయరాదు."

"రాజా! మఱియొక రహస్యము వినుము. గోపికల క్రీడలెల్ల వారి యంతఃకరణసంబంధములే గాని వారి కాయిక సంబంధములుగావు. వారి యంతఃకరణంబులన్నవో యోగ ప్రభావంబున నిఖిలకర్మబంధంబులనుండి వీడి యీశ్వరేచ్ఛాధీనములై భగవంతుఁ డాడించినట్లాడెను. అట్టి యాట యందు గుణదోషంబు లేమియుండును? గోపికలే గాదు; మునీంద్రులు సయితం బట్టి స్థితిలో నట్లే వర్తించుట వినవా?"

"రాజా! దేహాభిమానంబున్నంతకాలమే స్వపర తారతమ్యబుద్ధి యుండును. అది నశించినప్పుడు తానెవ్వఁడు? పరుఁడెవ్వఁడు? సర్వము నొక్కటే యగుఁ గదా. ఈ దృష్టితో రాసక్రీడాదుల తత్త్వము విమర్శించి గ్రహింపు" మనెను.

ఈ పరీక్షిత్తుని శంకకు భగవానుఁడే సమాధానము చెప్పెను. ఎట్లనిన—

శ్లో. "న మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే।
భర్జితాః క్వథితాధానాః ప్రాయో బీజాయ నేష్యతే॥"
(భాగ. 10-22-30)

శ్లో. "మత్కామారమణం జారం మత్స్వరూపావిదోఽబలాః।
బ్రహ్మామామపరం ప్రాపు స్సంగా చ్ఛతసహస్రశః॥"
(భాగ. 11-12-12)

"నాయందుఁ జేర్చిన బుద్ధి మొట్టమొదట కామ పూర్వకమైననుఁ గడకు నయ్యది తద్రహితమగును.

వేయింపఁబడిన గింజకు మరల నంకురశక్తి యుండునా? గోపికలు నా స్వరూపంబు నెఱుంగక జారభావంబుతో నాతోడ రమింపనెంచిరన్నను, నాతోడివారి మనస్సంయోగ బలంబున వారెట్టకేలకు బ్రహ్మభావంబునే చెందిరి. సాంగత్య మహిమ యట్టిదగుసుమీ."

ఈ లీలలగూర్చి వ్యాసమహర్షి రచించెను. అవి నింద్యములని వానికిఁ దోఁచినచో వానిని రచించియుండునా? వ్యాసుఁడు రచించినను శుకయోగీంద్రుఁడు వానిని స్వానుభూతికి సరిపడనియెడల నంగీకరించియుండునా? సభాంతరంబున నిర్భయముగాఁ జెప్పియుండునా? కృష్ణలీలలు కామదూషితంబులైనచోఁ గామినీకాంచనంబుల జయించి లోకప్రఖ్యాతిఁగన్న పరమహంసగారు వాని నుగ్గడించుటయేగాక యాలీల పేరు చెప్పినప్పుడెల్ల సమాధి నొందుటగునా?

కావునఁ గృష్ణలీలలను గామమోహితదృష్టితో విమర్శించి యాబుద్ధి గ్రహించినట్లు నమ్మి యాప్రకారము నడుచుటగాని ప్రచారముచేయుటగాని సమంజసముగాదు.



సూ. తత్రాపి న మాహాత్మ్యజ్ఞానవిస్మృత్యపవాదః. 22

గోపికలట్లు వర్తించిరే యుందురని లౌకికవ్యవహారసామ్యదృష్టితో భావించినను, భగవన్మాహాత్మ్యమును గూర్చినవారి జ్ఞానము మఱపుచెందదు. అనఁగాఁ గృష్ణుఁడు భగవంతుఁడను భావంబును మఱచి వారు వ్యవహరించిరని తలంపవలదు. వారి యీవ్యవహారమెల్ల నట్టి జ్ఞానపూర్వకముగానే యుండెను.

'మత్కామా రమణం జారం' అను శ్లోకమందు గోపికలు భగవత్స్వరూపంబు నెఱుంగక జారభావంబుతో వర్తించి'రని భగవంతుఁడే స్వయముగాఁ బల్కియుండఁగా, వారట్టిభావంబుతో వర్తింపలేదని యెట్లు చెప్పనగునని శంకింపవలదు. ఆ శ్లోకమందలి ప్రధానభావమేమో గ్రహింపవలయును. సాంగత్య ప్రభావ వర్ణనమే యందుఁ బ్రధానాంశము. ఇతరంబు లర్థవాదంబులు. జారులైనను జోరులైనను సత్సాంగత్య మహిమంజేసి పరిణామము నొందుదురని సూచించుటకుగా జారశబ్దం బర్థవాదార్థము ప్రయోగింపఁబడెను. రెండు పదార్థంబు లొకటితో నొకటి చేరునప్పుడు రెంటిలో దేని ప్రభావం బధికమో దాని సామ్యంబును రెండవది పడయును. గంగాజల మిందులకు నిదర్శనము. ఎన్నోనదులు గంగలోఁగలియుచున్నవి. అయినను గంగాజలము తన పారిశుద్ధ్యంబు నొకించుకయు గోలుపోవకయే తనలోఁబడు జలంబులకుఁగూడఁ బారిశుద్ధ్యంబు నొసంగుచున్నదిగదా. ఇఁక భగవంతుని విషయమై చెప్పవలయునా? గోపికలకు మొట్టమొదట కృష్ణుఁడు భగవంతుఁడను జ్ఞానము లేక వాని లోకమోహన సౌందర్యంబును వలచి వానిని ప్రేమించిరను దాని నంగీకరించినను, ఆ భావము వారికిఁ బ్రథమావస్థలో మాత్రమే యుండవచ్చును; అది క్రమముగా మాఱి కడకుఁ బరాభక్తిరూపంబునుదాల్చి యుండరాదా? ఇందు వింతయేమిగలదు?

ఏ భాగవతములోని పైముక్క నాధారముచేసి గోపికా జారభావంబును బ్రతిపాదింతురో, ఆ భాగవతము

లోనే 'గోపికలు మనుష్యమాత్రునిగాఁ గృష్ణుని వరింపలే దనియు, ఆయన పరబ్రహ్మమను భావంబుతో మనస్సంగమం బొనర్చిరనియు నెన్నో శ్లోకంబులుగలవు. వానిసంగతి యేమనెదరు ? కృష్ణుని యమానుషిక కృత్యంబుల నెన్నో గోపికలు కన్నారఁజూచిరి. ఎన్నోవినిరి. అట్లు కన్న విన్న మహిమలు వారికి నంతలోనే మఱుపునకు వచ్చెనని భావింప నేల ?

ఎవనియం దేనియు నేదో యొకవిధమైన ఉత్కర్ష అనగా మాహాత్మ్యముండని దే వానియందుఁ బూజాభావము తలక్రిందుగాఁ దపించినను గలుగదు. ఈ యర్థమునే బ్రహ్మ సూత్రములు 4–1–5 లో స్పష్టముగాఁ జెప్పుచున్నవి. (బ్రహ్మదృష్టిః, ఉత్కర్షాత్). పూజ్యమందుఁ బ్రీతి హెచ్చు కొలఁదిమాహాత్మ్యాకర్షణము సహజముగాసన్నగిలుచుండును. ఎప్పుడు పూజ్యపూజకులకు ననన్యత్వముగలుగునో నాఁటితో సర్వభావములు సమాస్తమగును.



## సూ. తద్విహీనం జారాణామివ. 23

గోపికాంగనలప్రేమ భగవన్మాహాత్మ్య జ్ఞానవిహీనమైనదగుచో అది లోకమందలి జారుల పరస్పర ప్రేమవంటిదై నైచ్యమే యగును.

'పెద్దలఁగన్నప్పుడు పిన్న లెదు రేగి వారిని నమస్కరించి తోడి తెచ్చుట సజ్జన సాంప్రదాయము. కృష్ణుఁడు భగవంతుఁడేయను భావము గోపికలకుఁ గలదేని కృష్ణుని

గాంచినప్పుడు వారు వానికి నెదురేగి నమస్కరింపరేల? అని శంకింపవలదు. పూజ్యుఁడు వేఱుగానున్నప్పు డీ పనులకు నవకాశముగలదు. గోపికలపూజ్యుఁడు వారి హృదయాంతరంబులందే యుండెను. వారెప్పుడుఁ దన్మయులై యుండిరి. అట్టియెడఁ గాయిక వ్యాపారమైన ప్రత్యుత్థానాదులకు నవకాశమేమిగలదు ?'

శ్లో. ప్రత్యుద్గమ ప్రశ్రయణాభివాదనం
　　విధీయతే సాధుమిథస్సుమధ్యమే!
　ప్రాజ్ఞైః పరస్మై పురుషాయ చేతసా
　　గుహాశయాయైవ న దేహమానినే॥

(భాగ. 4. 3. 21)

దీనింబట్టి గోపికల భావంబెట్టిదో తెల్లమగును. ఇట్టి శ్లోకంబులకు భాగవతమందు లెక్కయే గలుగదు.



## సూ. నాస్త్యేవ తస్మిన్ తత్సుఖసుఖిత్వమ్.　　24

గోపికలకు అట్టి సుఖముగాని తత్సుఖభావంబుగాని బొత్తుగా లేదు.

జారాంగన యెప్పుడును స్వార్థపరయై యుండును; దాని ప్రీతికి నిల్కడలేదు; ప్రియుని సౌఖ్యంబు నంతగాఁ దలంపదు. భక్తియందన్నో స్వప్రయోజనత్వముయొక్క పొలఁకువగూడ నుండదు. భక్తుఁ డాత్మసౌఖ్యంబును గలలోఁ

గూడఁ దలంపఁడు. వాఁడు వాని ప్రేయసార్థ మెన్నికష్టంబుల నైన నోర్చును. గోపికలట్లే వర్తించిరి. కృష్ణునకు సౌఖ్యముఁ గూర్చుటయే స్వధర్మముగా వారు భావించిరి. వానిసౌఖ్యమే తమసౌఖ్యముగా నెంచిరి. అనఁగాఁ బరాభక్తియందు అహంకార మమకారములకే యవకాశము లేదని యీ సూత్రముయొక్క తాత్పర్యము.

ప్రథమాధ్యాయము సంపూర్ణము



# ద్వితీయాధ్యాయము

## పరాభక్తిస్వరూపము (మహత్త్వము)

**సూ. సా తు కర్మజ్ఞానయోగేభ్యోఽప్యధికతరా. 25**

మొదటి అధ్యాయములో వివరింపఁబడిన పరాభక్తి యనునది కర్మ జ్ఞానయోగంబులు మూఁటికన్న నధికతరమైనదిగా నున్నది.

మనస్సునకు జ్ఞానేచ్ఛా క్రియాశక్తులు గలవు. ఈ మూఁడు శక్తులు పరాభక్తియం దెవ్విధముగా వ్యవహరించు నది గోపికల పరాభక్తిని నిదర్శనంబుగాఁ గొని మహర్షిగారు విశదీకరించిరి. భగవత్ప్రభావంబును జ్ఞానశక్తి గ్రహించు చున్నది; భగవంతునకు సర్వాత్మ సమర్పణంబు చేయుట యందు ఇచ్ఛాశక్తి వ్యక్తమగుచున్నది. అట్టి సమర్పణ ఫలంబుగా నింద్రియంబులు తదధీనంబులై వర్తించుటయందుఁ గ్రియాశక్తి వ్యక్తమగును. ఈ మూఁటి సమ్మేళన ఫలంబుగాఁ బారవశ్యంబువలనఁ బరమానందానుభూతి గలుగును.

ఆత్మదర్శన మనఁగా మనశ్శక్తుల నన్నింటిని శుద్ధిచేసి యవి యొక్కొక్కటి సమగ్రముగా వర్తించునట్లు చేయుట మాత్రమేనా? అంతకన్న విశేష మేమైన గలదా? యని ప్రశ్నింపవచ్చును. [illegible] విషయమునే మహర్షిగారు 25 మొదలు 33 వ సూత్రము[illegible]వఱకు విమర్శించి పరాభక్తి యనునది సాధనఫలంబుగాదనియు, ఆత్మకుఁ గల నైజపరిపూర్ణత

యనుభవంబునకు వచ్చుటవలనఁ గలుగునట్టి యనిర్వాచనీయంబైన యొక స్థితి యనియు, మనశ్శక్తుల వివిధ విలాసంబులు ఆనుషంగికంబులనియు నిశ్చయించుచున్నారు. ఆత్మ యనునది నైజముగానే పరిపూర్ణము. క్రొత్తగా దానికిఁ బూర్ణత్వమును గలిగించుటగాదు. ఆత్మ యట్టిదని గ్రహించుట యెల్లప్పుడు సాధ్యముగాదు ; కొన్ని పరిస్థితులందే యది సాధ్యమగును. అట్టి పరిస్థితులను గూర్చుటకై మనశ్శక్తులు తోడ్పడును. అవి తావన్మాత్ర ప్రయోజనకారులే గాని యంతకుమించినవిగావు.

పరాభక్తి యనునది జ్ఞాన, కర్మ, యోగంబుల, మూఁటికన్న నుత్తమమని చెప్పఁబడెను. ఆత్మసాక్షాత్కారంబునకు జ్ఞానాదులు మూఁడు మూఁడు మార్గంబులనిరి. పరాభక్తి యా మూఁటికన్న నుత్తమమైనదనుటవలన, ఆ మూఁడు మార్గంబులకన్న విలక్షమైన మార్గము గాఁబోలునని భావింపవలదు. పై మూఁడు మార్గంబులవలనఁ గలుగు నాత్మసాక్షాత్కారంబునకన్నఁ బరాభక్తివలనఁ గలుగునట్టి యాత్మసాక్షాత్కారము పరిపూర్ణమని మహర్షిగారి తాత్పర్యము.

జ్ఞానయోగమందు నిత్యాఽనిత్య వివేచనశక్తియు, కర్మయోగమందు నిచ్ఛాశక్తియు, భక్తియోగమందు ఆవేశశక్తియు వ్యవహరించును. రాజయో[illegible]ంబుగూడ నొక యోగంబుగా గ్రహింపఁబడియున్నది. [illegible]ర్షిగారు దాని నొక ప్రత్యేక యోగంబుగా గ్రహించుటలేదు. కారణం

బేమని శంకింపవచ్చును. రాజయోగంబు జ్ఞానయోగాంగమే యని శ్రీ మధుసూదనసరస్వతివారు వారి భక్తిరసాయన గ్రంథమందు నుడివిరి. మహర్షిగారి భావంబుగూడ నదిగానే యుండునని గ్రహింపఁదగును. రాజయోగ మనునది ధ్యాన రూపంబుగా నుండును. ధ్యాన మనునది పై మూఁడు యోగంబులకు నవసరము. ఈ విధముగాఁ జూచినచో రాజయోగము ప్రతి యోగమందు నంతర్భూతమే యగును. ఆ కారణంబున దానిని ప్రత్యేకయోగంబుగా గ్రహింప రైరని యూహింపవచ్చును. (శాండిల్యభక్తిసూత్రము 12)

'మోక్షార్థము జ్ఞాన కర్మ భక్తులను యోగంబులను మూఁడు మార్గంబులఁ బ్రతిపాదించితిని. అవి తప్ప వేఱొక మార్గము లేదు' అని శ్రీకృష్ణభగవానుఁడుగూడ భాగవత ఏకాదశస్కంధము 20, అధ్యాయము 6 వ శ్లోకములోఁ జెప్పెను. ఆత్మదర్శనరూపమైన యా యుత్తమోత్తమాను భూతిని విమర్శించునప్పు డీ మూఁడు యోగములలో నేదే నొకదానినే ఆధారముచేసి నిశ్చయింతురు.

ఆ యనుభూతి యెట్టిది? అనఁగా దాని స్వరూప మేమి? అని యడుగవచ్చును. అది సద్దర్శనరూపమని శ్రీ శంకరులును, పరమప్రేమరూపంబని శ్రీ రామానుజ చైతన్యాదులును నుడివిరి. 'అయం తు పరమో ధర్మో యద్ యోగేనా[illegible]ర్శనమ్' అని యాజ్ఞవల్క్యస్మృతి (1-8) చెప్పుచున్నది. మఱికొందఱు స్మృతికర్తలుగూడ నట్లే యది పరమధర్మస్వరూపమనిరి.

ఈ విషయమైన మతభేదము పూర్వమేగాక యిప్పటి మతకర్తలలోఁ గూడఁ గలదు. మాక్సుముల్లరనువా రొక విధముగా, వాన్ హార్టుమేన్ అనువా రొకవిధముగా, రోమనెస్ అనువా రింకొక విధంబుగా భావింతురు. వీరు ముగ్గురు జ్ఞానశాఖకే సంబంధింతురు. అట్లుండియు వారిలో వారికే భేదభావము గలదు. అట్లే కర్మ భక్తిశాఖలకు సంబంధించిన పాశ్చాత్య తత్త్వవేత్తలు భిన్నభిన్నాభిప్రాయములు పడిరి. ఈ పాశ్చాత్యుల దృష్టి చూడఁగా నంశదృష్టిగాఁ దోఁచునే గాని పూర్ణదృష్టిగాఁ దోఁపదు. మానసికశక్తులకును కేవలానుభూతికి నెట్టి సంబంధము గలుగదు. సాధన చరమదశయందీ మానసికశక్తుల నెల్ల దాఁటవలయును; అనఁగా అమనస్కత్వము రావలయును. అప్పుడు మాత్రమే సత్పదార్థానుభూతి సంపూర్ణముగా సిద్ధించును. ఆ స్థితి యసదృశము, సర్వేంద్రియాతీతము. అందువలననే యా స్థితిని గీతలో

శ్లో. ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్య వద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవచ్చైనమన్యః శ్రుణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥

అని భగవానుఁడు వర్ణించెను. ఆత్మదర్శనమే మహాదుర్లభము. అనేకసహస్రజన్మసుకృతపరిపాకంబున [illegible] జ్ఞానియగునో, అట్లు జ్ఞానియైన తర్వాతగూడ ఎవనికిఁ ప్రారబ్ధశేషంబుండదో వానికి వాని యంత్యజన్మమందు ఆత్మసాక్షాత్కారము

పూర్ణముగా నగునని భగవంతుఁడే చెప్పెను. అట్టిది గల్గి నను, అతఁడు దానిని మహాశ్చర్యముతోనే చూచును. అట్లు చూచినవారిని మీ సాక్షాత్కారతత్త్వ మేమని యడిగి నచో, వారు చెప్పునదంతయు నాశ్చర్యముగానే చెప్పుదురు. వినువారికి మహాశ్చర్యముగా నుండును. ఎంత చెప్పినను, ఎంతవిన్నను దాని నెవరు నెఱుంగఁజాలరు. అనఁగా ఆత్మాను భూతి యనుభవైక వేద్యమేగాని యింద్రియగోచరవిషయము గాదని తాత్పర్యము.

ఈ పరాభక్తినే 'భావశూన్య సద్భావస్థితి' యని శ్రీ రమణమహర్షిగారు వచించిరి. ఆ స్థితియందు భావములు అనగా సంకల్పంబు లెవ్వియు నుండవు. సంకల్పాదులకు హృదయము జన్మస్థానము. ఆ స్థాన మట్టి దశయందు నిరా లంబ నిర్వికల్పముగా నుండును. అప్పుడచ్చట జ్ఞానేచ్ఛా క్రియాశక్తులకు నైక్యత సంఘటిల్లుచున్నది. అదియే భక్తి తత్త్వంబునకుఁ బరమావస్థయగును.

---

## సూ. ఫలరూపత్వాత్.    26

పరాభక్తి యనునది ఫలరూపంబుగా నున్నది. యోగంబులన్నో సాధనమాత్రంబులు. సాధనంబులకన్న వాని ఫలంబు శ్రేష్ఠమగుట న్యాయమేగదా.

పరాభక్తి[illegible]ంచు పర్యంతమే యోగంబులు సహ కారులగును. [illegible]నంతరము వానితోఁ బనియే యుండదు. దానంజేసి సాధనంబులకన్న సాధ్యంబుత్తమంబని చెప్పఁ

బడెను. పరాభక్తి యనునది యోగంబులకు ఫలంబగుననక ఫలరూపంబగునని మహర్షి గారు చెప్పుటయందు వారి తాత్పర్యంబును గ్రహింపవలయును. ఫలంబగునేని దానికి నాశనము తప్పదు. పుట్టినది గిట్టక మానదుగదా. పరాభక్తియు ఫలంబగునేని దానికి నాశనము స్వతస్సిద్ధము. దానికి నాశనములేదు గాఁబట్టి అది యోగంబుల ఫలంబు గానేరదు. ఈ పరాభక్తియందలి యీ విశేషమే దాని నితరానందానుభవంబులకన్న మిన్నగాఁజేయుచున్నది. స్వర్గాద్యానందంబులెల్లఁ గర్మఫలంబులగును. కర్మఫలంబులగును గావుననే వానికి నాశనము తప్పదు. పరాభక్తి కర్మఫలముగాదనియు, దానంజేసి యది యనశ్వరమనియు, సాధనసంపత్తి తత్సిద్ధికిఁ దోడ్పడుచున్నందున వానికి నది ఫలంబుగా సామాన్యదృష్టికిఁ గాన్పించుచున్నదనియు మహర్షి గారి భావము.



## సూ. ఈశ్వరస్యాప్యభిమాన ద్వేషిత్వాత్ దైన్య ప్రియత్వాత్. 27

సాధనంబులైన యోగంబులు సాధ్యమైన పరాభక్తికన్నఁ దక్కువ యనుటకు మహర్షి గారు మఱియొక కారణంబునుగూడఁ దెల్పుచున్నారు. సాధనమందు స్వప్రయత్నము తప్పదు. స్వప్రయత్నమన్నంతనే యత్నించు వానియందు తానొక ప్రత్యేక వ్యక్తి యను భా[illegible] బంటియే యుండును. అనఁగా అహంకారము తప్పకుండును. అహ[illegible]ము నశించినఁగాని పరాభక్తి గలుగదు. ఇంకను లోఁతునకు దిగి విచారించిచోఁ బరాభక్తి సిద్ధికి ఈ యహంకారం బెంతయు నడ్డుపడుచున్నది. యోగంబులెల్ల

నంతో యింతో యహంకారంబు నాశ్రయించియే యుండుననియు, పరాభక్తియన్ననో యహంకారము నశించినఁగాని కలుగదనియు, ఆ కారణంబునఁగూడ యోగంబులకన్నఁ బరాభక్తి యుత్తమమగుననియు మహర్షిగారి భావము.

సూత్రమందలి పదంబులనుబట్టి భగవంతునకుఁగూడ రాగద్వేషంబులును మమకారాదులును గలవని భావింపవచ్చును. వాస్తవముగా సూత్రభావం బదిగాదు. రాగద్వేషాదులు సాధకునకే యుండరాదనఁగా సాధ్యమునకు నుండవచ్చునా? అట్లుండవచ్చునందురేని 'సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి న ప్రియః' (9–29) అను భగవద్వాక్యంబునకు గతియేమి? సాధకులు సిద్ధ్యసిద్ధులనుబట్టి యట్లు భావింతురనియు, అది వారి యజ్ఞానదోషమే గాని వేఱుగాదనియు సూత్రము సూచించుచున్నది.

భగవదనుగ్రహం బెల్లప్పుడు నెల్లెడలఁ గలదు. దానిని బడయుటకు నహంకార మడ్డుపడుచుండును. ఈ యహంకారంబును దొలఁగింతురేని భగవదనుగ్రహము వారికి స్వతస్సిద్ధమే యగును. అగ్నికి వేఁడిమి నైజము. అయినను దానిని సమీపించినవానికే దాని వేఁడిమి తగులును గాని సమీపింపనివానికి దాని వేఁడిమి తగులదు గదా. అట్లని అగ్నియందు రాగద్వేషంబు లారోపించుట యుక్తియుక్తమా? అట్లే భగవదనుగ్రహవిషయంబుగూడ నని గ్రహింపవలయును. 'పక్ష[illegible] నైర్ఘృణ్యంబులను భగవంతునెడ నారోపింపరాదనియు, వారివారి సుకృత దుష్కృతంబులనుబట్టి యట్లు కాన్పించుచుండుననియు' బ్రహ్మసూత్రములుగూడ

(11-1-34) లోఁ జెప్పుచున్నవి. ఈ విషయమై భాగవతంబు గూడ నిట్లు చెప్పుచున్నది :

శ్లో. 'నైషా పరావరమతిర్భవతో నను స్యా
జ్జంతోర్యథాత్మసుహృదో జగత'స్తథాపి।
సంసేవయా సురతరోరివ తే ప్రసాదః
సేవానురూపముదయో న పరావరత్వమ్॥
(సప్తమ. అ. 9-27.)

భగవంతునకు ఉత్తమాధమ భేదములు లేవు. ఏలయందురా? సమస్త జగత్తునకు భగవంతుఁడే యాత్మయు సుహృత్తు నగును. అట్లగుచో వాని యనుగ్రహము ఎల్లరయెడ నొక్కటిగానే యుండవలయునుగదా యని శంకింపవచ్చును. కల్పవృక్షము సేవించినవారికే ఫలంబునిచ్చునట్లుగా భగవంతుఁడుగూడ వానినెవరు సేవింతురో వారికే ఫలమిచ్చును. పరాఙ్ముఖులకు ఫలము నియ్యఁడు. ఫలము గలుగకపోవుటకు పరాఙ్ముఖత్వమే కారణముగాని భగవంతుని పక్షపాతబుద్ధి కారణముగాదు.

అహంకారము నశించుమార్గ మేమందురా? ఉపాయంబును భగవంతుఁడే 'ఉద్ధరే దాత్మనాత్మాన' మ్మని చెప్పెను. వేఱొక యుపాయంబుగలుగదు. మనస్సుచేతనే మనస్సును జక్కచేయుట చిత్రముగాఁ దోఁపవచ్చును. మనస్సున్నంతకాలం బహంకారంబుండును. మనస్సునది యున్నఁగాని దానిని సాధనంబుగాఁగొనుట యహంకారం

బును నాశమొనర్చుట పొసఁగదు. ఈసంగతి వినుటకే చిత్రమగును. ఇందొక రహస్యముగలదు. అమనస్కస్థితి యందు మాత్రమే యహంకారము సవాసనానాశనమగును. అమనస్కస్థితికి సాధనంబులెల్ల మానసికంబులుగానేయున్నవి. మనస్సునే సాధనంబుగాఁగొని పరిశ్రమించినప్పుడు, మనస్సు నందలి మలినవాసనలు క్రమక్రమముగా సన్నగిల్లి స్వయం ప్రకాశమైన యాత్మదీప్తికి నడ్డుతొలంగును. ఎప్పు డాత్మ దర్శనంబగునో యప్పుడు మనస్సు కేవల నామమాత్రస్థితిలో నున్నది స్వయముగానే నశించుచున్నది. మనోనాశనమన్న ప్పుడు భావమేమో మొదట గ్రహింపవలయును. కర్తయందు మానసికవ్యాపారంబులెల్ల నశించుననియు, అతఁడు కేవల భగవదిచ్ఛానువర్తి మాత్రుఁడై యుండుననియుఁ దాత్పర్యము.

మనస్సుచేత మనస్సు నుద్ధరించుటకు సామ్యముగా 'ముల్లుచేతఁ గాలిలోని ముల్లును దీసి తర్వాత రెంటిని బాఱ వేయుటవంటిదని' శ్రీ పరమహంసగారు ఎల్లరకు సులువుగా గ్రాహ్యమగునట్లు చెప్పిరి.



## సూ. తస్యాః జ్ఞానమేవ సాధనమిత్యేకే. 28

జ్ఞానమువలననే ముక్తియని కొందఱమతము.

నారదమహర్షి [illegible]దృష్టిలో మోక్షమన్నను బరాభక్తియన్న నొకటే యగును. ఆ మోక్ష[illegible] సంపాదించుటకు కొందఱు వివిధమార్గంబులను వారివారి యనుభవ యుక్త్యాదుల ప్రకారము చెప్పిరి. కొందఱమతంబున జ్ఞాన మార్గముకన్న వేఱొకదారి మోక్షసాధనంబునకు గలుగదు.

జ్ఞానమార్గమనఁగానేమి? ప్రతివ్యక్తియందు నొక శక్తిగలదు. దానిని అంతఃకరణశక్తియందురు. ఆ శక్తి నానా రూపంబుల వ్యవహరించుచుండును. ఆ వ్యవహారంబులనుబట్టి యాశక్తికి నాయాపేర్లుపెట్టిరి. ఆ యంతశ్శక్తి హితాహిత పరిశీలనము చేయునప్పుడు దానిని బుద్ధియనిరి. అట్లు బుద్ధి నిశ్చయించిన దానియొక్క పూర్వాపరములను చింతన సేయునపుడు (క్రియారూపంబునఁ బెట్టునప్పుడు) దానిని చిత్తమనిరి. ఇట్లాయంతశ్శక్తికి దాని వ్యవహారంబునుబట్టి వివిధ నామంబులు గలుగుచున్నవి.

వివిధరూప వ్యవహారంబుగల యాయంతశ్శక్తి యితర రూప వ్యవహారంబుల మట్టగించి కేవల బుద్ధిరూప వ్యవహారంబునే చేయుట జ్ఞానమార్గమనిరి. ఈ జ్ఞానమార్గంబొక్కటే మోక్షదాయకంబని కొందఱి మతము. పూర్వమీమాంస తక్కఁ దక్కిన దర్శనశాస్త్రంబులెల్ల నీమార్గమునే యనుసరించును. క్రైస్తవమతము, బౌద్ధమతము, జైనమతము మఱికొన్ని యిదానీంతనమతంబులుగూడ జ్ఞానభావంబునే యూని పల్కుచున్నవి.

జ్ఞానమన్నప్పుడు శంకరాదుల తాత్పర్యమేమో గ్రహింపవలయును. విషయం బిదియని శాస్త్రమూలంబుననో యన్యమార్గంబునో తెలిసికొనుట జ్ఞానమనియు, అట్లు తెలిసినది యనుభవసిద్ధమగుట విజ్ఞానమనియుఁ గొందఱనిరి. తద్విపరీతంబుగా మఱికొందఱు వచించిరి. దేనికైనను విషయంబిదియని తెలిసికొనుట ప్రధానము. ఈ తెలివి జ్ఞాన

మార్గంబున కేగాదు తక్కినమార్గంబులకుఁగూడ నత్యావ
సరము. ప్రతిమార్గంబునకుఁ బ్రాప్యం బొక్కటే యగును.
ప్రాప్యం బెట్టిదో దానినిఁ బొందుటకు సాధనంబు లేవో
తెలిసిన తర్వాత ఎవఁడైనను బ్రయత్నించును.

ఈ తెలివి మూఁడు మార్గంబులకు నవసరంబై
యున్నను, అందు జ్ఞానమార్గంబునకుఁ దక్కిన రెండు మార్గం
బులకన్న నెక్కువగా నది గావలయును. జ్ఞానమార్గమందు
విచారణ ప్రధానము. తత్త్వవిషయమందు కేవల హేతు
వాదము నంతగా నమ్మరాదని కఠోపనిషత్తును (11-9)
బ్రహ్మసూత్రములును (11-1-11) చెప్పుచున్నందునఁ
గొందఱు కేవలవిచారణను దృణీకరింతురు. అట్టి తృణీ
కారము కూడదని యీ సూత్రము సూచించుచున్నది.
వాస్తవము విచారించినచోఁ గఠోపనిషత్తుగాని బ్రహ్మ
సూత్రములుగాని యుక్తినిఁ దృణీకరించుటలేదు. మఱేమనఁగా
దానినే పరమసాధనంబుగా నాశ్రయింపవలదనియు,
ఎందెందు యుక్తికిని పెద్దల యనుభవంబునకును సరిపోవునో
వానిని మాత్రమే గ్రహింపవలయుననియు నవి తెలుపు
చున్నవి. ఇది న్యాయమేగదా!

జ్ఞాన విజ్ఞాన శబ్దంబు లేయే యర్థంబులందు వాడఁబడు
చున్నది పైనిఁ దెల్పఁబడెను. జ్ఞానమనఁగా శాస్త్రాదిజ్ఞానం
బనియు, విజ్ఞానమనఁగా అనుభవజ్ఞానమనియు గ్రహింతు
మేని, అప్పుడు విజ్ఞానము అనుభూతిరూపమగునే గాని యొక
మార్గము కానేరదు. దానంజేసి యది సాధనముగాదు ;

జ్ఞానము మాత్రము సాధనమగును. (మోక్షంబునకు జ్ఞానమే పరమసాధనమని శ్రీ శంకరాచార్యులన్నప్పుడు, విషయం బును దెలిసికొనుట, సాధ్యసిద్ధికిఁ గల యడ్డంకు లివి యని యెఱుంగుట, వానిని దొలఁగించుటకు నుపాయంబు నెఱుం గుట ముఖ్యమను భావంబుతో వా రా పదంబు నుపయోగించి యుందురు.) అంతియగాని భక్త్యాదు లనవసరంబులని భావించియుండరు. అట్లు భావించియుందురేని శివానందల హరి మున్నగువానిని వారు రచించియే యుండరు. విషయం బిదియని తెలిసినంతనే ప్రయోజనములేదు. తెలిసినదానిని శ్రద్ధాభక్తులతో ననుష్ఠించి యనుభవంబునకుఁ దెచ్చికొన వలయును. విషయమును సాధక బాధకంబులతోడఁ జక్కఁగాఁ దెలిసికొని తర్వాత సిద్ధికై యత్నించుట సులభమగును. అట్లుగాక తెలివి నాధారముచేసికొని వాదోపవాదంబులచేతఁ గాలమెల్ల వృథచేయుటవలన ఫలములేదు. వేయేల! విచార రూపమైన యీ జ్ఞానమునే మననమందురు. అనుష్ఠానమందు మననంబునకు నెంత ప్రాముఖ్యత యియ్యఁబడియున్నదో వేఱ చెప్పనక్కఱలేదు.

'ఎవఁడు యుక్తిపూర్వకంబుగా శాస్త్రార్థంబును గ్రహించునో వానికి మాత్రమే ధర్మతత్త్వము గోచరించు' నని మనువును, 'యుక్తికి సరిపడనిచో బ్రహ్మవాక్యము నైనను నిరసింపవలయు'నని యోగవాసిష్ఠంబును స్పష్టముగాఁ జెప్పుచున్నవి. శ్రీకృష్ణభగవానుఁడు బ్రహ్మవిద్యను సమ గ్రంబుగా నర్జునకు బోధించి 'అర్జునా! నా చెప్పినదెల్లఁ జక్కఁగా విమర్శించి యేది నీ బుద్ధికి యోగ్యముగాఁ

దోఁచునో యది చేయు'మనెను. ఒక శాస్త్రార్థంబునకు మఱియొక శాస్త్రార్థంబునకుఁ బరస్పర విరోధంబు గాన్పించి నప్పుడు యుక్తి నాశ్రయించి విరోధభావంబును సమరసము చేసికొని యాచరింపవలయు'నని బృహస్పతియు జైమినియు నుపదేశించిరి. దీనింబట్టి చూచినచో యుక్తిని మన పెద్ద లెల్లరు మహాపూజ్యభావంబుతోఁ జూచిరే గాని చెత్తగాఁ ద్రోసివేయలేదని స్పష్టమగును.

యుక్తికి నట్టి పూజ్యత యిచ్చినంతమాత్రాననే యుక్తియే సర్వము కానేరదు; అట్లు గ్రహింపనుగూడదు. ఈ కారణంబులవలన 'మోక్షానుభూతికి జ్ఞానమొక్కటే సాధనం' బనునట్టి సూత్రంబును బెక్కు రంగీకరింపరు.



## సూ. అన్యోన్యాశ్రయత్వమిత్యన్యే. 29

మోక్షప్రాప్తికి నెల్లమార్గంబులు నొండొంటి నాశ్రయించియున్న వని మఱికొందఱు తలంతురు.

మనస్సు అనుదానిని తత్తత్కాలమందలి దాని వ్యవహారంబునుబట్టి వేఱువేఱు పేర్లఁ జెప్పినను, మొత్తముమీఁద నది యొక్కటే యగును. దానిని బ్రత్యేకముగాఁ జీల్చుటకే సాధ్యముగాదు. దాని వ్యవహారములలోఁ గాలాను సారంబుగా నేదో యొక వ్యవహారము ప్రధానంబుగా జరుగుచున్నను [illegible]న వ్యవహారంబులన్నియు నుడిగియుండు వని భావింపరాదు. అవియు జరుగుచునే యుండును. అయి

నను వాని వ్యవహారంబు లంతగా గోచరింపకుండును. యత్నసిద్ధిని గోరువాఁడు ఏదే నొక వ్యవహారంబునకు మాత్రమే ప్రాధాన్యంబునీయక, మానసికవ్యవహారంబు లెల్లఁ బరస్పర సాపేక్షకంబులును అన్యోన్య బలకరంబులును గావున, వానియన్నిఁటిని వ్యవహరింపఁజేయుట యుక్తము. కార్యసిద్ధి శీఘ్రముగాఁ జేకూరును.

యుక్తి యనునది పురుషునకు సాదృశ్యమనియు, ప్రీతి (భక్తి) అనునది స్త్రీకి సాదృశ్యమనియు, పురుషుఁ డంతః పురముదాఁక పోఁగల్గునే గాని లోపలికిఁ బ్రవేశింపనేరఁ డనియు, స్త్రీ యెప్పుడైనను నిరాతంకంబుగా లోపలికిఁ బ్రవేశింపఁగలదనియు, శ్రీరామకృష్ణపరమహంసగారు జ్ఞానమునకును భక్తికినిఁ గల భేదంబును సామాన్యవాక్యములతోఁ దెలిపిరి. ఇదేభావంబును రైస్‌బ్రూక్ అను మహాత్ముఁడు గూడ ననువదించెను. అట్లే పాశ్చాత్య తత్త్వవేత్తలు పెక్కుఱు వచించిరి.

కావున భక్తిపూరితముగాని జ్ఞానము ఎండుమ్రాఁకు వంటిదగును. జ్ఞానపురస్సరముగాని భక్తి గ్రుడ్డియెద్దు చేనిలో మేయుటగును. రెండును గలసి మెలసి వర్తింపవలయును. ఒకదానిని విడిచి యొకటి వేయేండ్లు తపించినను అవి చక్కఁగా వ్యవహరింపవు. కావున సాక్షాత్కారంబునకు భక్తి జ్ఞానములు రెండు నవసరంబ[illegible] మఱికొందఱు భావింతురు.



సూ. స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః.  30

పరాభక్తి యనునది ఒక సాధనఫలముగాని, ఒక కారణకార్యము గాని కానేరదు. దాని కదే ఫలరూపమగునని బ్రహ్మకుమారుఁడనైన (నారదుఁడనైన) నా మతము. అనఁగాఁ బరాభక్తి యన నెట్టిదో యను విషయంబున నారదమహర్షి తన మతంబు నీ సూత్రమందుఁ దెలుపుచున్నాఁడు.

బ్రహ్మవిద్యాసాధనరూపమైన స్వయంకృషియెల్ల అవిద్యాసంబంధమే గాని వేఱుగాదు. అవిద్యనే మాయ యనియు వచింతురు. సాధనము అవిద్యాసంబంధమైనప్పుడు తత్ఫలముగూడ అవిద్యాసంబంధమే యగును. అవిద్యాసంబంధమనఁగాఁ గారణకార్యరూపమని భావము. సాధనములు కారణము; అహంకారనాశనము, మనశ్శుద్ధి యివి కార్యము. ఆత్మానుభూతి యనునది అహంకారనాశ మనశ్శుద్ధులుమాత్రమేగాదు. ఆత్మ యెప్పుడును బూర్ణమును స్వయంప్రకాశమునై యున్నది. అహంకారాదులు దాని నావరించి తత్ప్రకాశంబునకు నడ్డువడుచున్నవి. ఈ యడ్డంకులు తొలఁగినంతనే యాత్మప్రకాశము యథాగతిఁ బ్రకాశించును. సాధనంబులవలన నియ్యడ్డంకులు తొలఁగును.

అడ్డంకులు [illegible]లఁగుట కారణకార్యరూపము. అంత మాత్రాననే [illegible]భూతి గలుగదు. కారణకార్యరూపమైన యీ మాయాప్రపంచంబును దాఁటిన తర్వాత అది గలుగు

చున్నది. మఱియు సాధనసంపత్తివలననే యనుభూతికి యోగ్యమైన స్థితి గలుగదని మున్నే సూచింపఁబడెను. సాధనసంపత్తివలన నడ్డంకులు తొలంగినను భగవదను గ్రహంబు గలిగినఁ గాని యట్టి యోగ్యస్థితి చేకూరదు. సాధనసంపత్తివలనఁ బరిశుద్ధమై తనవంకకు మరలిన యంతః కరణమును భగవంతుఁడు స్వయముగా నాకర్షించును. ఈ యాకర్షణమునే యనుగ్రహమనిరి. మోక్షేచ్ఛ యెంత తీవ్రముగా నుండునో యీ యనుగ్రహముగూడ నంత శీఘ్రముగాఁ బ్రవహించును.

ఈ భగవదనుగ్రహము సర్వదా మనయెడఁ బ్రసరించుచునేయుండును. ఆ ప్రసారంబునకు మనము పాత్రులమైనప్పుడే తత్ఫలము మనకు ననుభవసిద్ధమగును. కావునఁ బరాభక్తి యెట్టి సాధనమునకు ఫలముగాదు. దాని కదే ఫలమగుచున్నది.

విద్యయనఁగాఁ బరబ్రహ్మము. విద్యకానిది అవిద్యయగును. పరబ్రహ్మము కారణకార్యాతీతమైన తత్త్వము. ఆ తత్త్వమునకు భిన్నమైన కారణకార్య ప్రపంచము అవిద్యయగును. అవిద్యనే మాయయనిరి. దీని వివరణము వెనుకఁ గననగును.



**సూ. రాజగృహ భోజనాదిషు తథైవ దృష్టత్వాత్. 31**

పరాభక్తి యనునది స్వయంఫలరూపమగుటకు రాజు, గృహము, భోజనము ఇవి దృష్టాంతములు.

ఒక రాజునకుఁ బుత్త్రుఁడొకఁడుండెను. ఆ బాలుని దొంగలెత్తుకొని పోయిరి. వాఁడెట్లో యొక సన్న్యాసి యాశ్రమముచేరెను. ఆ సన్న్యాసి వానిని బెంచుచుండెను. ఆ బాలునకు వాని పుట్టుపూర్వములు తెలియవు. తాను నొక సన్న్యాసియేయను భావముతో అతఁడుండెను. ఒక నాఁడు తటాలున వానికి వాని పుట్టుపూర్వములు తెలిపిరి. వాఁడు రాజపుత్త్రుఁడగుట క్రొత్తగాదు. పుట్టువుతోడనే యతఁడు రాజపుత్త్రుఁడగును. ఆసంగతిని మాత్రము వానికి జ్ఞప్తిచేసిరి. అదిసుత వానికి సన్న్యాసిభావము మాఱి రాజపుత్త్రభావము స్థిరమయ్యెను. అనఁగా వానికి స్వస్వరూపజ్ఞానము గలిగెను. అట్లే జీవాత్మ నిక్కముగాఁ బరమాత్మరూపమే యయ్యు ఉపాధిగతమగుటంజేసి యాజ్ఞానంబును మఱచి తాను వేఱనియుఁ బరమాత్మ వేఱనియు భావించుచున్నది. ఉపాధిరూపమైన యజ్ఞానంబునుండి దాని నుద్ధరించి నిజస్వరూపంబును బోధించినంతనే యది స్వస్వరూపంబుతోఁ బ్రకాశించుచున్నది.

ఒక గృహస్థు స్వగృహంబునువదలి దేశాంతరగతుఁడై యేండ్లు పూండ్లు గడపి మెట్టకేలకు వాని యిల్లు చేరెను. వాఁడు దేశాంతరగతుఁడైనను వాని యిల్లు వానిది

గానే యుండెను. అప్పటికి నిప్పటికి నెట్టి మార్పు లేదు. అందు వసించి సుఖించు రూపమైన యనుభవంబు మాత్రము వాని దేశాంతరగమనమునఁ జేసి దూరమయ్యెను. వాఁడు మఱల నిలుచేరిన వెంటనే వాని పూర్వానుభవంబులెల్ల నంత వఱకు విస్మృతిప్రాయములై యుండినవి వానికి ననుభవ సిద్ధము లాయెను. వాని రాకడవలనఁ గ్రొత్తలేమియు గలుగ లేదు.

ఆఁకలి గొన్నవానికి నన్నమిడినప్పుడు ఆఁకలివలని బాధమాత్రము తొలఁగుచున్న దేగాని నూత్నతృప్తి యేమి యుఁ గలుగుటలేదు. తృప్తి సహజము; ఆఁకలి బాధ నూత్నము. నూత్నమైన క్షుద్బాధ తొలఁగినప్పుడు సహజ మైన తృప్తి యట్లే యుండును.

పై దృష్టాంతము లేమి బోధించుచున్నవి? సాధన సంపత్తి యెల్ల ఆగంతుక నిరోధంబులను దొలఁగించునేగాని తత్పూర్వము లేని క్రొత్తదానిని దెచ్చిపెట్టుట లేదనియు, పరమానందానుభూతిరూపమైన పరాభక్తి యాత్మకు నైజమే గాని పురుషప్రయత్నంబుననొండె సాధన సంపత్తివలన నొండెఁ గ్రొత్తగాఁ గూర్పఁబడుట లేదనియు, దీనినే స్వస్వ రూపానుసంధానమందురనియుఁ బై నిదర్శనంబులు బోధించు చున్నవి.



## సూ. నతేన రాజా పరితోషః, క్షుచ్ఛాంతిర్వా.   32

సన్న్యాసిపుత్త్రుఁడవు గాదనుమాటచేత ఆ రాజపుత్త్రుఁడప్పుడు క్రొత్తఁగా రాజపుత్త్రుఁడు కాలేదు. తొలుదొల్త నుండి యతఁడు రాజపుత్త్రుఁడుగానేయుండెను. ఆమాటవలన వానికి నూత్నపదవి రాలేదు. దేశాంతరగతుఁడైన గృహమేధి స్థితియు క్షుధార్తుని స్థితియు పూర్వము లేని క్రొత్త మార్పును జెందుట లేదు. పూర్వస్థితి యొక్క యనుభూతికిఁగలిగిన యడ్డంకులు తొలఁగినవి. అవి తొలఁగుటచేతడవుగాఁ బూర్వస్థితి యథారూపంబున ననుభూతమగుచున్నది. అట్లే యోగాది సాధనముల సంగతిగూడనని గ్రహింపవలయును.



## సూ. తస్మాత్ సైవ గ్రాహ్యా ముముక్షుభిః.   33

పరాభక్తియనఁగాఁ బరిపూర్ణాత్మానుభూతి యని గ్రహింపవలయును దానినే మోక్షమందురు. బ్రహ్మసాధకుఁడు పరాభక్తియే యుత్తమోత్తమ స్థితియనియు, అంతకు మించిన ప్రాప్యము వేఱొకటి లేదనియు గ్రహింపవలయును. మోక్షమనఁగా [illegible]చెప్పిన పరమ ప్రేమరూపమేయనియుఁ దదన్యంబులు [illegible]ద్రంబులనియు భక్తియోగుల మతము. ఈ క్రింది శ్లోకంబులు తన్మతంబునకు జీవగఱ్ఱలగును.

శ్లో. 'నారాయణపరాః శాంతాః నకుతశ్చన బిభ్యతి।
స్వర్గాపవర్గ నరకేష్వపి తుల్యార్థ దర్శనః॥'
(భాగ. 6-17-28)

శ్లో. 'ధర్మార్థకామమోక్షేషు నేచ్ఛా మమ కదాచన,
త్వత్పాదపంకజాస్వాదజీవితం దీయతాం మమ॥'
(నారద పాంచరాత్రము)

శ్లో. 'భుక్తి ముక్తిస్పృహా యావత్ పిశాచీ హృదివర్తతే,
తావద్భక్తిసుఖస్యాత్ర కథ మభ్యుదయో భవేత్॥'
(జీవగోస్వామి)

పరాభక్తివిచారము సంపూర్ణము.

# తృతీయాధ్యాయము

నారదమహర్షి గారు పరాభక్తిస్వరూప మాహాత్మ్యంబులను పైని 33 సూత్రములలో విమర్శించి బోధించిరి. ఇది ప్రథమఖండమగును. తక్కిన గ్రంథమంతయుఁ దత్పరాభక్తి యొక్క యనుభూతికిఁదగిన సాధనంబులను దెలుపును. ఇది ద్వితీయఖండమగును.

ఆత్మ యెప్పుడును బూర్ణము నఖండము సచ్చిదానంద రూపముగా నున్నది. అది దానికి నైజము. ఆ సంగతి మనకు గోచరింపవలయునన్నచో గ్రహణయంత్ర మనఁదగు నట్టి మన మనస్సు తద్విషయంబును గ్రహించుటకుఁదగిన యోగ్యతను బడయవలయును. దీనినే శుద్ధి యందురు. ఈ శుద్ధికలాపమునే సాధనంబులనియు యోగంబులనియు మార్గంబులనియు వచింతురు.

మనస్సు అనుదానిని అది చేయు వ్యవహారంబులను బురస్కరించుకొని బుద్ధియని, చిత్తమని యిట్లు గ్రాహ్యార్థము విభజించిరని పూర్వము చెప్పఁబడెను. ఒక్కొక్క వ్యవహారంబునకు నొక్కొక్క శుద్ధిగలదు. అట్టి శుద్ధిచేతఁగాని యావ్యవహారము నిర్మలంబుగాఁ గొనసాగదు. భక్తి యోగము మనస్సుయొక్క యావేశ శక్తిని శుద్ధిచేయును. అట్లే తక్కిన యోగంబులును జ్ఞానాది శక్తులను శుద్ధి

చేయును. ఈ భక్తికి నెట్టి మనశ్శుద్ధి వలయునో, అందులకు నెట్టి సాధనంబు లుపయోగించునో మహర్షిగారు ప్రతిపాదించుచున్నారు.

భక్తిశాస్త్రమందు బుద్ధిశక్తికిఁ గొంతవఱకు మాత్రమే యవకాశముగలదు. భక్తికి ఆవేశభావము ప్రధానము. ఆ భావము పెడమార్గము మెట్టకుండుటకుఁగా నెంత మాత్రము జ్ఞానము గావలయునో యంతమాత్రము బుద్ధిశక్తి యొనగూర్చును. ఆవేశము భగవంతునియందలి తీవ్ర ప్రీతి వలనఁగలుగును. దానిని అపరభక్తి యందురు. ఈ యపర భక్తిగూడఁ బరాభక్తికి సాధనమాత్రమే యగును. ద్వివిధమైన యీ భక్తి విషయము 3-వ సూత్రమందు విమర్శింపఁబడెను.

ఈ యపరభక్తి యోగ్యసాధనంబులను మహర్షిగారు వివరించిరి. ఈ సాధనసామగ్రి అన్వయముఖంబులనియు వ్యతిరేక ముఖంబులనియు రెండు తెఱంగులు. ఈ విధానమునే గీతాశాస్త్రము అభ్యాస వైరాగ్యయోగమనెను. ఈ సాధనంబులను మహర్షిగారు తన యనుభవంబును మాత్రమే మానముగాఁగొని నిశ్చయింపలేదు. ఏల యందురా? ఒకరికి ననుకూలించినవి ఎల్లరకు ననుకూలించునను నియతిలేదు. అవకాశములు పరిస్థితులు సాంఘికాచారాదులు నెల్లరకు నొక్కటిగానే య[illegible]వుగావున వారి వారికిఁ దగినట్లు సాధనంబులుండవలయు[illegible] ఇవన్నియు విశేషములు. కొన్ని మాత్రము సర్వసామాన్యములుగలవు.

అవి యట్లు సర్వసామాన్యంబులగునో కాదోయని నిశ్చ యించుటకై స్వానుభవంబునేగాక యన్యుల యనుభవం బునుగూడఁ బరిశీలించి యెల్లర యనుభవంబులకు నెయ్యవి యేకరీతిగా నుండునో వానినే సర్వసామాన్యంబులుగా భావించి నిర్ణయించిరి. కావున మహర్షి ప్రతిపాదిత భక్తి సాధనంబులు సర్వలోక సామాన్యంబులని యెఱుంగనగును. భక్తియోగంబు ననుష్ఠింపఁగోరువాఁ డెవఁడైనను వాని పరిస్థితులు మున్నగునవి యెట్టివిగానున్నను, మహర్షి ప్రతి పాదితంబులు వానికిఁగూడఁ దగియుండును గావున వాని ననుష్ఠించి తీఱవలయును. అందు మతభేదముగాని, కాల భేదముగాని జాతి వర్ణ జీవికాది భేదంబులుగాని గలుగవు.

ఈ సాధనంబులకు వ్యతిరిక్తంబులైనవానిని నెంత వాఁడు బోధించినను వానిని జాగరూకతతోఁ బరామర్శించి గ్రహింపవలయును; త్వరపడరాదు. త్వరపడితేని బాగునకు మాఱుగా నోగు దాపరింపవచ్చును.

పరాభక్తి యనునది యనుభూతిరూపమేగాని యిట్టి దని చెప్పుటకు సాధ్యమైనదిగాదు. అనుభవంబునందు భేదంబులుండుట సహజము. అపరభక్తి యట్టిదిగాదు. అది సాధనరూపము. సాధనము సరియోకాదో ప్రతివ్యక్తియు విమర్శింపనగును. ఎంత విమర్శించినను మహర్షిగారు చెప్పినట్టి వాని[illegible]దమే యుండనేరదు.

---

## భక్తిసాధనములు

సూ. తస్యాః సాధనాని గాయంత్యాచార్యాః. 34

ఆచార్య పూరుషులు పరాభక్తి సాధనంబులను వేదపురాణాదులందు ఋక్కులతో శ్లోకములతోఁ బాడిరి.

ఆచార్యు లనఁగా స్వానుభవము గలవారు. వారు లోకానుగ్రహార్థము వారి యనుభవంబులను జాటిరి. అట్టివారి వాక్యములను మాత్రమే నమ్మఁదగును గాని, అనుభవములేనట్టియు కేవలము శ్రుతపాండిత్యముగలట్టియు మిథ్యాచార్యుల చిల్కపల్కులను నమ్మవలదని 'ఆచార్య' శబ్దప్రయోజనము. తాము కృతార్థులగుటయేగాక యన్యులనుగూడఁ గృతార్థులుగాఁ జేయుటయందు మహాత్ముల కెంత సంతోషముండుననియు, అట్టి సంతోషపరవశత్వముతో వారి వచనంబులు బహిర్గతంబులగుననియు 'గాయంతి' శబ్దము సూచించును. గురూపదేశంబులు అనన్యప్రేరితంబులుగాఁ గేవల లోకానుగ్రహానందపరవశత్వంబునఁ బల్కినవిగా నుండునని తాత్పర్యము.

ముక్తుని గుణగణంబులు ముముక్షువు సాధింపవలయును. అవి బంధరాహిత్యము, పరమానందాస్వాదము అని రెండువిధములు. ఏవి యేవి బంధకంబులో వానిని త్యజించుటయు, ఏవి యేవి యానందదాయకంబులో వాని ననుష్ఠించుటయు ముముక్షువునకు నిరంతరవ్యాపారము యుండును. మొదటివి వ్యతిరేకమార్గసంబంధంబులును, రెండవవి యన్వ

యమార్గసంబంధంబులు నగును. బీజమును నాటినతోడనే యది నశించి ఆ స్థానమున వృక్షము మొలచును. అట్లే మోక్షసాధన ప్రక్రియయందుఁగూడ నధఃపతనమార్గంబులను వదలినఁగాని యున్నతదశారోహణమార్గంబులందు వర్తింప నలవిగాదు. ప్రకృతస్థితి మాఱినఁగాని వేఱొకస్థితి రాదు గదా!

మోక్షసాధనంబులందుఁ బాత్రలనుబట్టి యొక్కొక్క సారి వ్యతిరేకంబులును, ఒక్కొక్కసారి యన్వయంబులు నుపయోగకరంబులగుచుండునందురు. వ్యతిరేకసాధనంబులు అడ్డంకులను నివారించును. అన్వయసాధనంబు లొక్కొక్క మెట్టు నెక్కించును. కావున సాధకులు రెంటి నభ్యసింప వలయును. అంతియగాని యొకదానిని ప్రధానముచేసి రెండవదాని నుపేక్షింపరాదు. కొందఱు మనోనాశనార్థమై తీవ్రవ్రతంబు లాచరింతురు. ఇది వ్యతిరేకమార్గము. ఆత్మా నందార్థమై కొందఱు ఛాకికానందంబులవెంటఁ దిరుగుదురు. ఇది యన్వయమార్గము. వీరిరువురును 'అతి సర్వత్ర వర్జ యేత్' అను నానుడిని మఱచుచున్నారు. అన్వయ వ్యతిరేకంబులు రెండు నెచ్చట కలసి మెలసి వర్తించునో యచ్చ టనే ఫలోదయంబగును. అట్లు చేయుట దుస్సాధ్య మెన్నఁ డును గాదు.

లోకమం[illegible] పాపంబులను దుఃఖంబులను బరిశీలించి నచో లోకమును త్యజించుట యుక్తమని బుద్ధిమంతులకుఁ దోఁపకమానదు. అట్టి వైరాగ్యము ప్రశంసనీయమేగాని

అంతతో నూఱుకున్న ఫలములేదు. ఆ వైరాగ్యంబునకుఁ దోడుగా ఉత్తమస్థితి జ్ఞానవిశ్వాసంబు లుండవలయును. అట్టి వారియందే ప్రయత్నము స్థిరమును ఫలకారియు నగును.

త్యాగముతోడ భగవత్సేవాపరత్వంబును, లౌకిక విషయంబులందు అసంగబుద్ధితోడఁ దద్రూపానుష్ఠానంబును- ఈ జతలు మోక్షసాధనసామగ్రికిఁ బ్రాణబీజంబులగును. ఈ భావంబునే భాగవతము చతుర్థస్కంధము ఇరువదిరెండవ యధ్యాయములో నిరువదియొకటవ శ్లోకము చెప్పుచున్నది.

శ్లో. శాస్త్రేష్వియానేవ సునిశ్చితో నృణాం
క్షేమస్య సధ్ర్యగ్విమృశేషు హేతుః ।
అసంగ ఆత్మవ్యతిరిక్త ఆత్మని
దృఢారతి ర్బ్రహ్మణి నిర్గుణేచయా ॥



## సూ. తత్తు విషయత్యాగాత్ సంగత్యాగాత్ చ. 35

విషయత్యాగమువలనను సంగత్యాగమువలనను పైని జెప్పిన ప్రేమ సంభవించును. (అహంకారపురస్సరమైన బుద్ధికి దృశ్యప్రపంచమెల్ల సత్యముగా భాసించుచుండును. అది సత్యముగాదనియు మిథ్యయనియుఁ ద్యజించుట విషయత్యాగమగును. దృశ్యపదార్థములందలి మమకారంబును వదలుట సంగత్యాగమగును.)

సాధనము అన్వయక్రమము వ్యతిరేకక్రమము అని ద్వివిధమగుటయు, అందు మొదటిది అనుష్ఠానపూర్వకం

బును, రెండవది త్యాగపూర్వకంబు నగుటయు వివరింపఁ బడెను. ఆ రెంటిలోఁ ద్యాగపూర్వకమైన వ్యతిరేక క్రమమునుగూర్చి యీ సూత్రము చెప్పుచున్నది.

త్యాగమన్నప్పుడు దేనిని ద్యజించుచున్నారు? లోకమును ద్యజించుచున్నారని సామాన్యంబుగాఁ దలంతురు. మనము త్యజించినంతనే లోకము నశించుటలేదు. త్యాగమనఁగా అహంకార మమకారంబుల త్యాగమని గ్రహింపవలయును. అహంకారంబు నెప్పుడు త్యజింతురో దానితోడ మమకారము స్వయముగానే త్యక్తమగుచున్నది.

పైనిఁ జెప్పిన క్రమద్వయములో దేనిని మొట్టమొదట ఆచరింపవలయుననెడి శంక కలుగవచ్చును. ఈ విషయమై నియతిలేదు. ఎవనికి నేది సులభసాధ్యమో దానినే యాచరింపవచ్చును. ఒక్కటిమాత్రము మఱువరాదు. రెంటి నొక్కసారిగా నాచరించినఁగాని జయము గలుగదు. జయార్థము వాని యన్యోన్యసాహాయ్యము ముఖ్యము.

ఆ రెంటిలో అన్వయక్రమమునకన్న వ్యతిరేక క్రమము కొంత సులువుగా నుండును. వ్యతిరేకక్రమమందుఁ దత్పూర్వంబున్నదానిని బోఁగొట్టుకొనుటయగును. అన్వయ క్రమమందుఁ గ్రొత్తదానిని సంపాదించుటగును. క్రొత్త దానిని సంపాదించుటకన్న ఉన్నదానిని బోఁగొట్టుకొనుట సులభకార్యమేగ[illegible]

వ్యతిరేకక్రమమును మున్నుగా నాచరించుటయందు మఱియొక గుణముగూడఁ గలదు. ఏది యందురా?

ఆ క్రమము నాచరించినప్పుడు ఉన్నతస్థితికిఁ బోవు సంపద గలుగకున్నను క్రిందికి జాఱునట్టి దౌర్భాగ్యము తొలఁగును. ఈ విషయమును జక్కఁగా జ్ఞప్తియందుంచుకొనవలయును. బలశాలి యగుటకుఁ బూర్వము నిరోగిగా నుండుట యెంత ముఖ్యమో బ్రహ్మత్వము వచ్చుటకుఁ బూర్వము తన నరత్వంబును గాపాడుకొనుట యంత ముఖ్యము. వ్యతిరేక క్రమంబున నరత్వము పశుత్వంబునకుఁ బోక యథాస్థితి నుండును.

పరాభక్తి యనఁగా నొకవిధమైన ప్రేమయే యగు ననియు, ఆ ప్రేమను లోకమందలి సమస్తప్రీతిదాయకవస్తువుల ననుభవించుట మూలకంబునఁ బెంపొందించి తుదకు బ్రహ్మానందరూప ప్రేమకుఁ గొనిపోరాదా యనియు, అట్లు చేయుట సక్రమాభివృద్ధియగునుగదా యనియు శంకింప వచ్చును. ఈ పద్ధతి నిరాధారమున నిల్లుగట్టుటగును. ఏల యందురా? అనుష్ఠానక్రమమెల్లఁ బ్రేమానుభవార్థమే యనుట నిర్వివాదాంశము. ప్రేమకై యెప్పు డట్టుచాచెదమో యప్పుడు శాశ్వతము నైజము నైన ప్రేమకు నట్టుచాచుట మేలగునా? క్షణికంబును దుఃఖావసాయకంబునైన దాని నభిలషించుట మేలగునా? ఎంతమూర్ఖుఁడైనను శాశ్వతమునే గోరును. కావున శాశ్వతార్థమునకే యత్నించుట యుక్తము. అది లౌకికార్థంబులఁ జేకూరదు; పరాభక్తి రూపంబుననే సిద్ధించును. ఉత్తమము [illegible]యునన్న నధమంబులను ద్యజింపవలయును. అందువలన క్షణికమైన లౌకికానందంబును నిరసించి శాశ్వతమైన బ్రహ్మానందంబును

సాధింపుమనిరి. ఈ ఫలాకాంక్షరహిత త్యాగమునే విషయత్యాగ మందురు.

విషయత్యాగమనఁగా విషయంబుల ననుభవింపక భీష్మించియుండుట యని భావింపవలదు. దేహమున్నంత కాలము విషయంబులకు నింద్రియంబులకు ననుబంధము వలదన్నను దొలఁగదు. అట్లయిన విషయత్యాగం బెట్టి దందురా? విషయంబులొండె, వానివలనఁ గల్గు ప్రీతియొండె మిథ్యారూపమేగాని సత్యముగాదను భావంబుతోఁ బ్రాప్తం బులను మమకారరహితంబుగా ననుభవించుచుండుట విషయ త్యాగమగును.

ఈ సత్యము పారమార్థికమని వ్యావహారికమని ప్రాతి భాసికమని యద్వైతమత ప్రకారము త్రివిధము. పారమార్థిక సత్యమనఁగాఁ ద్రికాలాబాధితమైనదని భావము. పరమాత్మ (భగవంతుఁడు) మాత్రమే పారమార్థికసత్యము. అనుభవ కాలమందు మాత్రమే సత్యముగాఁ దోఁచునది వ్యావహారిక సత్యము. ప్రపంచంబట్టిదగును. ఏలయందురా? గాఢ సుషుప్తియందుఁ బ్రపంచజ్ఞానమే యుండదు. వ్యవహారదశ యందు మాత్రమే యది సత్యంబుగాఁ గాన్పించుచున్నది. దానంజేసి యది వ్యావహారికసత్యమగును. ఇంద్రజాలికుఁడు కల్పించు గజతురగాదులు వాస్తవముగా సత్యములు గాకున్ననుఁ తత్కాలమందు సత్యములవలెనే భాసించు చున్నవి; మఱుక్షణంబున మాయమగుచున్నవి. కావున నది ప్రాతిభాసికసత్యమగును. ఇంద్రియవ్యాపారము తొలఁగి

నట్టి నిద్రావస్థలో మాత్రమే వ్యావహారిక సత్యం బసత్యం బగును. ఇంద్రియవ్యాపారమున్నను ప్రాతిభాసికసత్యం బసత్యంబగుచున్నది. ఈ రెంటికిఁ గల యీ తారతమ్యం బును గ్రహింపవలయును. ప్రపంచంబట్టిదని గ్రహించుటయే విషయత్యాగమగును. 'త్యాగః ప్రపంచరూపస్య చిదాత్మ త్వావలోకనమ్' అని త్యాగస్వరూపంబును అపరోక్షాను భూతిలో నుడివిరి.

సాధన కాలమందుఁ జిత్తమునకు అవస్థాభేదములు గలవు. ఏది యేది మనస్సు నాకర్షించి దానికి నుద్రేకంబును గలిగించుచుండునో దానినెల్లఁ దుచ్ఛమను భావంబుతోఁ బ్రథమావస్థయందుఁ ద్యజించుచుండవలయును. అట్టివి యేవి యని యందురా? కామినీకాంచనంబులని పరమహంసగారు రెండుమాటలలోఁ జెప్పిరి. ప్రథమావస్థయందు వస్తుత్యాగమే యవసరంబగును; వానిమీఁది గాలిగూడ సోఁకకుండవల యును. ప్రథమావస్థయం దంత వైరాగ్యంబును బాటించినఁ గాని వానియందు మమకారము పూర్ణముగా నశించుటయు, ఉత్తరకాలమం దెప్పుడేని వాని దర్శనంబు గల్గినను మనో వైకల్యంబు జనింపకుండుటయు సంభవింపదు.

సాధనచరమావస్థ సన్న్యాసమగును. అప్పుడు వాఁడు సంఘసంబంధమే వదలి యేకాకిగా నుండును. ఈ సన్న్యా సాశ్రమమును స్వీకరించుటకుఁ బూర్వ[illegible] ఆయా యాశ్ర మంబునకుఁ దగిన నిబంధనంబులను శాస్త్ర[illegible]లు విధించెను. వానినే యాశ్రమధర్మంబులందురు. విశేషక్లేశములపాలు

గాకుండ క్రమక్రమంబుగాఁ బుట్టి తుదకు సన్న్యాసాశ్రమంబు నకుఁ జేర్చుటయే యీ ధర్మంబుల పరమోద్దేశ్యము. ఈ ధర్మంబు లొక్కొక్కమెట్టు నెక్కించుచుఁ దుదకుఁ జతుర్థాశ్రమంబునకుఁ గొనిపోవును.

ఈ త్యాగము బుద్ధిపూర్వకంబుగా నుండవలయు. అదియు నైజముగాఁ గాఁదగునే గాని బలాత్కారముగా నుండరాదు. బలాత్కారము వినశించును. ఆఁకలిపెల్లుగా నున్నప్పుడు 'ఈ దినము ఏకాదశి గావున భోజనము చేయరా'దని చెప్పుటవలన నుపవసించుటయు, వైద్యులమాట ప్రకారము రోగి భోజనము చేయకుండుటయు మున్నగునవి స్వేచ్ఛాపూర్వకంబులు గానేరవు. అవియెల్ల బలాత్కారమానుష్ఠానంబులగును.

భోగశక్తియు భోగపదార్థలబ్ధికి నవకాశము —ఇవి రెండు నున్నప్పుడే వానిని వదలుట త్యాగమగును. అవి రెండును లేనివాఁడు త్యజించుట యనునదే సంభవింపదు. ఈ త్యాగంబును విపరీతదశకుఁ గొనిపోరాదు. త్యాగాపదేశంబునఁగొందఱు వారిదేహంబులను బంచాగ్నిమధ్యఁ బుటపాకము వేయుటయు, గొందఱు నిరసనవ్రతం బూనుటయు మున్నగు విపరీతచర్యలు చేయుట గలదు. అది యాత్మకార్శ్యమగునేగాని నిక్కమైన త్యాగముగాదు. ఈ విషయమై శ్రీకృష్ణభగవానుని యుపదేశంబును స్వర్ణాక్షరంబుల హృదయఫలకమందు లిఖించి త్యాగపరులు వల్లింపవలయును.

శ్లో. అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః ।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥
కర్శయంతః శరీరస్థం భూతగ్రామ మచేతసః ।
మాం చైవాంతః శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥
(గీత.)

(పెద్దలు స్వానుభవపూర్వకంబుగాఁ బరీక్షించి లోకోపకారార్థము నిర్ణయించిన విధానము శాస్త్రవిహితమగును. ఆ మార్గము శుభకరము. తద్భిన్నమార్గము దుఃఖజనకము గావున ఆ దారి త్రొక్కరాదు. దురాగ్రహముచేతనొండె, దుర్దైవపరిపాకంబువలన దాపరించిన దుర్జనసాంగత్యాది దోషంబులవలననొండె, శాస్త్రమార్గంబును నిరాకరించి చెడుమార్గముఁద్రొక్కి స్వపరదేహపీడాకరంబులైన తప్తశిలారోహణాది ఘోరరూపకర్మంబులు చేయుదురేని, ఆ పనులెల్ల దాంభికంబులగునేగాని మోక్షార్థము వలసిన అభ్యాసవైరాగ్యరూప యోగసాధనంబులుగావు. అట్లే వృథోపవాసాదులు నగును. వానివలన వారు బాగుపడకపోవుటయే గాక, వారి యంతఃశరీరమందున్న నన్నును, దేహేంద్రియసంఘాతాకారంబుగాఁ బరిణతిఁ గాంచి వారిలోపలనున్న పంచభూతంబులను గృశింపఁజేయువారగుదురు. అట్లుచేయుట వలన వారు ఐహికసర్వభోగంబులకు దూరులగుటయేగాక, ఆముష్మికభోగంబులనుగూడఁ బడయక సర్వపురుషార్థభ్రష్టులగుదురు.)

'ఈ సాధనక్రమమందు ఐహికభోగత్యాగము ముఖ్యమని ప్రతిపాదింపఁబడెను. జనకుఁడును, రామానందరాయి, పుండరీకవిద్యానిధి, విద్యారణ్యుఁడు మున్నగువారు ఐహిక భోగములందు నోలలాడినట్లు గ్రంథములు చెప్పుచున్నవి. వారెల్లరును ముక్తులేయని యీ గ్రంథములే పల్కుచున్నవి. వీరి చరిత్రలనుబట్టి చూడఁగా భోగత్యాగము అవసరము లేదని తేలుచున్న'దని కొందఱు వాదింపవచ్చును. జనకాదుల తత్త్వమెఱుంగక యట్లు వాదింతురే గాని వారి తత్త్వము తెలిసిగాదు. జనకాదులు నిత్యముక్తులు. అట్టి వారికి భోగి భోగ భోగ్య భావంబులే యుండవు. భోగాదులందు భావము ప్రధానము. భోగభావము నశించినప్పుడు వారు బాహ్యదృష్టికి భోగించువారుగాఁ గాన్పించినను వాస్తవముగా భోగించుటయే లేదు. సాధకులెన్నఁడును సిద్ధులవలె వర్తింపరాదు. పరాభక్తి పడసిన తర్వాత సాధనమే యవసరము లేదు. పరాభక్తులను విషయంబు లాకర్షింపఁజాలవు. వారు 'గుణా గుణేషు వర్తంతే' (ఆయా కరణంబు లాయా విషయంబులందు వర్తించుచుండును. అది వానికి నైజము. ఆత్మ యన్ననో నిర్వికారి ; దానికిఁ గర్తృత్వాభిమానంబులు లేవు) అను సూత్రప్రకారము వర్తింతురు. కుమ్మరపురుగు బురదలోనున్నను దానికి బురదయంటనట్లు, పరాభక్తులు లోకములోనున్నను వారికి విషయాకర్షణముండదు. వారు నిర్లిప్తులుగానే యుందురు. అట్టివారే ధీరులగుదురు. అదే భావంబును 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః' అని కుమారసంభవము (1–59).

'న ఖల్వప్యరసజ్ఞస్య కామః క్వ చ న జాయతే। సంస్పర్శాత్ దర్శనాద్వాపి శ్రవణాద్వాపి జాయతే॥ అప్రకాశన మసంస్పర్శన మసందర్శనమేవచ। పురుషస్యేష నియమో మన్యే శ్రేయో న సంశయః॥' వస్తురసజ్ఞానము బొత్తుగా లేనివానికి దానియందుఁ గోరిక పుట్టుటకే యవకాశములేదు. ఈ రసజ్ఞానమన్ననో వస్తువుయొక్క స్పర్శవలననో దర్శన శ్రవణంబులవలననో గలుగును. కావున నట్టి వస్తు స్పర్శ దర్శన శ్రవణంబులకు దూరముండుట శ్రేయము' అని భీష్ములవారు (భార. 12 ప. 180-30-33) చెప్పిరి.

వైరాగ్యసాధనంబునకుఁ బై విధానము సరిగాదనియు, విషయంబులనెల్ల యథామతి కుత్తుకబంటి వెగటుగలుగునందాఁక భోగించినచో, వెగటుకారణంబున బుద్ధి మరల నవ్విషయంబులవంకకే మరలదనియు, ఇది యుత్తమమార్గమనియుఁ గొందఱు వాదింతురు. ఇది విషయలాలసను వదలలేనివారి కువాదమగునే గాని వేఱుగాదు. ఇంతకన్నఁ బ్రమాదజనకమైన యుపదేశము గలుగదు.

శ్లో. న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే॥
యద్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః।
నాలమేకస్య తత్సర్వం ఇతిమత్వా శమం వ్రజేత్॥
(భార.)

(ఉపభోగంబువలనఁ గోరిక లెన్నఁడును శమింపవు. ఆజ్యధార యగ్నినివలె నుపభోగంబులు కోరికలను వృద్ధి

చేయును గాని చల్లార్పవు. సర్వలోక భోగభాగ్యవస్తువు లొక్కమ్మడి సేవించినను ఆశాపరునకుఁ దృప్తిగలుగదు. ఈ సంగతి గ్రహించి నరుఁడు తనకుఁ దానే తృప్తిని బడయవలయును) అని యయాతిగీతయు మనువును బల్కెరి.

'కోరిక యంకురించినంతనే విషాంకురంబువట్లు దానిని మొదలుముట్ట త్రెంచివేయవలయును. అట్లు చేయనిచో నది నరకముపాలొనర్చును' అని యోగవాసిష్ఠము చెప్పుచున్నది. (6-77-81-83) కామము దుష్పూరమని గీత ఘోషించుచున్నది. ఇందఱు పెద్ద లిట్లు చెప్పుటయేగాక మనకుఁగూడ నిది స్వానుభవవేద్యమే యగును. అట్టి కామోపభోగము వైరాగ్యసాధనం బెట్లగునో యూహింపవలయును.

'సంగత్యాగ' మనఁగా వస్తువును దాఁకకుండుటగాదు; దానిమీఁది కోరికను సంపూర్ణముగా వదలుట. అది మానసికకార్యము. ఇదేభావంబును గీత యిట్లు బోధించెను :

శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే॥
యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేంద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే ॥
(గీ. 3-6-7)

(అనఁగా బాహ్యేంద్రియవ్యాపారనిరోధమాత్రముననే సంగత్యాగముగాదు; వస్తువులందలి ప్రీతిని మానసికంబుగాఁ ద్యజించినప్పు డది సంగత్యాగమగును. మానసికంబుగా

వానియందలి ప్రీతిని ద్యజించి బాహ్యేంద్రియంబులచేత వాని ననుభవించినను దోషములేదు. అది సంగత్యాగమగునే గాని సంగము కానేరదు).

అట్లని బాహ్యేంద్రియములచేతఁ ద్యాజ్యంబు నుపభోగింపవచ్చునని తలంపరాదు. ద్వివిధమైన యీ త్యాగములో బాహ్యేంద్రియములతోడి త్యాగమునకన్న మానసికత్యాగము శ్రేష్ఠమని మాత్రము గ్రహింపవలయును.

వాస్తవము విచారించినచో సర్వేంద్రియవ్యాపారములకు మనస్సు రాజగును. రాజాజ్ఞ లేనినాఁడు భృత్యులు వ్యవహరింపనట్లు మనస్సు సమ్మతింపనినాఁడు ఏ యింద్రియంబును వ్యవహరింపదు. మనస్సు వైముఖ్యము దాల్చినప్పుడు స్త్రీసంగమముగూడ సాధ్యముగాదనుట లోకప్రసిద్ధము. కావున ఆంతరత్యాగం బెప్పుడు కల్గునో వెనువెంటనే బాహ్యత్యాగము తప్పక కల్గును. దానికై ప్రత్యేక ప్రయత్నమే యవసరములేదు.

సర్వవిషయార్థత్యాగం బెల్లరకు నెల్లెడల సాధ్యముగాదు. అట్టియెడ నేమిచేయవలయునందురా? నారదమహర్షి మతప్రకారము బాహ్యాభ్యంతర త్యాగంబులు రెండును ముఖ్యకర్తవ్యంబులు.

శ్లో. త్యాగ ఏవ హి సర్వేషాం యుక్తానామపి కర్మణామ్ ।
నిత్యం మిథ్యావినీతానాం క్లేశో దుఃఖావహో మతః ॥
త్యాగః స్నేహస్య యస్త్యాగో విషయాణాం తథైవ చ ॥

అని మహాభారతముగూడఁ జెప్పుచున్నది. అయినను బాహ్యాభ్యంతర త్యాగంబులు రెండును సాధ్యముగానినాఁడు శ్రీ భగవానుని పై వాక్యంబు ననుసరించి మానసికత్యాగం బొనర్చి బాహ్యపదార్థసంగమవిషయంబున బహుజాగరూకతతో మెలంగవలయును.

అధ్యాత్మసాధనక్రమమునకు ద్వివిధత్యాగము మూలమగును. అందు బాహ్యత్యాగంబును సంపూర్ణంబుగా వదలుటకు సాధ్యముకానప్పుడు,

శ్లో. ద్రవ్యత్యాగే తు కర్మాణి భోగత్యాగే వ్రతాని చ।
సుఖత్యాగే తపో యోగం సర్వత్యాగే సమాపనా॥
తస్యమార్గోఽయమద్వైధః సర్వత్యాగస్య దర్శితః।
విప్రహాణాయ దుఃఖస్య దుర్గతి స్త్వన్యథా భవేత్॥

(దానరూపంబుగా ద్రవ్యత్యాగంబు చేయునప్పుడు ఆ ద్రవ్యము శుభకార్యంబులకు వినియోగపడునట్లు చూడవలయును; ఇంద్రియసుఖంబులను త్యజించుటకుగా వ్రతంబులాచరింపనగు; బ్రహ్మచర్యార్థము భోగంబులను వదలవలయును; సర్వపరిత్యాగముతోఁ ద్యాగము సమాపకమగును. పైనఁ జెప్పిన క్రమము సంపూర్ణత్యాగంబునకుఁ గొని పోవును. త్యాగముచేయనివానికి దుఃఖము తప్పదు.) (భార. 12-219-18-19) ఈ ప్రకార మాచరింపనగును. శ్రీ భగవాను డుపదేశించిన కర్మత్యాగంబును ఫలత్యాగంబును నారదమహర్షికి సమ్మతములే యని 11-14-48-62 సూత్ర

ములవలన నూహింపనై యున్నది. త్యాగము వివిధరూపము. అవియెల్ల 43-49 సూత్రములలో వివరింపఁబడియున్నవి. వానినెల్ల ననుష్ఠింపవలయును. మొత్తముమీఁద అహంకారము నశించినఁగాని త్యాగము సంపూర్ణముగాదు.



సూ. అవ్యావృత భజనాత్. 36

వ్యతిరేకక్రమసాధనమందు బాహ్యాభ్యంతర త్యాగము, అనఁగా, అహంకారంబును, అహంకార వ్యవహారంబులను, అహంకారవృద్ధికరంబులైన వస్తువులను త్యజించుట ముఖ్యమని పై సూత్రమందు సామాన్యలక్షణంబుగాఁ జెప్పఁబడెను. ఈ సూత్రము ఇంకొక యడుగు ముందుఁబెట్టుచున్నది. వ్యతిరేకక్రమంబు మొత్తముమీఁదఁ గూడనట్టివానిని నిరాకరించునే గాని యంతకుమించి వ్యవహరింపదు. ముముక్షువునకు నది చాలదు. అతఁడు కూడని వానిని ఒకవంక వదలుచుఁ గూడినవానిని బట్టుదలతో నాచరింపవలయును. అనఁగా అన్వయక్రమంబునుగూడ సాధన చేయవలయును. ఆత్మకు సకలకళ్యాణగుణంబులు స్వతస్సిద్ధంబులు. సాధకుఁడు వానినెల్లఁ దన వ్యవహారంబునఁ జూపవలయును. ఆత్మ యనఁగా అంతర్యామియైన భగవంతుఁడే గాని వేఱుగాదు. భగవంతుఁడు సమస్తకళ్యాణగుణాకారుఁడనుట నిర్వివాదాంశము. భగవంతుని యంశమైన యాత్మయు నట్టిదే యగును. ఆత్మ యట్లు సమస్తకళ్యాణగుణపరిపూర్ణమైనదిగా నున్నను, అహంకారావర

ణంబువలన ఆత్మకుఁ గల పై గుణంబులు వ్యక్తముగాకున్నవి. ఆత్మ యన్ననో యావరణభంగంబొనర్చి స్వరూపంబునఁ బ్రకాశింప నువ్విళ్లూరుచుండును. ఆత్మయొక్క యీ యుత్సాహంబునకు అన్వయక్రమం బెంతయు సహకారి యగును. ఎట్లందురా? ఆవరణభంగంబునకు నేవేవి యుపకరించునో వానినెల్ల అన్వయక్రమము సమకూర్చును. అవి యేవి యందురా? సత్యాసత్యంబులు, ధర్మాధర్మంబులు, శుభాశుభంబులు వీనిని విచారించి సత్యమును, ధర్మంబును, శుభంబును ప్రేమించి, తద్రూపంబున జీవితంబును నడపుట, వానిని బోధించుట మున్నగునవి యీ కోటిలోఁ జేరును. ఈ శక్తి మర్త్యునకు సహజము. అయినను తచ్ఛక్తి నెవఁడు చక్కగాఁ బ్రకాశింపఁజేయునో వాఁడే మర్త్యుఁడగును. తదితరులు భర్తృహరి చెప్పినట్లుగా నరపశువులగుదురు.

ప్రతి వ్యక్తికి సహజములైన వాసనలును సంస్కారంబులు నుండును. అవి శుభాశుభ మిశ్రమంబులుగా నుండును. శుభవాసనలు నైజముగానే మేలొనరించును. అశుభవాసనల సంగతి యేమందురా? వానిని నిస్సత్త్వంబుగాఁ జేయవలయును. ఎట్లందురా? వానికిఁ బ్రతికూల వాసనలను బోధించినచో నవి స్వయముగానే జీవచ్ఛవంబులగును. ఇది యేటికి నెదురీఁదుటవంటిదందురా? ఆ మాట సత్యము. వేఱొక మార్గము లేదు.

అట్లు ఈఁదుటకు మనోబలం బెంతో వలయును. ఆ బలము సత్త్వగుణాభివృద్ధివలన సిద్ధించును. ఈ సత్త్వగుణాభివృద్ధినే దైవీసంపదయందురు. ఆ దైవీసంపదయన్ననో

యోగత్యాగంబులవలనఁ దక్క మఱియొక్కదానివలనఁ గలుగదు. ఆ యోగత్యాగముల విధానంబును సమగ్రంబుగా శ్రీ భగవానుఁడు గీతలో 14-16 అధ్యాయములలో వివరించెను. ఆ ప్రకారం బనుష్ఠించినయెడల దైవీసంపదయుఁ దన్మూలకంబుగా మనోబలంబును సిద్ధించును.

సాధనమును నిరంతరము నొకపద్ధతిప్రకారము అవ్యగ్రముగాఁ జేయవలయును. ఆ భావము సూచించుటకుఁగా 'అవ్యాహత' అను పదంబును సూత్రమందు మహర్షిగారు ప్రయోగించిరి.

శ్లో. స్వాధ్యాయాద్యోగమాసీత
యోగాత్స్వాధ్యాయ మావసేత్ ।
స్వాధ్యాయ యోగసంపత్త్యా
పరమాత్మా ప్రకాశతే॥

(స్వాధ్యాయమనఁగాఁ బవిత్రగ్రంథములను జదువుట; యోగమనఁగా సమాధాన ధ్యానములు. ఈ రెంటిని ఒకటి మార్చి యొకటి నిరంతరము చేయుచుండవలయును. అట్లు చేయుచు రాఁగాఁ బరమాత్మ దర్శనంబగును) అని విష్ణు పురాణము 11-6-2.

శ్లో. నిద్రాయాః లోకవార్తాయాః శబ్దాదే రర్థవిస్మృతేః ।
క్వచిన్నావసరం దత్వా చింతయాత్మన మాత్మని ॥

(తూఁగుట, లోకవార్తలతోఁ బ్రొద్దుపుచ్చుట, భేరీ భాంకారాది బాహ్యధ్వనులవలన ఏకాగ్రమతికి భంగము

గలిగించుట, మఱపు—వీనికి గోరంతగూడ నవకాశమీయక ఆత్మచింతనంబొనర్పుము) అని అధ్యాత్మోపనిషత్తును;

సూ. స తు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః ॥

(సాధనమునకు దార్ఢ్యము గలుగవలయునన్నచో దానిని దీర్ఘకాల మభ్యసింపవలయును. పది దినములుచేసి విరమించుటవలన ఫలములేదు; అంతియగాదు. సాధనమునకు అప్పుడప్పుడు నడుమ నడుమ విరతిగలిగించి చేసినచోఁ బ్రయోజనములేదు. విరామములేకుండ ననఁగాఁ బ్రతిదినమును చేయవలయును. మఱియు సాధనమును మనఃపూర్వకంబుగా మహాప్రీతితోఁ జేయవలయును; కూలికిఁగానేడ్చినట్లు చేయుట తగదు) అని పతంజలి యోగసూత్రమును,(1-44);

సూ. ఆవృత్తిః అసకృదుపదేశాత్ ॥

(సాధనమును సారెసారెకుఁ జేయుచుండవలయును. ఆ విధముగా శాస్త్రంబులు బోధించుచున్నవి) అని బ్రహ్మసూత్రములును (1-4-1) జెప్పుచున్నవి. శ్రీకృష్ణభగవానుఁడుగూడ నదేయర్థంబును

శ్లో. అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥
(గీ. 8-14)

(నాయందేమది మదినిల్పి మఱియొకదాని నెఱుంగక యావజ్జీవము నిరంతరము నన్ను స్మరించువానికిఁ బరమేశ్వర దర్శనము సులభముగానగు) నని తెలిపెను.

సాధనకాలమందు నడుమ నడుమ భంగపాట్లు కలిగె నేని, పూర్వసాధనఫలంబు పోవుటయేగాక, తీఱని వైకల్యం బులు గలుగుటగూడఁ గలదు. మఱియుఁ బూర్వసాధన బలంబునఁ బాఱి దాఁగియున్న వైరికిఁ దలుపు తెఱచుటయు నగును. అనఁగా సాధనముచేత ఏప్రతికూలవాసనల అడఁచి పెట్టియుండురో యవి రెట్టించిన బలంబుతోఁ బైకొని సాధ కునిఁ దలక్రిందుచేయును. కావున సాధనము సమాప్తమగు వఱకు భంగము కారాదు.

విశ్వామిత్రునకు నేఁడుసార్లు యోగభంగముకాలేదా? అనియు, అతఁ డంతతోఁ జెడిపోయెనా? అనియు శంకింప వచ్చును, ఆ ఋషీశ్వరుని పూనిక యెట్టిదో ముందుగా గ్రహింపవలయును. ఒక్కొక్కసారి పతనమగుకొలఁది వాని పూనిక రెట్టించుచుండును. ఆయన యెన్నిభంగంబులు వచ్చినను సిద్ధిపర్యంతము వాని పట్టు వదలలేదు. ఎల్లరు నంతటివారగుదురా? ధీరులకు నొక్కొక్కపతనము జయ శ్రీని జేరుటకు నొక్కొక్కగట్టి మెట్టగును. సామాన్యుల విషయం బట్లుగాదు. రవంత భంగముగల్గినను వారు వారి యుద్యమంబు నే విరమింతురు.

శా. ఆరంభింపరు నీచ మానవులు వి
ఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువి
ఘ్నాయత్తులై మధ్యము
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్
ధృత్యున్నతోత్సాహులై

ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్ ॥

అను భర్తృహరి వచనంబును దలంపవచ్చును. ఒక్కొక్క యడ్డంకి వచ్చుకొలఁది ధీరుల యుత్సాహ మతిశయించుచుండును.

'ధీరుఁడు వాని యుద్యమంబును మనఃపూర్వకంబుగాఁ ద్యజింపకుండుఁగాక. త్యజింపవలసిన పరిస్థితు లేర్పడిననాఁ డతఁడేమి సేయు నందురా? పరిస్థితులు చక్కనైనంతనే యతఁడు వాని యుద్యమంబును సాగించును. ఏదో రోగము వచ్చినప్పుడు సాధనమును విరమింపక తప్పదు. సాధకుఁడు పట్టుదలగలవాఁడేని ఆరోగ్యస్థితి వచ్చినంతనే మరల సాధన క్రమంబు నారంభించును. అట్టివారియెడ కారణాంతర సంప్రాప్త విరామము సాధనాభ్యాసంబునకు భంగము కలిగింపనేర్చునేగాని, వాని యంతిర్భావంబును ద్రిప్పఁ జాలదు. అనఁగా నట్టివారి విషయమున అంతస్సాధనము జరుగుచునేయుండును. ఇట్టి శంకలను నివారించుటకుగా శ్రీభగవానుఁడు.

శ్లో. 'నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్ ॥
(భ.గీ. 2-40)

శ్లో. 'పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కళ్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి॥
(భ.గీ. 6-40)

'అర్జునా! నిష్కామకర్మరూపమైన యీ ధర్మంబు నొకసారి ప్రారంభించినతర్వాత దానికి నాశనముగాని భంగముగాని గలుగనేరదు. గోరంత శుభంబొనర్చినను వానికి దుర్గతిరాదు' అని ఘంటాపథముగా నుడివెను.

శ్లో. ధర్మకార్యే యతన్ శక్త్యానోచేత్ ప్రాప్నోతిమానవః ।
ప్రాప్తో భవతి తత్పుణ్యం అత్రమే నాస్తి సంశయః ॥

అని మహాభారతము (ధర్మకార్యంబును శక్తికొలఁది చేసినను ప్రాప్యము జీవితకాలములోఁ బ్రాపింపకున్నను తత్పుణ్యము మాత్రము వృధపోదు.)

'యతతామపి సిద్ధానాం' అను గీతావాక్యంబునకు శ్రీయాచార్యస్వామిగారు వారి భాష్యములో 'ఉత్తమ గతికై శ్రద్ధాభక్తులతో నెప్పుడు పరిశ్రమించునో వాఁడు సిద్ధుఁడే యని భావింపవలయు' ననిరి. దీని తాత్పర్య మేమి? కార్యసిద్ధికిఁ బట్టుదలయే ప్రధానము. అట్టి పట్టుదల లోపలనున్నంతకాలము కార్యసాధన క్రమము కొనసాగు చున్నట్లేయగును. సాధనక్రమంబు ననివార్య కారణంబుల వలన నుజ్జగించుటగలదు. అట్టిది భంగముగానేరదు. భంగమేయైనను దానివలనఁ బ్రమాదము గలుగదు. బుద్ధి దౌర్బల్యంబుననో ప్రలోభకారణంబుననో సాధన క్రమంబును విడుచుట భంగమగును. అట్లుచేసినవారెంతతో మిన్న కుండరు. కూడనికార్యంబులకుఁ దొడంగుదురు. అట్టి సేఁతలు ప్రమాదకరంబులగును.

సాధనము నిరంతరముగా నుండవలయునని సూత్రము నియమించుచున్నది. వ్యవహారంబునకుఁ గాలపరిమితి యుండవలయుననియు, నిరంతరవ్యవహారము సాధ్యమైనదియు స్వాభావికమైనదియుఁ గానేరదనియు, బలవంతముగాఁ జేయఁబూనినను విసువు నలసట గల్గుననియు శంకింపవచ్చును. ఈ శంక నిరాధారముగాదు. ఏ వ్యవహారంబునకైనను విరామం బావశ్యకము. అది యెవరును గాదనరు. అంతియ గాదు. విరామము పునరుద్యోగంబునకు బలమిచ్చును. రెట్టించిన బలంబుతో నొనర్చిన సాధనము శీఘ్రసిద్ధిదాయకమగును.

అయినను, విరామంబనఁగా నేమి? ఏ పనియుఁ జేయక మిన్నకుండుట విరామంబని సామాన్యంబుగా భావింతురు. అది నిక్కమైన విరామముగాదు. విధానమందు మార్పుగావించిన నది విరామమగును; గమనంబును జాలింపనవసరము లేదు. ఎట్లందురా? సాధ్యమునకుఁ బెక్కుమార్గంబులుండును. ఒక్కమార్గమునే నిరంతరముఁ బాటింపక, ఆ మార్గగమనమందు నాయాసము జనించినప్పుడు వేఱొకమార్గమున గమనంబును సాగించినచో నాయాసముండదు. ఉదాహరణము వినుము. ముముక్షువునకుఁ దపస్స్వాధ్యాయంబులు రెండును సాధకంబులగును. ప్రతిదినము కొంతకాలము తపస్సును గొంతకాలము స్వాధ్యాయమును జేసినచో వానికి నాయాసము గలుగదు; గమనము సాగుచునే యుండును.

అలసట సంగతి యేమందురా? తాఁ జేయఁదలంచిన పనియందు నుత్సాహ వినోదంబులున్నచో నలసటయే గలుగదు. అవి యెప్పుడుండవో యప్పుడే వానికి క్షణకాల వ్యవహారముగూడ దీర్ఘకాలికముగాఁ దోఁచుటయు, అలసట విసువులు జనించుటయు నగును. ఏదేనొక పని చేయునప్పటి కన్న నాటాడునప్పుడు సర్వావయంబులకు శ్రమము మిక్కుటముగాఁ గల్గును. అయినను ఒక్కగంటసేపు పనిచేసినంతనే యలసట పైకొనును. నాల్గుగంటలకాల మాడినను అలసట గలుగదు. కారణమేమి? ఆటయం దుత్సాహ వినోదంబు లుండుటే కారణము. ఈ యుత్సాహ వినోదంబులనే తాత్త్విక పరిభాషయందు శ్రద్ధాభక్తులందురు. అవి సాధకునకు ముఖ్యంబులని పతంజలియు నితరాచార్యులు నూఁది పల్కుచున్నారు.

శ్రద్ధాభక్తులు తలుగకుండుటకు నుపాయమేమందురా? విధానమందలి మార్పే యుపాయము. మార్పు నిలుపుట గాదు. ఏలయందురా? విధానముమాత్రము మారినదిగాని భావము మారలేదు. భావముగూడ మారెనేని అది కార్య విరతియే యగును. పూజాధ్యానములు, జపసంకీర్తనములు, భక్తజన సేవాస్వాధ్యాయములు, దానస్వధర్మాచరణంబులు, తీర్థయాత్రా క్షేత్రదర్శనంబులు వీనినన్నిటిని సాధకుఁ డొకటి మార్చి యొకటి చేయనగును. వీనిలో నేది చేసినను వాని యంతర్భావంబును దత్సంబంధ శ్రద్ధాభక్తులు నన్నిట నను స్యూతములుగానే యుండును. సాధనం బీవిధముగా నుండ నగుననుటకు (శ్రీ) పరమహంసగారి జీవితమే నిదర్శనము.

పల్లెటూరిలో స్త్రీలు నెత్తిపై నీటికడవ నుంచికొని మాటా డుచు నవ్వుచు వచ్చుచుందురు. అట్లు వచ్చుచున్నను వారి ధ్యానము నీటికడవయందే యుండును. ఇట్టి దృష్టాంతంబుల నెన్నో పరమహంసగారు నుడివిరి.

పరాభక్తికి, అనావృతిభజనము సాధనమని సూత్ర మందుఁ జెప్పఁబడెను. భజనమనఁగా నేమి? భగవత్స్నేహ పూర్వకంబుగా నేమిచేసినను అది భజనమగును. భక్తి భజనంబులు రెండు నొండొంటిని విడిచియుండవు. భక్తి కారణంబును భజనము కార్యమునని చెప్పినను జెప్పవచ్చును. భక్తి యాంతరంగికము; భజనము బాహ్యవ్యవహారము.

ప్రార్థించుట, పూజించుట, జపించుట, పాడుట, సేవించుట, ధ్యానించుట, చదువుట, సుశ్రూషించుట—— ఇవన్నియు భజనమం దంతర్భూతములగును. ఈ భజనము 'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్। అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్॥' అని నవవిధము లుగా నుండునని ప్రహ్లాదుఁడు వచించెను. (భాగ. సప్తమ స్కంధము 5-23-24.)



## సూ. లోకేఽపి భగవద్గుణ శ్రవణకీర్తనాత్ ॥ 37

సిద్ధిపర్యంతము నిరంతరము సాధనముచేయవలయునని పై సూత్ర మందుఁ జెప్పఁబడెను. శరీరమున్నంత కాలము దేహధర్మంబులు క్షుత్పిపా సాదులు మనకుఁగూడఁ దప్పవు. వానికొఱకు ప్రతిదినము కొంత కాల వ్యయము తప్పదు. మఱియు ఎల్లరును బుట్టుకలోడనే సర్వపరిత్యాగము

చేసి సన్న్యాసాశ్రమము స్వీకరించి భగవత్సేవైక తత్పరులు గాఁజాలరు. లోకులు ప్రాయికంబుగా గృహమేధులై గృహధర్మంబులందు మునిఁగి యుందురు; అయినను వారికిని మోక్షేచ్ఛ గలదు. మోక్షమునకు నిరంతర భగవత్సేవారూపసాధనము విధివిధానమైనచో వారి గతి యేమి? అని శంకింపవచ్చును.

అట్లు శంకింప నవసరము లేదు. లోకములో నున్నంత కాలము లోకధర్మంబులను బాటింపక తీఱదు. ముక్తులు సయితము లోకకళ్యాణార్థము పాటుపడవలయునని 'సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత। కుర్యాద్విద్వాం స్తథాఽసక్తః చికీర్షుర్లోకసంగ్రహమ్' (3-25) శ్రీభగవానుఁడు సయితము చెప్పియుండఁగా సామాన్యులు వేఱ చెప్ప నేల? కావున లోకులకు సాధనక్రమము నిరంతరము అవిచ్ఛిన్నముగా జరుగనేరదనుట నిరాధార సంశయముగాదు.

అయిన నిందొక విశేషము గలదు. సాధనము కాయికము మానసికము అని రెండు విధములు. దేహము లౌకిక ధర్మంబులందుఁ దగిలియున్నను, సాధనంబును మానసికంబుగా జరుపవచ్చును. భగవద్గుణ శ్రవణ కీర్తనాదులు మానసికకర్మంబులు. అవి కొనసాగించినచో సాధనమును సాగించినట్లే యగును. సాధన కలాపమెల్ల మనశ్శుద్ధికొఱకేగాని వేఱుగాదు. మనస్సును శ్రద్ధాభక్తి పురస్సరంబుగా భగవదధీనంబొనర్పనోర్తురేని సాధనసిద్ధి గొనినట్లే భావింపవలయును. వేయేల! సాధనము చేయుదురుగాక; మానుదురుగాక. మనస్సు భగవదధీనమైనఁజాలు. 'తస్మాత్ కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్' ఏ యుపాయముచేత

నైనను మనస్సును భగవంతునెడ నిలుపుమన్న భాగవత వచనంబునకు నిదే తాత్పర్యము. భగవంతుఁడు నిరంతరము స్మరణలో నుండవలయును. ఆభావ మెన్నఁడును విస్మృతి చెందఁగూడదు. 'స్మర్తవ్యః సతతం విష్ణుః విస్మర్తవ్యో నజాతుచిత్। సర్వే విధినిషేధాః స్యురేతయోరేవకింకరాః' (భగవంతుని నిరంతరము స్మరింపవలయును; ఎన్నఁడుగాని మఱువరాదు; ఈ భావము కుదురుటకే విధినిషేధంబులెల్ల నున్నవి.) అను వచనమే పరమ సూత్రము.

శ్లో. 'ఏతావాన్ యోగ ఆదిష్టో మచ్ఛిష్యైః సనకాదిభిః।
సర్వతో మన ఆకృష్య మయ్యద్ధావేశ్యతే యథా॥
(భాగ. 11-13-4)

మనస్సును పరవిషయంబులనుండి మరలించి భగవంతునందు నిలుపుటయే యోగఫలము. మనస్సు విషయపరమైనచో దానిని లోకవాసనలు క్రిందికి లాగును; అది భగవన్ముఖమైనచో దైవీసంపత్తి గలుగును.

మనస్సు శూన్యస్థితిలో నెప్పుడుగాని యుండఁజాలదు. అది దేనియందో యొకదానియందు వ్రాలి యుండవలయును. అది దానికి నైజము. ['విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే। మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే॥' (భాగ. 11-14-27). మనస్సు విషయంబుల ధ్యానించునేని వానియందే యది తగులును. నన్ను ధ్యానించునేని యది నాయందే లీనమగును.] మనస్సు విషయపరమైనప్పుడేమి దుఃఖంబులు గలుగునందురా?

శ్లో. 'ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే,
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః.
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥
(భ. గీ. 2-62-63.)

(మనస్సు విషయంబులను దలంచునేని దానికి వాని యందు తగులాటము జనించును. ఆ తగులాటమువలన నవ్విషయానుభవ కాంక్ష యుద్భవించును. అట్టి కోరికకు నేదైన నడ్డుపడెనేని దాని నడంపవలయునని మంట యావేశించును. ఆవేశము పైకొన్నంతనే హితాహిత వివేకము తొలఁగును. వివేకంబెప్పుడు తొలఁగునో యప్పుడే శాస్త్రాచార్యోపదిష్టార్థానుసంధానరూపమైన స్మృతి యుం డదు. ఆ స్మృతిభ్రంశఫలంబుగా బుద్ధికి విపరీతభావనలు తోఁచును. తత్ఫలంబుగా నది దాని సహజ వ్యవహారంబును మాని చెడుగును మంచిగా మంచిని చెడుగుగా నిశ్చయిం చును. ఎప్పుడు బుద్ధి యట్లగునో యప్పుడే యావ్యక్తి సర్వ పురుషార్థములకుఁ దగనివాఁడగును. అట్టివాఁడు చచ్చిన వానితో సమానమగును.) అని శ్రీభగవానుఁడు విషయ పరమతికిఁగల్గు పర్యవసానంబును దెలిపి, మహాత్ములైనవారు దైవీప్రకృతి నాశ్రయించి చరాచర సర్వలోకంబునకు మూలంబగు భగవంతుని తత్త్వము గ్రహించి యాభగవంతు నకు నేకాంతభక్తి చేయుదురని చెప్పెను. ఆ భక్తివిధానం బెట్టిదందురా? భజనీయమైన దాని తత్త్వంబును మొదట

గ్రహింపవలయును. దానినెల్లరు నెఱుంగరు. ఎవఁడు నిరంతరము బ్రహ్మనిష్ఠుఁడో యతఁడుమాత్రమే దానిని దెలుపనేర్చును. అట్టి వానిని సమీపించి మొట్టమొదట తత్త్వమసి అను వేదాంతవాక్యవిచారంబు చేయవలయును. అవకాశము గల్గినప్పుడెల్లఁ జపముచేయుటయో వేదాంతశాస్త్రంబులఁ జదువుటయో చేయవలయును. అది బ్రహ్మస్వరూపంబును గ్రహించుటయే యగును. గురుసన్నిధియందేమి, అన్యత్రయేమి భగవత్స్వరూపావధారణార్థము తత్పరుఁడై యుండవలయును. అనఁగా మననశీలుఁడై యుండవలయును. అట్లు దృఢవ్రతుఁడై శమదమాది సాధనసంపన్నుఁడై సకలకల్యాణగుణ నిధానుఁడైన భగవంతునిఁ ద్రికరణశుద్ధికిఁ బరమప్రేమతో నిదిధ్యాసనంబు చేయవలయును.

శ్లో. 'మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్॥
(భ.గీ. 9-13)

శ్లో. సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యానిత్యయుక్తా ఉపాసతే॥
(భ.గీ. 9-14)

మఱియు ఏదియేది చేయుదురో, ఏదియేది భుజింతురో, ఏదేది హోమముచేయుదురో, ఏదేది దానమొనర్తురో, అజ్ఞాత ప్రామాదిక పాపనివృత్త్యర్థమై యేదేదియాచరింతురో, యాయా నిత్యనైమిత్తిక సర్వకర్మములను లౌకికంబులొండె వైదికంబులొండె నాకు సమర్పింపవలయును.

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్॥
(భ.గీ. 9-27)

మనస్సు దేనిపై ప్రాలునో దాని వాసనావర్ణంబులు మనస్సునకు నంటుకొనును. అది దానినైజగుణము. మనస్సు నిరంతరము శుభవాసనా వర్ణాత్మకమై యుండుటకుఁగా మంచియుపాయంబును వెదకి యాచరింపవలయును. 'కుర్యాత్సర్వాణి కర్మాణి మదర్థం శనకైస్మరన్। మయ్యర్పిత మనశ్చిత్తో మద్ధర్మాత్మమనోరతిః॥ భాగ. ౧౧-29-9.) భగవంతునియందు మనస్సునునిలిపి భగవద్ధర్మంబు లాచరించుట యందు నభిరతిఁగలిగి భగవంతుని స్మరించుచు సమస్త కర్మములను భగవదర్పితంబుగాఁ జేయవలయును. అట్లు చేయుట వలనఁ బ్రారబ్ధ మలిన వాసనలు నిస్సత్వములై పోవుటయే గాక, శుభవాసనలు యథాగతిఁ బరిమళించి చిత్తమును శుద్ధపఱచి మనోగతి నిరాతంకముగా భగవదధీనంబగుటకు నెంతయుఁ దోడ్పడును. ఇదియే యుత్తమోత్తమమైన యుపాయము. ఈ కారణంబుచేతనే పరమభక్తులు

శ్లో. 'ఏవమేకాంతినాం ప్రాయః కీర్తనస్మరణ ప్రభోః,
కుర్వతాం పరమప్రీత్యా కృత్యమన్య న్న రోచతే॥

అని హరిభక్తివిలాసము చెప్పినట్లుగా, భగవత్కీర్తన స్మరణంబులుదక్క మఱొండు కోరరు, తలంపరు.

'మననస్మరణాదులు మానసిక కార్యములు. మనోవ్యవహారంబునకు నేదే నొక యాధారంబుండవలయును.

నిరాధారమందు మనస్సు అమనస్కమగునే గాని వ్యవహరింపనేరదు. కావున మనస్సు మననస్మరణాదులందు వర్తించుటకు దానికి నాధారమేమి?' అని శంకింపనగును. పదమో పదసముచ్చయమో యాధారముగా గ్రహించి మనస్సు స్మరణాదివ్యాపారంబును జరిగించుచున్నది. పోయేల! మననం బనఁగా అంతర్వాణియే యగును.

పదమన్నంతనే పదభావంబులు దానిఁ నంటియే యుండును. నిరంతరధ్యానమందీ పదభావంబులుగూడ నిరంతరములుగా నుండును. ఈ పదభావంబుల యుచ్చారణమే భాష యనఁబడును. శ్రవణమనఁగా నట్టిభాషను వినుటయు, కీర్తనంబనఁగా నట్టిభాషను బాడుటయు నగును. మాటాడుటయు, వినుటయు—ఇవి రెండు నొండొంటి నెడఁబాయకుండు. కావున వక్త వానిభాషకు శ్రోతయు, శ్రోత వానిభాషకు వక్తయు, అనఁగా రెండు కార్యంబుల నొక్కఁడే చేయుచున్నవాఁడగును.

ఈ శ్రవణకీర్తనంబుల నెవనికి వాఁడే చేసికొనవచ్చును. లేదా సమాజమందు జరుపవచ్చును. అట్లు జరుపునప్పుడు 'తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్। ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః॥' అని పంచదశియు, 'మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్। కథయంతశ్చమాం నిత్యం తుష్యంతి చ రమంతి చ॥' అని గీతయుఁ జెప్పినట్లుగా, సమాజమెల్ల నేకమనంబుతో నుండవలయును.

మనస్సును భగవంతునివంకకు మరలించి దాని నందు నిల్పుటకు శ్రవణాదులు సహకారులని చెప్పఁబడెను. భగవత్సంబంధ గ్రంథంబులను జదువుటయు, వినుటయు, భగవద్విచారము చేయుటయు, భగవత్కల్యాణగుణంబులఁగూర్చి వ్రాయుటయు—ఇవియెల్ల శ్రవణమం దంతర్భూతములు. వాల్మీకి వ్యాసాది మహర్షి ప్రోక్తంబులెల్ల శ్రవణమందే చేరును.

భగవత్కల్యాణగుణంబులనుగూర్చి చింతించుట, పలుకుట మున్నగునవి సంకీర్తనమందుఁ జేరును. భగవన్నామావళి పారాయణంబునుఁ బ్రణవ పంచాక్షర్యాది మంత్రజపంబును సంకీర్తనమందే చేరును.

ధ్యానసిద్ధికి మంత్రజపంబు మహోత్తమంబనిరి. 'మననాత్ త్రాణనాచ్చైవ మద్రూపస్యావబోధనాత్। మంత్రమిత్యుచ్యతే బ్రహ్మన్ మదధిష్ఠానతోఽపివా॥' అని యాజ్ఞవల్క్యోపనిషత్తు చెప్పినట్లుగా మంత్రమందు మనన త్రాణ శక్తులు రెండును గలవు. మననశక్తివలన భగవత్తత్త్వము బోధపడును; త్రాణశక్తివలన భగవత్సాక్షాత్కారము లభించును. అందువలననే మంత్రము భగవన్నిలయంబనఁ బడును.

ఈ మంత్రము ఏకాక్షరరూపంబుగానో, ఏకపద రూపంబుగానో, వాక్యరూపంబుగానో, శ్లోకరూపంబుగానో, శ్లోకసముదాయరూపంబుగానో యుండవచ్చును. కడపటి

డానిని మహామంత్రమందురు. ఈ మంత్రంబులను మాటి మాటికి నుచ్చరించుట జపమగును.

ఈ జపము నేటిదిగాదు. ఇది సృష్టినుండి యున్నది. అందువలననే 'స్వామీ! యజ్ఞయాగాదులుగాని మఱియేవి యైననుగాని మంత్రముతో సాటిరావు. ఆ మంత్రపూర్వకంబుగా ని న్నారాధించి కృతార్థుల మగుచున్నా' మని ఋగ్వేదాది వేదంబులు నాడే పల్కెను. ఆత్మశుద్ధియు మోక్షంబును గోరువారు నామజపంబును సర్వదా చేయుచుండవలయునని 'వచసా తజ్జపేన్నిత్యం వపుషా తత్సమభ్యసేత్ । మనసా తజ్జపేన్నిత్యం తత్పరం జ్యోతిరోమితి । శుచిర్వాప్యశుచిర్వాపి యో జపేత్ ప్రణవం సదా । న స లిప్యతి పాపేన పద్మపత్రమివాంభసా ॥' అని యోగచూడామణ్యుపనిషత్తును, 'జపమావర్తయన్ నిత్యం జపన్ వై బ్రహ్మచారికమ్ । తదర్థబుద్ధ్యా సంయాతి మనసా జాపకః పరమ్ ॥' అని మహాభారతంబును వచించుచున్నవి. చరితార్థుల యీ వచనంబులఁబట్టి జపప్రభావంబు నూహింపనగును.

ఈ జపవిధానమందు మఱియొక సౌలభ్యము గలదు. మోక్షార్థము శాస్త్రంబు లెన్నో సాధనంబులను వచించెను. ఈ జపసాధనంబుతక్కఁ దక్కినవన్నియు బహునియమనిబద్ధములై యీ కాలంబున సర్వజనసాధ్యములుగానివిగా నున్నవి. ఈ జపసాధనంబునకు నెట్టి నియమంబులును లేవు. దానంజేసి యిది యెట్టివానికైన నందుబాటులో నున్నది. 'విహితమఖిలకర్మ బ్రాహ్మణానాం మునీంద్రై ర్విధినియమ

సమేతం శక్యతే నైవ కర్తుమ్। తదఖిలమపి హిత్వా యో మహాదేవశబ్దం పఠతి ఫలమశేషం ప్రాప్నుయాత్సోఽనవద్యమ్॥' అని బ్రహ్మవైవర్తపురాణము. (బ్రాహ్మణాదులకు మునీంద్రులు నియమించిన సమస్తకర్మములు నియమపూర్వకంబులై యెల్లరకు శక్యములుకానివై యున్నవి. అట్టి కర్మములనెల్ల వదలి మహాదేవశబ్దము నొక్కదానిని బఠించుచున్నచో నిరవద్యఫలంబు చేకూరును.)

నామజపంబునకు నంతటి మాహాత్మ్యంబుండుట బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయమతంబులుగూడ నంగీకరించుచున్నవి. నామజపంబు జపయజ్ఞమగునని యజ్ఞంబులలో దాని నొకటిగాఁ బెద్దలెల్లరు గ్రహించిరి.

శ్లో. 'యే పాకయజ్ఞాశ్చత్వారో విధియజ్ఞసమన్వితాః।
సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్॥'

అని వసిష్ఠమహర్షియు, 'విధియజ్ఞాత్ జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః। ఉపాంశు స్స్యాత్ శతగుణః సాహస్రో మానసః స్మృతః॥' అని మనువును బల్కిరి. ఋష్యాదులు పెక్కరిట్లే జపయజ్ఞంబును శ్లాఘించిరి.

జపయజ్ఞమందు మఱియొక విశిష్టగుణంబు గలదు. 'జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే। అహింసయా చ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే॥' అను భారతోక్తి ప్రకారము ఇతరయజ్ఞంబులందేదో యొకవిధమైన భూతహింస విధివిధానంబగుచున్నది. జపయజ్ఞమందు హింస అను క్రియకే యవకాశములేదు. పై వాక్యమునకు

'హింసాది పురుషాంతర ద్రవ్యాంతర దేశకాలాది నియమానపేక్షత్వమాధిక్యే కారణమ్' అని శ్రీ శంకర భగవత్పాదులవారు వ్యాఖ్య రచించిరి. (ఇతరయజ్ఞంబులకువలె జపయజ్ఞంబునకు హింసాదివిధులును పురుషాంతర ద్రవ్యాంతర సాహాయ్యంబును దేశకాలాది నియమంబులును గలుగవు. ఆ కారణంబుననే జపయజ్ఞము ఇతరయజ్ఞంబులకన్న మేలగును.)

జపయజ్ఞమం దింకొక విశిష్టగుణము గలదు. జపయజ్ఞంబునకు వయోనియమముగాని, స్త్రీపురుష వివక్షత గాని, జాత్యాశ్రమనియమముగాని, దేశకాలాదినియమము గానిలేవు. దానం జేసి జపయజ్ఞంబునెల్ల వారు నెట్టికాలములో నైనను, ఎట్టిచోటనైనను జేయవచ్చును. ఇంతియగాదు. 'హరిసంకీర్తనస్యాస్య నోపదేశః కథంచన। కింతు బ్రవీమి సౌమ్యత్వం కథయస్వాశుచిర్నహి॥' అని బ్రహ్మాండపురాణంబు చెప్పినట్లుగా, జపయజ్ఞంబునకు గురూపదేశంబుగూడ నవసరములేదు. అశుచిదోషంబుగూడ దానికి నంటదు. జపయజ్ఞం బెంతటిదో యూహింపనగును.

శ్లో. 'సముద్రతీరేష్వథవాద్రిశృంగే
　　సముద్రగానాం సరితాం చ తీరే।
　జపే ద్వివిక్తే నిజ ఏవ వా గృహే
　　విష్ణోర్గృహే వా పురుషో మనస్వీ॥'

సముద్రతీరమందుఁగాని, పర్వతాగ్రమందుఁగాని, నదీసాగరసంగమప్రదేశమందుఁగాని, వివిక్తదేశమందుఁగాని,

స్వగృహమందుగాని, విష్ణుమందిరమందుగాని ఏకాగ్రబుద్ధితో జపంబు చేయవలయునని ప్రపంచసార గ్రంథము కొన్ని నియమంబులను జెప్పుచున్నది. 'యత్రైకాగ్రతా తత్రా విశేషాత్' అని బ్రహ్మసూత్రములు చెప్పునట్లుగా, ఎప్పుడెచ్చోట బుద్ధి యేకాగ్రమగునో యప్పు డచ్చోట జపయజ్ఞము చేయవచ్చును. బుద్ధి యేకాగ్రమగుటయే ప్రధానాంశము. బుద్ధి యట్లు ఏకాగ్రమగుటకుఁ బ్రపంచసార గ్రంథమందలి ప్రదేశంబులు సహకారులగును. ఆశ్లోకభావం బంతమాత్రమేగాని, బుద్ధి యేకాగ్రమైనను సముద్ర తీరాదులందుఁదప్ప నన్య ప్రదేశంబులందుఁ జేయరాదని దాని తాత్పర్యము గాదు.

బుద్ధి యేకాగ్రమగుట యంత సులభముగాదు. విక్షేపము కించిన్మాత్రము గలిగినను బుద్ధి యావంకఁబఱచు చుండును. సాధన ప్రథమావస్థయందిది యెల్లరకు ననుభవవేద్యము. దానంజేసి, సాధకులు సాధన ప్రథమావస్థయందు విక్షేపములు గలుగకుండుటకై వివిక్తదేశము నాశ్రయించుట మేలని శ్రీపరమహంసగారుగూడ నంగీకరించిరి. సిద్ధావస్థయందు జపము ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె స్వాభావికమగును. కావున సిద్ధులకెట్టి నియమంబులు నక్కఱలేదు.

ఈ జపము వాచికంబు, ఉపాంశువు, మానసికము అని మూఁడు విధంబులు. మంత్రమును ఉదాత్తానుదాత్త స్వరిత స్వరంబులలో స్పష్టముగా నుచ్చరింతురేని యది వాచికంబగుననియు, పెదవులుమాత్రము కదలించుచు

మెల్లఁగా నుచ్చరింతురేని యది ఉపాంశువగుననియు, మం త్రాక్షరంబులలో నొక్కొక్క యక్షరంబునకుఁ బదంబునకుఁ గల యర్థంబును ఆత్మగతముగా లోలోపలనే చింతించుట మానసికంబనియు వచించిరి. వాచిక జపమందు మంత్రో చ్చారణము బాహ్యశ్రుతిపథమగును; ఉపాంశువునందు జాపకునకుమాత్రమే యది వినవచ్చుచుండును; మానసికమం దది కేవల మనోగతమైయుండును. నాల్గవది సిద్ధులయందుమాత్రమే యది గానగును. మూఁడువిధము లలో నుత్తరోత్తరము శ్రేయమనిరి. మానసికజపము సర్వ కాల సర్వావస్థలందు జరుగనగును.

ఒకచోటఁ గూర్చుండి సాధకుఁడు మానసికజపంబును దీర్ఘకాలంబు చేయుచో వానిని నిద్ర పైకొనవచ్చును. కావున సాధకునకుఁ బ్రథమావస్థయందు వాచికజపంబు మేలగునని శ్రీపరమహంస చైతన్యస్వామి మున్నగు మహా త్ములు స్వానుభవంబును బురస్కరించి యానిపల్కిరి. ఈ వాచికజపమే సంకీర్తనం బనఁబడును.

సాధకులు సాధనావస్థయందుఁ గొన్ని నియమంబుల నాచరింతురేని వారికి జపసిద్ధి శీఘ్రకాలముననే గల్గును. ఈ విషయమై ప్రపంచసారాదు లిట్లు చెప్పుచున్నవి.

'సాధకుఁడు మితభోజిగా నుండవలయును. ఆ భోజన పదార్థముగూడ సులభముగా జీర్ణించునదిగా నుండవలయును. చక్కఁగా నిద్రించి బడలిక వాసినతర్వాతగాని జపక్రియ

నారంభింపరాదు. జపప్రదేశమును జక్కఁగా శుద్ధిపఱచవలయును. ఆ ప్రదేశము సమానశీతోష్ణముగా నుండవలయును. ఆసనస్థానమందు గుడ్డపఱచి దానిపయి జింకచర్మమును, దానిపయి దర్భాసనము నుంచవలయును. అది మృదువుగా నుండవలయునే గాని గట్టిగా నుండరాదు. సాధకుఁ డందుఁ దూర్పుముఖంబుగా సుఖాసీనుఁడై కుడిహస్తతలంబును ఎడమతొడమీఁదను, ఎడమహస్తతలంబును గుడితొడమీఁదనుంచి, నడుము మొదలు మెడ శిరస్సువఱకు వంకర లేకుండఁ జేసి, మనస్సును ఇంద్రియంబులను జాగ్రద్దశలోనుంచి, ప్రశాంతబుద్ధితోఁ దల వణకింపక పండ్లుచూపక మంత్రమును స్వరవర్ణాత్మకంబుగా నావర్తించుచు జపమారంభింపవలయును. జపకాలమందు ఉమ్మినను, ఆవులించినను, కోపపడినను, తూఁగినను, ఆఁకొనియున్నను, ఏమఱినను, దుష్టులను జూచినను, దలంచినను, జపభంగమగును. మనోనిరోధము, శౌచము, మౌనము, మంత్రార్థచింతనము, అవ్యగ్రత్వము, అనిర్వేదము—ఇవి జపసంసిద్ధికి హేతువులగును. తిరుగాడుచుఁగాని, నవ్వుచుఁగాని, చుట్టుప్రక్కలు చూచుచుఁగాని, గోడపై నొరఁగిగాని, మధ్యమధ్య మాటాడుచుఁగాని, తలకు ముసువువైచిగాని, కాలిపయిఁ గాలును జేతిపయిఁ జేయియు వైచిగాని, మనస్సును విచ్చలవిడిగా విడిచిగాని, అన్యులు వినునట్లు పెద్దగా నఱచుచుఁగాని జపింపరాదు. స్మృతిచంద్రికప్రకారము జన్నిదమును పట్టుకొని లెక్కించుచు జపించుటగూడ దోషమగును. ఇతరాచార్యులు మఱికొన్ని నియమంబులుగూడఁ జెప్పిరి. వీని

నాచరించుటవలన గుణమును, నిరాకరించుటవలనఁ గార్య విఘ్నంబులును గలుగును.

జాపకుఁడు మంత్రార్థంబును మంత్రప్రతిపాదితదైవంబును జక్కఁగా గ్రహింపవలయును. 'మంత్రార్థం మంత్రచైతన్యం యో న జానాతి సాధకః। శతలక్షప్రజప్తోఽపి తస్య మంత్రో న సిద్ధ్యతి॥ మంత్రచైతన్యమేతత్తు తదధిష్ఠానదేవతా। తత్ జ్ఞానం పరమేశాని భక్తానాం సిద్ధిదాయకమ్॥' అని మహానిర్ణయతంత్రము.

ఒక్కసారి 'హరీ' అని యన్నను, ఒక్కసారి ప్రపత్తి చేసినను జాలునని గ్రంథములందుఁ గలదు. ఆ మాటలు ప్రరోచనార్థమే యని గ్రహింపవలయును. ఒక్కటిమాత్రము జ్ఞప్తియందుంచుకొనవలయును. ఉత్తమభక్తులు మహార్తులై కుయ్యిడినప్పుడు భగవంతుఁ డా మాటతోడ వారివెంట నిలుచును. అట్టి శ్రద్ధాభక్తు లందఱకుఁ గలుగవు. సాధనసంపత్తిగలవారు మహావాక్యంబు నొక్కసారి విన్నఁ జాలునని శంకరులవారు చెప్పలేదా? యని యందురు గాఁబోలు. ఆ మాట వారు పరిపక్వచిత్తుల విషయమై చెప్పిరే గాని సామాన్యులఁగూర్చి చెప్పలేదు. సాధకులు మంత్రజపంబును సిద్ధిపర్యంతము చేయవలసినదే యని (శ్రీ) యాచార్యస్వామివారే సూత్రభాష్యములో (IV. 1. 1, 2) 'ఆవృత్తి, అసకృదుపదేశాత్; లిఙ్గాచ్చ' అని స్పష్టముగా నుడివిరి. మంత్రభావము చిత్తమందు నాటవలయును. అందుకొఱకు జపము నిరంతరము చేయుమనిరి. మంత్రభావంబట్లు హృదయస్ఫుట

మగుటకుఁ బ్రారబ్ధదోషమును నామాపరాధదోషములు అడ్డు పడుచుండును. అట్టి యడ్డుపాటు తొలంగుటకై జపంబును నిరంతరము సిద్ధిపర్యంతముఁ జేయుమనుచున్నారు.

నామాపరాధంబు లెవ్వి యందురా? 'సన్నిందాసతి నామవైభవకథా శ్రీశేశయోర్భేదధీః। అశ్రద్ధా శ్రుతిశాస్త్ర దేశికగిరాం నామ్న్యర్థవాదభ్రమః। నామాస్తీతి నిషిద్ధవృత్తి విహితత్యాగౌ చ ధర్మాంతరైః। సామ్యం నామని శంకరస్య చ హరేః నామాపరాధా దశ॥' నామాపరాధంబులు పది గలవని పద్మపురాణము. నామాపరాధుల దోషము నామ జపంబునఁ దక్క మఱియొక్కట నశింపదనిగూడఁ జెప్పఁ బడెను. పై వాక్యములఁబట్టి నామజపము మాటిమాటికి జరుపవలసిన యవసరము స్పష్టమగును.

సాధకుఁడు తాను జపింపఁదలంచిన మంత్రముయొక్క యర్థమును మాహాత్మ్యంబును సమగ్రంబుగా గ్రహించి జపింపవలయునా? లేక, ఊరక జపించినఁ జాలునా? అను శంక గలదు. భగవన్నామంబును, తన్నామార్థ మాహాత్మ్యంబులు తెలియకున్నను, జపించినఁ జాలుననియు, తావన్మాత్రజపంబువలననే మోక్షము లభించుననియుఁ గొందఱు భక్తుల విశ్వాసము. అందులకుఁ దార్కాణగా అజామిళుని బేర్కొందురు.

అజామిళుని చరిత్ర చక్కఁగా గ్రహింపక యందలి ప్రరోచనార్థక శ్లోకంబులను నమ్మి యట్లు పల్కుదురేగాని వేఱుగాదు. అజామిళునకు భగన్నామమాహాత్మ్యంబును

జ్ఞప్తిచేసిరి. ఆ మాటతోడ వానికి భగవంతునియెడ భక్తి యంకురించెను. అంతట నతఁడు భక్తిశ్రద్ధలతో నామజపము గావించెను. వానికి వాని పూర్వదురితంబులెల్ల నశించి పుణ్యకాలము వచ్చెను. అయ్యవసరంబున వానికి భగవన్నామంబును జ్ఞప్తిచేయుట కాకతాళీయన్యాయమేగాని వేఱుగాదు. భక్తివలన సాయుజ్యంబు నొందఁదగుననుటకుఁగా అజామిళుని కథను గ్రహింపవలయునే గాని, ఒక్కసారి భగవత్స్మరణము చేసినంతనే సాయుజ్యపదవి యుట్టి యొడిలోఁ బడునని తలంపరాదు.

ఇఁక జపమంత్రజ్ఞానము అవసరమా? కాదా? అను దానినిగూర్చి విచారింతము. 'మంత్రజ్ఞానముతోఁ గొందఱును, అట్టి జ్ఞానము లేకయే కొందఱును జపించుట గలదు. జ్ఞానాజ్ఞానముల ఫలం బొక్కటిగాదు; అవి వేర్వేఱుగా నుండును. 'శ్రద్ధాభక్తి జ్ఞానపూర్వక మంత్రజపమే సిద్ధికారి యగు' అని ఛాందోగ్యోపనిషత్తులో ప్రణవజపంబునుగూర్చి చెప్పఁబడెను (1-1-10). అర్థము తెలియక మంత్రమును జపించువాఁడు మూఁపున శ్రీగంధశకలంబుల మోయుచున్న గాడిదతో సమానమని యాస్కుని నిరుక్తము. మంత్రజ్ఞానం బవసరంబని ఋగ్వేదము. ఆ భావమునే శ్వేతాశ్వతరోపనిషత్తు అనువదించుచున్నది. 'తజ్జపస్తదర్థభావనమ్' అని పతంజలి మహర్షిగారు నుడివిరి. కావున మంత్రార్థజ్ఞానము లేని జపము నిష్ఫలమని తేలుచున్నది.

మంత్రార్థ జ్ఞానమనఁగా నేమి? మంత్రాక్షరంబు లెట్లుత్పన్నమైనవి యనియు, ఏ వ్యాకరణసూత్రము ప్రకా

రము మంత్రాక్షర శబ్దంబులకు సంధి కలిగెననియుఁ దెలిసి కొనుటగాదు. ప్రతిశబ్దమునకు నొక భావము స్వతస్సిద్ధము. శబ్దోచ్చారణముతోడ దానిభావము స్ఫురించును. ఆ భావ స్ఫురణజ్ఞానమే శబ్దజ్ఞానమగును. మంత్రమందలి శబ్దంబు లే భావంబును స్ఫురింపఁజేయునో ఆ భావముల నెఱుంగుట మంత్రార్థజ్ఞానమనఁబడును. ఆ భావంబును మున్నిడికొని జపించినఁ జాలును. అంతియగాని పాండితీప్రకర్షం బవసరము లేదు.

ప్రతి మంత్రమునకు నొక యధిష్ఠానదైవము గలదు. అట్లే భగవన్నామరూపమంత్రంబునకు భగవంతుఁ డధిష్ఠాన మగును. అధిష్ఠానముయొక్క గుణగణంబు లిట్టివని యెఱింగి జపించుట మంత్రార్థజ్ఞానపూర్వక జపంబగును. మంత్రమునకు శబ్దము ప్రాణముగాదు. మంత్రోద్దిష్టితమైన యా తత్త్వము యొక్క గుణవిశేషజ్ఞానము మంత్రమునకుఁ బ్రాణమగును. ఆ జ్ఞానము జపమునకుఁ బ్రధానము. మంత్రిమునకు భాషా నియతి లేదు. జాపకునకుఁ దన్మంత్రభాషాజ్ఞానముగూడ నవ సరము లేదు; మంత్రభావస్ఫురణంబుండినఁ జాలును. అక్షర జ్ఞానముగాని భాషాజ్ఞానముగాని లేనివారెందఱో సామాన్య మంత్రములనే జపించి సిద్ధిపడసి తేలుకుట్టు పాముకాటులకు మంత్రించుటయుఁ దద్బాధ నివారింటయుఁ గన్నారఁ జూచు చున్నాము. ఇఁక భగవన్నామ మంత్ర జపంబును గూర్చి చెప్పవలయునా ?

ప్రతి భాషకు నొక యక్షరమాలగలదు. ఆ యక్ష రంబులలోఁ గొన్నిమాత్రమే మహా శక్తివంతములందురు.

వానినే బీజాక్షరంబులనియు వచింతురు. అట్టి బీజాక్షరము లతో సంపుటీకరించిన మంత్రము ప్రాణవంతమై ఫలకారి యగునని కొందఱమతము. ఈ విషయమై గొప్ప గొప్ప గ్రంథములు వ్రాయఁబడియున్నవి. వాస్తవము విచారించి నచో ప్రతియక్షరంబునకు నుచ్చారణము భేదించుచుండును. ఉచ్చారణభేదంబునుబట్టి వ్యక్తభావభేదంబును దానింబట్టి శ్రోతలందు శమమో యాగ్రహమో జనించుటయు లోక ప్రసిద్ధము. కావున బీజాక్షరంబులకుఁ గొంత ప్రత్యేక బలంబున్నదనక తప్పదు. అట్టి శక్తిమంతంబులైన యక్షరం బులతో సంపుటీకరించిన మంత్రమునకుఁ గొంత యధిక శక్తి యుండుననుట యసంభావితముగాదు. ఈ వివక్షయంతయు అర్థ సాధన ప్రక్రియయందు నుండిన నుండుఁగాక. పరమార్థ సాధన విషయంబున నిట్టిదానికి లవమాత్రముగూడ నవకా శము లేదు. అందు భావశుద్ధిమాత్రమే ప్రధానము. 'రామ' శబ్దమును వాల్మీకికి నుపదేశించిరనియు, ఆతఁడు నిరక్షర కుక్షిగావునఁ దచ్ఛబ్దంబు నట్లే యుచ్చరింపఁజాలక 'మరా మరా' అని జపించెననియు, అయినను వాని భావశుద్ధి ప్రభావంబున నతఁడు ముక్తుఁడయ్యెననియుఁ బ్రతీతి గలదు. వాల్మీకివంటి నిరక్షరకుక్షు లెందఱో భగవన్నామంబును యథేచ్ఛగా జపించి కడతేఱినవారుగలరు. ఎల్లనియమంబు లును అర్థకాముల కే కాని మోక్షకాములకుఁ గావను పరమ సూత్రం బెల్లెడల వర్తించును. ఏపనికైనను విశ్వాసముండ వలయును. అది లేనినాఁడు ఫలము సిద్ధింపదు. పెద్దలన్నం తనే సామాన్యముగా వారియందొక విశ్వాసము జనించును.

అట్టి పెద్దలు చెప్పిన మంత్రమన్నంతనే సాధకునకుఁ గొంత భక్తి విశ్వాసములుగలుగును. అవి వానికి నెంతో తోడ్పడును. అంతవఱకు నంగీకరింపక తప్పదు.

సాధకుఁడు నిర్గుణంబును జపింపవలయునా? సగుణంబును జపింపవలయునా? అను మఱియొక శంక గలదు. జపము మానసిక వ్యవహారము. మనస్సన్నో సాలంబనంబున వర్తించును గాని నిరాలంబనంబున వర్తింపదు. ఆలంబనము సాకారమగునేగాని నిరాకారము గాఁజాలదు. సాకారము సగుణమగునేగాని నిర్గుణంబుగానేరదు. కావున జప విధానంబెల్ల సగుణపరమేయనుట నిర్వివాదము.

జపమనఁగా నేమి? ఏదే నొక తత్త్వంబును మూర్తీభవింపఁజేసి యా మూర్తియందు గుణము లారోపించి యా గుణంబులయందు దృష్టినిలిపి వానిని వల్లించుట జపమగును. అట్లు చేయుటవలనఁ దద్గుణశక్తి సాధకునియందుఁ గ్రమక్రమంబుగాఁ బెంపొంది యతఁడు ధ్యేయ తత్త్వంబునకు సమీపవర్తియగును. ధ్యేయతత్త్వంబు నెంతవఱకు సమీపించునో యంతవఱకు వానికి సిద్ధియైనట్లు తలంతురు. ఇది యెల్ల సాధకునియందుఁ గలుగుచున్న పరిణామ విశేషమేగాని వేఱు గాదు. ఈ పరిణతియే జపఫలము.

ధ్యేయం బెట్టిదిగా నుండవలయుననను శంక మఱియొకటి గలదు. సాధకుని సంకల్ప మనస్తత్త్వంబులను బట్టి ధ్యేయముండును. వాని మనస్తత్త్వంబు తామసికమో రాజసికమో యైనచో వాని సంకల్పంబు లట్టివిగానే యుండును.

అందుకుఁదగిన ధ్యేయమునే యతఁడు గ్రహించును. ఆ కార ణంబున ధ్యేయములుగూడఁ ద్రివిధమగుచున్నవి.

మోక్షము సత్త్వగుణ ఫలంబు. కావున ముముక్షువు సత్త్వగుణాభివృద్ధికై సాత్త్విక ధ్యేయమునే గ్రహించును. సాత్త్విక ధ్యేయంబులలోఁగూడ నంతరాంతరంబులు గలవు. ముముక్షువులు వారి వారి రుచిప్రకారము ధ్యేయమును గ్రహింతురు. ఏ ధ్యేయంబును గ్రహించినను ముముక్షువు మోక్షార్థమై యేగుణములు తనయందభివృద్ధి గావలయునని కోరునో యాగుణంబులను మాత్రమే యాధ్యేయమం దారోపించి జపింపవలయును. ఈ విషయంబును శ్రీనారదమహర్షి గారు నొక్కి పల్కుచున్నారు. అది కాదనువారేయుండరు. రాజెట్లో ప్రజయునట్లేయన్న సామెతప్రకారము, ధ్యేయ మెట్లో ధ్యాతయు నట్లే యగును. భ్రమర కీట న్యాయమును వినమా?

'భగవంతుఁడు సమస్తంబునకు నాధారమనిరి. సృష్టి యందుఁ గళ్యాణగుణములేగాక దుర్గుణంబులుగూడఁ గలవు. వానికిఁగూడ భగవంతుఁడే యాధారము గావలయును. ఏల యందురా? భగవంతుఁడు దక్క వేఱొం డాధారము లేదను టయే ఇందులకు కారణము. మఱియు 'భగవత్సంబంధమైనది యేదైనను త్యాజ్యము కానేరదు. కావునఁ గళ్యాణగుణంబులనే యేల జపింపవలయును? దుర్గుణంబుల నేల జపింపరాదు?' అనువారు కొందఱుగలరు. వీరిని వామాచారులందురు. తక్కిన వారిని దక్షిణాచారులందురు. భగవంతుఁడు సమస్తగుణంబు

లకు నధిష్ఠానమైనను, ముముక్షువునకు సత్త్వగుణసంపత్తి మాత్రమే ప్రధానము గావునను, సకలకళ్యాణగుణంబులు సాత్త్వికంబులగుఁ గావునను వానినే యతఁడు జపించును. అర్థకాముల సంగతి యట్లుగాదు. అర్థసిద్ధి వారివారి సంకల్పంబునుబట్టి రాజసికముగానో తామసికముగానోయుండును. 'యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామి' అని భగవంతుఁడు చెప్పినట్లుగా రాజస తామసార్థంబులను గోరువారు తద్గుణంబులనే జపింపవలయును. సత్త్వశుద్ధిగోరి రాజసాదులను సేవించినను, రాజసాదిసిద్ధినిగోరి సత్త్వమును సేవించినను ఫలములేదు. అట్లుచేయుట పశ్చిమసాగరంబునకుఁ బోఁగోరి తూర్పునకు నడచుట యగును.

ఈ వామాచారము శాక్తేయ వైష్ణవమతములందుఁ గానవచ్చుచున్నది. అట్లని యీ రెండు మతంబు లట్టివిగా భావింపవలదు. వానిలోఁగూడ దక్షిణాచారము గలదు. శక్తి యన్నంతనే ఘోరరూపిణిగా భావింపనక్కఱలేదు. శక్తినిగూడ సత్త్వదేవతగానే భావించి జపించి ముక్తినొందవగును. ఈ భావంబును నెలకొల్పుటకై వామాచారరూప శక్తిపూజకుఁ బుట్టినిల్లయిన వంగదేశమందు శ్రీ పరమహంసగా రవతరించి ఘోరరూపిణియైన యీ కాళీశక్తినే సాత్త్విక రూపమాతృభావంబుతో నారాధించి లోకంబును ప్రబోధించిరి. మఱియొక విషయము. ధ్యేయము మంగళాకారంబుగా నుండవలయుననుట యంత ప్రధానముగాదు. ఏలయందురా? జాపకుఁ డాకార లక్షణంబులను జపించుటలేదు; ధ్యేయమం దారోపించిన నైతికాధ్యాత్మిక కళ్యాణగుణంబు

లందే లక్ష్యముంచి జపించును. ధ్యేయాకారము రుచిరంబుగా నుండు నేని సాధనకుఁ గొంత తోడ్పడవచ్చును. అంత మాత్రమే దాని ఫలము.

కావున సాధకునకు శ్రవణ కీర్తన జపంబులు ముఖ్యములు. అట్టి సాధనమే వాని నుత్తమగతికిఁ గొనిపోవును. కార్యాంతరములందున్నను అట్టి సాధనము మానసికముగా నెల్లప్పుడును జరుగవచ్చును. భోజనాది సమయంబులందు ద్విజులు కొన్ని మంత్రంబులఁ జపించుట విధిగాఁ జెప్పిరి. నైరంతర్యసాధనమే యందలి తాత్పర్యము. ఇట్టి నియమంబుల పూర్వకంబుగాఁ జేసిన ప్రతికర్మము భగవత్సేవాపరమగును. ఇదియే శ్రుతిభావము.

పరతత్త్వంబును దెల్పుటకుగాఁ బ్రతి భాషయందుఁ గొన్ని ప్రత్యేకపదంబులను గల్పించిరి. ఆ పరతత్త్వము సంస్కృతభాషయందు 'పరమాత్మ, బ్రహ్మము, భగవానుఁడు' అను శబ్దముల మూలకంబున సూచితమగుచున్నది. ఈ మూఁడు శబ్దములలో 'భగవాన్' శబ్దమునకు నొకవిధమైన యాధిక్యత యొసఁగఁబడెను. 'వదంతి తత్త్వవిదః తత్త్వం యద్ జ్ఞానమవ్యయం । బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే ॥' (భాగ. 1-2-11.) 'ఏది యింద్రియగోచరము కాదో, ఏది వార్ధక్య[illegible]పజరాగుణంబునకు నతీతమో, యిట్టి దని చింతించుటకు నేది యందదో, దేనికిఁ బుట్టువులేదో, ఏది యెన్నఁడును వ్యయమునొందదో, యిట్టిదని చెప్పుటకు నేది సాధ్యముకాదో, దేనికి రూపముగాని పాణిపాదాద్యవ

యవంబులుగాని లేవో, ఏది సర్వశక్తిమంతంబును, సర్వగతం బును, నిత్యంబునగునో, ఏది సర్వభూతంబులకు నుత్పత్తి స్థానమో, ఏది యెట్టి కారణఫలమునుగాదో, ఏది సర్వాంత ర్యామియగునో, దేనికి మఱియొక యంతర్యామి లేదో, అదియే బ్రహ్మము, అదియే పరంధామము, సూక్ష్మాతి సూక్ష్మమైనదానినే విష్ణుపరరూపంబనియు, భగవానుఁడనియు శ్రుతులు పల్కుచున్నవి.'

దీనింబట్టి 'భగవాన్' శబ్దమందెంత భావం బిమిడి యున్నదో గ్రహింపనగును. 'భగవాన్' శబ్దమందలి 'భగ' అను రెండక్షరంబులు సమగ్రమైన యైశ్వర్యంబు, ధర్మంబు, యశస్సు, సిరి, జ్ఞానము, వైరాగ్యము ఈ యాఱింటిని దెలుపును. 'వ' కారము వాని కలిమిని దెలుపును. అనఁగాఁ బై యాఱింటిని గలిగిన తత్త్వము 'భగవాన్' శబ్దము సూచించునని భావము. 'భగవాన్' శబ్దమునందు పై షడ్భా వంబులేగాక, 'అఖిలహేయప్రత్యనీక కళ్యాణైకతాన స్వేతర సమస్తవస్తువిలక్షణానంత జ్ఞానానందైకస్వరూప స్వాభావికా నవధికాతిశయజ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజః సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సామ్య కారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞతాద్యసంఖ్యేయ కళ్యాణగుణౌఘంబుల' నెల్ల సూచించునని శ్రీ రామానుజా చార్యులు వచించిరి.

ఈ మత ప్రకారము భగవంతుఁడు ఉభయలింగమూర్తి యగును. అవగుణరాహిత్యము, కల్యాణగుణసంపత్తి ఈ రెండు నుభయలింగంబులనఁబడును. భగవంతునందు నివి రెండుఁ గలవని భావము. ఇట్టి భావము సాధకునకు నెంతయు సహకారియగును; అవగుణధ్యాసకుఁగూడ నవకాశ ముండదు. శ్రీ శంకరులుగూడ సగుణబ్రహ్మమందు వీని నంగీకరించిరి.

జపము చేయునప్పుడు భగవచ్ఛబ్ద ప్రతిపాదితమైన ట్టియుఁ బైనఁ జెప్పఁబడినట్టియు పరతత్త్వంబునందే దృష్టి నుంచి జపింపవలయునా? లేక, భగవదవతారంబులని చెప్పఁ బడువానిని గ్రహించి వానియందు మనస్సు నిల్పి జపింప వచ్చునా? అను శంక గలదు. భగవంతుని విభూతులు, పర, వ్యూహ, విభవ, హార్ద, అర్చ అని యైదువిధంబులనియు, వానిలో దేనినైనను గ్రహించి జప ధ్యానాదులు చేయవచ్చు ననియు శ్రీ రామానుజులవారి భావము. రామకృష్ణాద్యవ తారంబులనుగూడ గ్రహింపవచ్చునని శాండిల్యుని మతము. (సూ. 50). 'ప్రాణిత్వాన్నవిభూతిషు' గురుజనంబునందుఁ గూడ భగవచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్నందునను, గురు పదవి నధిష్ఠించినవా రంతటివారే యగుదురు గావునను వారిని గూడ ధ్యేయమూర్తులనుగా గ్రహింపవచ్చునని శ్వేతాశ్వత రోపనిషత్తు చెప్పుచున్నది. (VI. 23.) పరమాత్మనే జపింప వలయునని శ్రీ నారదమహర్షిగారి మతము. (సూ. 79.) 'జగత్తులోని సకల ప్రాణులు బ్రహ్మ మొదలు గడ్డిపోచ పర్యంతము కర్మజనిత సంసారవశవర్తులుగా నున్నారు.

కావున వారు ధ్యాతకు ధ్యానోపకారులుగా'రని పరాశర మహర్షి దెలిపెను. 'ఏలయందురా? వారెల్లరు అవిద్యావశవర్తులై సంసారగోచరులగుదురు. ప్రబుద్ధులైనప్పుడేని వారు తగరా యనవచ్చును. వారిబోధ నైసర్గికముగాదు; పరబోధవలన వారు ప్రబుద్ధులైరి. అనఁగా వారికి స్వాతంత్ర్యము లేదని భావము' అని వారును నారదుని భావంబునే బలపఱచిరి.

దీని సారాంశమేమి? మూర్తి యన్నంతనే ఎంతటివానికైనను బరిచ్ఛిన్నత్వము తప్పదనియు, పరిచ్ఛిన్నమూర్తులవలనఁ గలుగు ఫలముగూడఁ బరిచ్ఛిన్నమే యగుననియు, సమస్తకళ్యాణగుణంబులు సమగ్రంబుగా నపరిచ్ఛిన్నుఁడైన యొక్క భగవంతునందే యుండనేర్చుననియు, భగవచ్ఛబ్దభావమే యది యనియు, సాధకుఁడు భగవంతునందే దృష్టినిల్పి తత్కళ్యాణగుణంబుల ననుసంధానము చేయవలసినదనియు సారాంశము. ఒకవేళ అవతారంబులనుగాని, గురువునుగాని ధ్యేయముగా గ్రహింతురేని, వారికిఁ గల ప్రారబ్ధదోషంబులను దలంపక వారు సాక్షాద్భగవత్స్వరూపులను భావంబుతో జపాదులు జరుపవచ్చును. ధ్యేయమం దేమాత్ర న్యైల్యమును శంకించినను అది ధ్యాతకుఁ బతనకారణంబగును.



**సూ. ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశాత్ వా. 38**

ఈ సిద్ధికి మహాత్ముల కృపయో భగవంతునికృపాలేశమో ముఖ్యము.

భగవద్గుణ శ్రవణ కీర్తనాదులవలనఁ బరాభక్తి సిద్ధించునని 37 వ సూత్రము సూచించుచున్నది. అనఁగాఁ బురుషకారమువలన యత్నసిద్ధియగునని తాత్పర్యము. ఈ మాట లోకానుభవంబునకు విరుద్ధముగా నున్నదనియు, వాంఛాసిద్ధికై మర్త్యులెన్నో విధములఁ బ్రయత్నించియుఁ దుదకు విఫలమనోరథు లగుచున్నారనియు, లౌకికవిషయములందే యత్నఫలం బట్టిదిగా నుండఁగా, అలౌకిక విషయంబైన ముక్తి యత్నఫలంబగుననుట యెట్లు నమ్మవచ్చుననియు సామాన్యముగా శంకింతురు. ముక్తియనునది భగవదనుగ్రహంబునఁ జేకూరవలసినదేగాని, అది పురుషకారఫలంబుగాదనియు, మహాత్ములకృప భగవదనుగ్రహప్రాప్తికిఁ జేయూఁతయగుననియు, అట్టి కృపకుఁ బాత్రతయగు స్థితి పురుషకారంబునఁ గల్గుననియు, పురుషకారంబు తావన్మాత్రమేయనియు ఈ సూత్రము బోధించుచున్నది.

భగవదనుగ్రహము, పురుషకారము, ఈ రెంటిలో ముక్తికి నేది ముఖ్యమను విషయమునుగూర్చి తీవ్రమైన వాదోపవాదంబులు మొట్టమొదటినుండి గలవు. జ్ఞానమార్గము పురుషకారమునే ప్రధానముచేయును; భక్తిమార్గము దైవానుగ్రహమును బ్రధానముచేయును. మోక్షసాధన క్రమాభ్యాసమందు భగవదనుగ్రహము ప్రతిక్షణముఁ దోడ్పడనిచో

నొక్క మెట్టుగూడ నెక్కనేరమనియు భగవదనుగ్రహంబుc బడయుటకు ఆత్మశుద్ధి కావలయుననియు, ఆత్మశుద్ధికిc బురుష కారము ముఖ్యమనియు నిది స్వానుభవంబనియు భక్తులు పల్కుదురు. ఈ పురుషకారముగూడ భగవదనుగ్రహంబున నడువవలయునేగాని దానికి స్వతంత్రశక్తి గోరంతయును లేదని మఱికొందఱు భక్తుల తాత్పర్యము. అనcగా భగవదనుగ్రహము గల్గినcగాని చిత్తము భగవంతునివలను దిరుగదనియు, అట్లు చిత్తము భగవన్ముఖమైన తర్వాతc దత్ప్రాప్తికై యత్నింతురనియు, ఆ కారణంబునc బురుషకారంబునకు భగవదనుగ్రహమే బీజమనియు వారి భావము.

ఈ భగవదనుగ్రహ సిద్ధాంతము వేదకాలంబునుండియుc గలదు. ఎవనిని భగవంతుc డనుగ్రహించునో వానికి మాత్రమే భగవద్దర్శనంబు గల్గుననియు, పురుషకారంబునే నమ్మినవారి కెన్నcడును భగవద్దర్శనము కాదనియు ఋగ్వేదము, బృహదారణ్యకోపనిషత్తు, కఠోపనిషత్తు, ముండకోపనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు, కౌషీతక్యుపనిషత్తు, బ్రహ్మసూత్రములు మున్నగునవి చెప్పుచున్నవి. శ్రీకృష్ణభగవానుcడును,

శ్లో. 'సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్.
(భ. గీ. 18. 56)

శ్లో. మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యతి.
(భ. గీ. 18. 58)

శ్లో. తమేవ శరణంగచ్ఛ సర్వభావేన భారత,
　　తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.
(భ. గీ. 18. 62)

అను శ్లోకంబులందు ముక్తికి భగవత్ప్రసాదమే తారకమని స్పష్టముగాఁ దెల్పెను. అదే భావంబును వ్యాసమహర్షియు మహాభారతమం దచ్చటచ్చట నుపపాదించిరి. ఈ విషయం బున భాగవతముసంగతి చెప్పవలయునా?

భగవదనుగ్రహం బట్టిదేని అది యెల్లరయెడ నేల గలుగరాదు? భగవంతునకుఁగూడ వైషమ్య నైర్ఘృణ్యాం బులుగలవా? అను ప్రశ్న వెంటనే వచ్చును. భగవంతు నకు వైషమ్యాదులు లేవనియు, వాని యనుగ్రహము సర్వ కాల సర్వప్రదేశంబులందు నిరంతరముగాఁ బ్రసరించుచునే యున్నదనియు, భగవంతుఁడు వాని యనుగ్రహామృతంబు నెల్లరయందు సమానముగానే చిందుచున్నను, ఎవరు దానికై ప్రయత్నింతురో వారికిమాత్రమే యది చెందు చున్నదనియు, ఒల్లనివారికి నది ప్రాపింపని కారణంబున భగవంతునెడఁ బక్షపాతాదు లారోపించుట యుక్తియుక్త మును న్యాయమును గాదనియు, సూర్యుఁ డెల్లెడలఁ బ్రకా శించుచున్నను, గదిలో తలుపుమూసి కూర్చుండి రవికిరణ ప్రసారము తనకు సోఁకలేదనియు, ఆ కారణంబున సూర్యునకు పక్షపాతి యనియుఁ జెప్పనగునా యనియు, భక్తులు సమా ధానము చెప్పుదురు.

పురుషకారముగూడ దైవానుగ్రహఫలమే యని వీర భక్తులు చెప్పునట్లుగా, అనుగ్రహ మనునదే బూటకం బనియు, అది భక్తి పారవశ్యంబున జనించిన భావనామాత్ర మగుననియు వీరజ్ఞానులు పల్కుదురు. తన కర్తవ్యంబును దాను జేయుటమాని దాని నన్యులపయి మోపుట, ఆడలేక మద్దెలపైఁబడి కొట్టుకొనెనను సామెతప్రకారము కార్పణ్య దోషమేగాని వేఱుగాదనియు, ఎవనికి వాఁడే కర్తయు భోక్తయు నగుఁగాని యన్యుఁడు గానేరఁడనియు, పాటుపడని వానినిఁ బరమేశ్వరుఁడుగూడ రక్షింపఁజాలఁడనియు, ఎల్లర యందు భగవదనుగ్రహము సమానమేయగుచో, లోక ములోఁ బాపాత్ముఁడే యుండఁగూడదనియు, వీరి తాత్పర్యము.

ఈ వీరసిద్ధాంతంబు లెట్లున్నను, సూత్రభాష్యము 11-3-4 లో 'తదనుగ్రహ హేతుకేనైవ విజ్ఞానేన మోక్ష సిద్ధి ర్భవితు మర్హతి' అని సిద్ధాంతీకరించిరి. (మోక్షసిద్ధి విజ్ఞానంబునఁ గలుగును. విజ్ఞానమునకు భగవదనుగ్రహము హేతువగును.) భగవదనుగ్రహంబును బురుషకారంబును రెండును గూడినఁగాని ముక్తిగలుగదనుట నారదమహర్షికిఁ గూడ సమ్మతమే యని తోఁచుచున్నది.

ఒకనాఁడు నమ్మాళ్వారుగారు భగవంతుని 'స్వామీ! ఎల్లరకు ముక్తి ననుగ్రహింపరేల? అని యడిగెనట. మను ష్యులకు స్వాతంత్ర్యము గలదనియు, వారు వారి హృదయ మును దనవంకకు మరలింతురో లేదో పరీక్షించుటకై వేచి యుందుననియు భగవంతుఁడు మాఱాడెనఁట. అదిగూడ నీ యనుగ్రహమేగదా యని నమ్మాళ్వారుగారు పల్కిరట.

మహాభారతయుద్ధము ముగిసిన తర్వాత, ఉద్ధవుఁడొకనాఁడు కృష్ణుని సమీపించి 'కృష్ణా! ఇంతమంది ప్రాణంబులను నిలువునఁ దీయించితివి. ఇంతకన్న ఘోరముందునా?' అనెను. కృష్ణుఁ డదివిని 'ఉద్ధవా! కౌరవుల పాపంబునకు వేఱొక ప్రాయశ్చిత్తము గలుగదు. అందువలన యుద్ధంబును సమ్మతించితి' ననెను. నావుడు 'కృష్ణా! ఎల్లరహృదయంబులందు నంతర్వర్తివై నీవు మెలంగుదువు. కౌరవుల బుద్ధిని మరలించు తలంపు నీకున్నచో నది నీకు సాధ్యముగాకపోయెనా?' అని యుద్ధవుఁడు పల్కెను. ఆ మాట కృష్ణుఁడు విని 'ఉద్ధవా! మర్త్యులకెల్ల నాత్మస్వాతంత్ర్యముగలదు. దాని యిచ్ఛాప్రకారము వర్తింతురు. ఆ స్వాతంత్ర్యము నడఁచివైచుట తగదు. భగవన్ముఖత్వము స్వయముగాఁ గలుగవలయును. అందాక వేచియుండవలయు' అని బదులు చెప్పెను. ఇదేభావంబును క్రీస్తు మున్నగువారుగూడ సూచించిరి. 'అడుగకయే అమ్మయైనను బెట్టదు' అను సామెత వినమా?

పురుషకారంబునకును దైవానుగ్రహంబునకును నుంతయు సరిపడనట్లు బాహ్యదృష్టికిఁ గాన్పించినను, భక్తుల యంతర్దృష్టియందు రెండును సమరసంబొందుచున్నవి. వ్యక్తిస్వాతంత్ర్యము నడ్డగించుట యీశ్వరేచ్ఛగాదనియు, అట్లని వ్యక్తి నట్లే వదలక, కర్మానుభవతత్త్వంబు నొకటి కల్పించి తన్మూలకంబున నిరోధంబులఁ గడపి యున్నతస్థితికి వచ్చుటకు నవకాశమును గలిగించెననియు, ఈ కర్మవిధానము గూడ నీశ్వరానుగ్రహమేయగుననియుఁ, గొందఱందురు.

కర్మఫలంబులలో దైవానుగ్రహముగూడ నొకటియగు ననియు, శుభకర్మంబులు అనఁగా భక్తిప్రపత్తులు వానికిఁ దగిన ఫలంబుగా దైవానుగ్రహంబును బడయుచున్నవనియు మఱికొందఱు చెప్పుదురు. మొత్తముమీఁద రెండు తత్త్వం బుల నిరువురు నొకరీతిగా నంగీకరించుచు, దాని దాని విధానము తప్పక జరుగుననుచున్నారు.

శ్లో. 'తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥'

అను గీతాచార్యుని వాక్యప్రకారము వ్యక్తులు వారివారి పూర్వవాసనలు లాగినదారి నడతురు. ఆ వాసనలు శుభము లైనవగుచో మంచిమార్గముననే నడపును. ఆ వాసన లంతః స్థములై యుండును. అయినను వానికి నేదేనియు నుద్దీపకము గలిగెనేని యది వెనువెంటనే పరిమళించును. గురూప దేశాదు లట్టి యుద్దీపకంబులగును. ఈ భావంబును సూత్ర మందలి 'ముఖ్యతః' అనుపదము సూచించుచున్నది.

గురూపదేశంబునఁ ప్రబోధమంది యుత్తమగతిని బడసినవారి చరిత్రలు దేశదేశాంతరగ్రంథములందుఁగూడఁ గలవు. రామకృష్ణాద్యవతారపురుషులుగూడ నట్లే గురూప దేశముఖంబునఁ బ్రబోధితులైనట్లు పురాణంబులు పల్కు చున్నవి. నారదుని చరిత్రయే య్యాదులకు నిదర్శనమని మధుసూదనసరస్వతిగారు పల్కిరి.

శ్లో. 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥'

అను గీతావాక్యముగూడ నిదేయర్థంబును బోధించుచున్నది. మహర్షులు పెక్కు రీ భావంబునే యనువదించిరి. గురువు తండ్రికన్న నధికుఁడని మనువు చెప్పుటయందుఁగూడ నిదే భావము సూచితమగును.

శ్లో. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।
గురు స్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

అని చెప్పిరిగదా.

ప్రారబ్ధకర్మవశంబున వాసనలు అశుభంబుగా నుండి నచో గురువుమాత్ర మేమిచేయఁగలఁడను శంక గలుగ వచ్చును. అన్ని వాసనలు నశుభములుగా నరజన్మమెత్తిన వానికి నెన్నఁడు నుండవు. శుభవాసన యంతో యింతో యుండును. శుభవాసన లేనిచో నరజన్మమే గలుగదు. గురువనఁగా నెంతటి శక్తిసంపన్నుఁడో పైనఁ జెప్పఁబడెను. అట్టివానికి సర్వము నవగతమగుచుండును. శుభవాసనా సమయమును బరికించి గురువు దానికి నుద్దీపనము గావించును. ఆ శక్తితో నది పరిమళించి శక్తిమంతమై హృదయంబును భగవన్ముఖ మొనర్చును. సుముఖత్వముతోడ భక్తి యంకురించును. అదియే వానిని గ్రమక్రమముగాఁ బైకిఁ గొనిపోవును.

గురుజనానుగ్రహము చిత్రవిచిత్రముగా నుండును. వెదకి వెదకి వచ్చినవారిని గురువు లొక్కొక్కసారి నిరాకరింతురు. తలవని తలంపుగా వచ్చి యొక్కొక్కని యనుగ్రహింతురు. తా మెవని ననుగ్రహింపనెంతురో వానికిఁ

దెలియకుండునట్లుగానే యనుగ్రహింతురు. ఉపదేశమే వల దను వారినిగూడ నొక్కొక్కసారి తమ యనుగ్రహంబునకుం బాత్రులనుగాం జేయుదురు. కొందఱు తిరస్కారభావంబుతో వచ్చియు గురుసందర్శనమాత్రాననే వారికి సాష్టాంగ మొనర్చి శిష్యులగుటయుంగలదు. కావున మహాత్ముల ప్రభావం బిట్టి దనరాదు. వారి తేజస్సు నీనినెల్లం జేయుచుండును. ఆ తేజోమండలం బెంతదూరమో వ్యాపించును.

సత్పురుషు లట్టి యవ్యాజ కృపామూర్తులు గావున వారి సాంగత్యంబునకు నంత విలువగలదు. సూర్యోదయంబు జేంకట్లను విరియునట్లుగా సత్పురుష సాంగత్యోపదేశంబులు అజ్ఞానంబు నూందివైచును. వారి సందర్శనమాత్రాననే అసంభావనా విపరీతభావంబులెల్ల వలసపోవును. నిరీశ్వర వాది సయితము సేశ్వరవాది యగును.

ముక్తులకు లోకముతోం బనియేమి? అని శంకింప వచ్చును. ముక్తుండు పరమకృపాస్వరూపుండు, సంసృతి సాగరంబున మునింగి దరిగానక తొట్రుపడుచున్నవారినిం జూచినంతనే వాని కృప యుబ్బి యుబికి పొరలివచ్చును. వారి లోకానుగ్రహంబంతటిది గావున, పరజనోత్తరణంబును వారొక వ్రతముగా ధరింతురు. క్రీస్తువు, బుద్ధుండు, మహ మ్మదు, రామకృష్ణపరమహంస— వీర్జీవితంబులను జదివి నచో లోకోపకారార్థమై వారెంత తపించినది తెల్లమగును.

మహాత్ములనంగా నెట్టివారందురా? ఆసంగతి శ్రీ భగవానుని వాక్కుననే విననగును. 'ఎవరు సర్వభూతంబుల

నాత్మసమంబుగాఁ జూతురో, ఆ భూతంబులవలనఁ దమకు బాధకల్గినను ద్వేషింపక వానియెడ మైత్రినే నెఱపుదురో, ఎవరు సర్వభూతంబులకు నభయప్రదాన మిత్తురో, ఎవరికి దేహాభిమానము సయితము గలుగదో, ఎవరు తమకెంత ప్రభావమున్నదని యహంకారము నొందరో, ఎవరు సుఖ దుఃఖంబులను సమానంబుగా భావింతురో, తిట్టినను గొట్టినను ఎవరు వికారమునొందరో, ఎవరు తమ శరీరపోషణా ర్థమై యాహారాదులు దొరకినప్పుడెట్లో దొరకనప్పుడుగూడ నట్లే సంతుష్టులైయుందురో, ఎవరు సమాహితచిత్తులై శరీ రేంద్రియాదులను వశపఱచికొని యుందురో, ఎవరు కర్తృ భోక్తృభావంబులకు దూరమై తాము సచ్చిదానందాద్వితీయ బ్రహ్మమను దృఢాభిప్రాయము గలిగి కుతార్కికుల వితండ వాదంబులకుఁ జలింపకుందురో, ఎవరు తమ యంతఃకరణంబు లను శుద్ధబ్రహ్మమైన నాకు సమర్పించియుందురో, ఎవరు శుద్ధాక్షర బ్రహ్మవేత్తలగుదురో, ఎవరివలన లోకంబునకు గొంతయు భయంబుగలుగదో, ఎవరు అద్వైతదర్శినులును బరమ కారుణికులును క్షమాశీలురునగుటంజేసి లోకుల వలని బాధలకుఁ జలింపరో, ప్రియలాభంబునకు నుప్పొంగు టయు, పరోత్కర్షకు నోర్వలేమియుఁ గ్రూరజంతువులను జూచి భయపడుటయు, సర్వపరిగ్రహశూన్యముగా నేకా కిగా విజనదేశమందెట్లుండఁగలమను వ్యాకులపాటును ఎవరికిఁ గలుగదో, ఎవరు భోగంబులను గోరరో, అవి యదృ చ్ఛగాఁ గల్గినను వాని నెవ రపేక్షింపరో, బాహ్యాభ్యంతర శౌచవంతులై కర్తవ్యంబుల నెఱింగి నిర్వహించు సామ

ర్థ్యముగలిగి పక్షపాతబుద్ధి లేక యెంత వ్యర్థమైన నోర్చి యెవరుందురో, ఐహికాముష్మిక ఫలాకాంక్ష లేక, శుభాశుభంబుల రెంటిని బరిత్యజించి సర్వద్వంద్వసహిష్ణువులై మౌనవ్రతము ధరించి నియత నివాసము లేక, పరమార్థవస్తు విస్మృతినొందక యెవరు నాకు భక్తులైయుందురో వారు మహాత్ములగుదురు.'

ఈ మహాత్ములఁగూర్చి గీత II-55-72; XII-13-20; భాగవతము III-25-21-24; V-5-2-3; XI-2-45-55; XI-10-5-7. వివేకచూడామణి 33, 37, 38 మొదలగునవి చూడనగును.

## ఎల్లరును గురుపదవికిఁ దగరు

శ్లో. 'సిద్ధం సత్సంప్రదాయే స్థిరధియమనఘం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం సత్వస్థం సత్యవాచం సమయనియతయా సాధు వృత్త్యా సమేతమ్। దంభాసూయాదిముక్తం జితవిషయగణం దీర్ఘబంధుం దయాళుం స్ఖాలిత్యే శాసితారం స్వపరహితపరం దేశికం భూష్ణురీప్సేత్ ॥ అజ్ఞానధ్వాంతరోధాదఘపరిహరణా, దాత్మసామ్యావహత్వాత్ జన్మప్రధ్వంసి జన్మప్రదగరిమతయా దివ్యదృష్టిప్రభావాత్। నిష్ప్రత్యూహానృశంస్యా దనియతరసతయా నిత్యశేషిత్వయోగాదాచార్యః సద్భిరప్రత్యుపకరణధియా దేవవత్ స్యాదుపాస్యః' అని గురుగుణగణంబులను వేదాంతదేశికులవారు బహు రమ్యంబుగా వర్ణించిరి. అంతటివానినే గురువుగా గ్రహించి సేవింపవగును.

మహాత్ముల కృపయో భగవదనుగ్రహలేశమో ముఖ్యమని సూత్రమునందుఁ గలదు. మహాత్ములు సర్వేంద్రియంబులను భగవంతునకు సమర్పించి స్వేచ్ఛారహితులై భగవత్సంకల్పంబులు నెఱవేఱుటకు సాధనమాత్రులై యుందురు. కావున స్వతంత్రించి యనుగ్రహించు తలంపుగాని శక్తిగాని వారికిఁ గలుగదు. వారి యనుగ్రహంబు భగవదిచ్ఛానుసారంబుగా లోకమునకుఁ గలుగుచుండును. అనఁగా దైవానుగ్రహమే మహాత్ముల మూలకంబున సంప్రాప్తమగునని సూత్ర తాత్పర్యము.

భగవంతుఁడు కృపాసముద్రుఁడు. ఆ సముద్రమందలి వాని కృపాతరంగంబులు వివిధగతుల వర్తించును. ఆప్రళయాంతము సంసారమందే పడి దరిగానక పరితపించు జీవులకు నుంత విరతి గలిగించుటకై లోకసంహారంబొనర్చుటయు, ఆ జీవులకు నుత్తమగతిప్రాప్తికై పునరవకాశము గల్గు నిమిత్తము మరల లోకంబును సృష్టించుటయు, ఆ జీవులకుఁ దత్త్వబోధకలుగుటకై బ్రహ్మముఖంబునను ఋషీశ్వరుల ముఖంబులను వేదోపనిషత్తులను బ్రతిపాదించుటయు, అది చాలనినాఁడు తాను స్వయముగా నవతరించి జీవులతోఁ గలసి మెలసి వారికిఁగల యంతరాయంబుల నుడిపి వారిబుద్ధి నాకర్షించి యుత్తమమార్గమును స్వచారిత్రపూర్వకంబుగా లోకంబునకు బోధించుటయు, పూర్వదుష్కర్మఫలవాసనల నశింపఁజేయుమహాశక్తిని నిరంతరధ్యానంబునకుఁదెచ్చుటయుఁ, దన్ను ధ్యానించువారికి బుద్ధియోగంబును గరుణించుటయు, ఆర్తులను రక్షించుటయు మున్నగునవియెల్ల భగవదనుగ్రహ

విశేషము లేగదా. ఎవరికర్మంబును వారనుభవించి తీర వలయునని కర్మగతికి దుర్భేద్యనిబంధనంబుఁ గావించి ప్రతి జీవుఁడు తనకుఁ దానే యుత్తరించు స్వాతంత్ర్యంబు నొసఁ గూర్చుట యనుగ్రహవిశేషమేగదా. దుర్మార్గము ను ద్రొక్కినవారిని మంచిదారికిఁ ద్రిప్పుటకై బహువిధ సంసార క్లేశంబులను వారికిఁ గూర్చుట యనుగ్రహమేగదా. సృష్టి యందలి ప్రతికార్యము భగవదనుగ్రహరూపమే యని భక్తి పూర్ణహృదయంబులకుఁ దోఁచుచుండును. ఇంతదూరము పోనేల? ఇహాముత్ర వైరాగ్యమును ముముక్షుత్వము నివి రెండు ప్రతిజీవుని యంతరంగంబునందుఁ గొంచెమో గొప్పయో నిరంతరముఁ గదలియాడుచుండును. భగవంతుఁ డంత ర్యామియై యట్లు ప్రబోధించుట వాని యనుగ్రహముగాక మఱియేమి? భగవదనుగ్రహంబునకు నంతకన్న నిర్వివాద ప్రత్యక్షనిదర్శనము గలదా? కావుననేగదా 'ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' అని భగవానుఁడు తెలిపెను.

భగవంతుఁడుదక్క మఱియొక రక్షకుఁడును, వాని యనుగ్రహముదక్క మఱియొకరక్షణసాధనంబును గలుగవు. ఆర్తులొండె, అర్థార్థులొండె, ముముక్షువులొండె భగవంతు నాశ్రయించి వాని యనుగ్రహంబునకుఁ బాత్రులు గావల యును. ఈ రహస్యము లోకప్రబోధనార్థము అవధూత చరిత్రరూపంబున భాగవతము నవమస్కంధములోఁ జెప్పు చున్నది. ఇతరభక్తుల జీవితంబులుగూడ నయ్యర్థమునే బోధించుచున్నవి. ఇట్టి ప్రబోధము మర్త్యులముఖంబుననేగాక

ప్రకృతివిలాసంబుల రూపంబునఁగూడ భగవంతుఁడు చేయుచున్నాఁడు. ఆ సంగతి గ్రహించి తగువిధంబున వర్తించువారు ఫలమును దప్పక పడయుచున్నారు.

ఈ బోధ యెప్పుడు గ్రాహ్యమగునందురా? ఎప్పుడార్తిగలుగునో యప్పుడది గ్రాహ్యమగును. ఆర్తులను వెదకికొని బోధకులు వత్తురు. ఆర్తితోడ హృదయక్షేత్రము బీజారోపణంబునకు సిద్ధమగును. అప్పుడు విత్తినయెడల నది చక్కఁగా నంకురించి మొలచి పెరిఁగి ఫలమిచ్చును. ఆర్తిలేని హృదయమందెంత శక్తివంతమైన బోధారూపబీజమును విత్తినను వృద్ధిచెందదు. ఇదేభావంబును క్రీస్తుకూడఁ దెలిపెను. లోకానుభవము నట్టిదే యైయున్నది.

బోధకుఁగాఁ బరసాహాయ్యం బవసరమా? అని ప్రశ్నింపవచ్చును. బోధకుఁడు నిరంతరము హృదయాంతరమున నిల్చి బోధచేయుచునేయున్నాఁడు. వెలువా రక్కఱ లేదు. ఆ బోధను గ్రహింపనోర్తురేని నదియే చాలును. దానిని విని గ్రహించు శక్తిసామర్థ్యంబుల నెవనికి వాఁడే సంపాదించుకొనవలయును. అట్టి శక్తిని స్వయంకృషివలన సంపాదించుకొనలేనినాఁడు అన్యుల సాహాయ్యం బపేక్షితం బగును. ఇదేభావంబును శ్రీ పరమహంసగారు తెలిపిరి. అట్టితఱిఁ దోడ్పడువాఁడు అల్పుఁడైనను బూజ్యుఁడేయగును. వ్యక్తిని బూజించుటలేదు; ఆ వ్యక్తిముఖంబున నందినట్టి భగవదనుగ్రహంబును బూజించుచున్నారు. కావున అల్పాధిక వివక్ష చేయరాదు.

బోధను విన్నంతనే యనుష్ఠింపరాదు. అది శాస్త్ర సమ్మతమో కాదో, ఆచార్యసంప్రదాయమో కాదో విచారింపవలయును. 'శాస్త్రం వినాపి సంబోద్ధుం గురవోఽపి న శక్నుయుః' అని యోగకుండల్యుపనిషత్తు హెచ్చరించుచున్నది. ఇది ముఖ్యముగా రాజయోగాభ్యాసులందు అన్వయించును. బోధకునితోఁ జక్కఁగాఁ దర్కింపవలయును. అట్లు తర్కించినను వానిబోధలు శాస్త్రధర్మవిరుద్ధంబులని తోఁచెనేని, వానింగూర్చి మరల మరలఁ బెఱచోట్ల విమర్శింపవలయును. తృప్తియగువఱకు వాని నాచరింపవలదు. శ్రీ భగవానుఁడు అర్జునునకు శాస్త్రమెల్ల నుపదేశించి 'అర్జునా! చెప్పఁదగినదెల్లఁ జెప్పితిని. నా చెప్పినదానిని జక్కఁగా విమర్శించి నీ యిచ్చవచ్చినట్లు చేయుము' అనెను. భగవంతుఁడే తనవాక్యమును విమర్శించి గ్రహింపుమనుచుండఁగా నన్యుల సంగతి చెప్పనేల?

గురువు విషయంబున జాతి లింగ వయో వివక్ష చేయరాదు.

శ్లో. 'జాగ్రత్స్వప్న సుషుప్తిషు
స్ఫుటతరా యా సంవిదుజ్జృంభతే,
యా బ్రహ్మాది పిపీలికాంత
తనుషు ప్రోతా జగత్సాక్షిణీ,
సైవాహం నచ దృశ్యవస్త్వితి
దృఢప్రజ్ఞాస్తి యస్యాపి చేత్,
చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు
గురురిత్యేషా మనీషా మమ ॥

అని శంకరభగవత్పాదులవారు మనీషాపంచకంబులోఁ జెప్పినట్లుగా, ఎవనికి అట్టి అనుభూతిగలదో వాఁడు మాలడైననేమి? బ్రాహ్మణుఁడైననేమి? అతఁడు తప్పక గురుపదవికి నెంతయు నర్హుఁడగును.

మహాత్ములు వివిధగర్భంబుల జనింతురనియు, వారి జనన జాత్యాదులు వివక్షణీయంబులు గావనియు, బ్రహ్మసాక్షాత్కారంబు నందినవారికిఁ గులాదులు గలవా? అనియు భరద్వాజ పరిక్షీతమందుఁ జెప్పఁబడెను. అదే భావంబును మనువుగూడ నంగీకరించెను. దత్తాత్రేయుఁడు పింగళయను వేశ్య నుపగురువుగా గ్రహించుటయు, రామానుజాచార్యులు కంచిపూర్ణుఁ డనువానివలన నుపదేశము పడయుటకై సర్వ ప్రయత్నములు చేయుటయు, నమ్మాళ్వారు, తిరుప్పాణాళ్వారు మున్నగువారి నవతారమూర్తులుగా భావించి పూజించుటయు, నింక నిట్టివెన్నో నిదర్శనంబులు గలవు. కావున గురువుల విషయమై కులగోత్రాది విచారం బవసరములేదు.

గురువొక్కరుగానే యుండవలయునా? పెక్కురుండ వచ్చునా యని మఱియొక శంక గలదు. 'నైకస్మాత్ గురోర్జ్ఞానం సుస్థిరం స్యాత్ సుపుష్కలమ్' అని (భాగవతము ఏకాదశస్కంధము 9-31) లోఁ గలదు. అనఁగా నొక్క గురువువలనఁ బడసిన జ్ఞానము పుష్కలమును సుస్థిరమును గాదని తాత్పర్యము. శుకమహర్షి వానితండ్రియైన వ్యాసమహర్షివలనను, జనకమహారాజువలనను జ్ఞానమునుబడసెను.

శ్రీ రామానుజాచార్యులు యాదవప్రకాశ, మహాపూర్ణ, గోష్ఠిపూర్ణ, ఆరేయాన్, మాలాధర, శ్రీశైలపూర్ణులను వారివలన వేదాంత, పంచసంస్కార, తిరుమంత్ర, చరమో పాయ, తిరువాయిమొళ్ళి, రామాయణంబులను క్రమముగా గ్రహించియు, యమునాచార్యులవారినే పరమగురువుగా భావించెను. శ్రీరామకృష్ణపరమహంసగారుగూడ పెక్కుర వలన వివిధసాధనక్రమంబులను నేర్చియుఁ బరాశక్తియే తన పరమగురువుగా నెంచెను. అవధూత తా నిరువదియార్గురు గురువులను సేవించి పరిపూర్ణజ్ఞానంబును బడసితినని యదు రాజుతోఁ జెప్పినట్లు భాగవతము వివరించుచున్నది. గుణ మెందున్నను గ్రహించి పరిపూర్ణతనొందుట తప్పుగాదు. ఏకగురుభక్తి యను వ్రతంబునుబూని యన్యులవలన రాఁదగిన జ్ఞానంబును నిరాకరించుట మౌఢ్యమగును. గురు జన నిరాదరణంబు భగవన్నిరాదరణంబే యగును.



సూ. మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ. 39

మహాత్ముల సాంగత్యము దుర్లభము, అగమ్యము మఱియు అమోఘము.

నిక్కమైన జ్ఞానులు మిక్కిలి యరుదు. 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే। యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥' (గీ. 7-3.) శాస్త్రీయజ్ఞాన మును సంపాదించుటయే దుర్లభము. అట్లు సంపాదించిన

వారిలో వేయింటిలో నెవనికో యొక్కనికి అనేకజన్మకృత సుకృత సమాసాదిత నిత్యానిత్యవస్తువివేకముండును. అట్టి వివేకమున్నను వారిలో నెవఁడో యొకఁడు మాత్రమే సత్వ శుద్ధిమూలకజ్ఞానోత్పత్తికి యత్నించును. అట్లు యత్నించిన వారిలో నెవనికో యొకనికి మాత్రమే శ్రవణ మనన నిధి ధ్యాసనపరిపాకాంతమై భగవత్సాక్షాత్కారము సిద్ధించును. కావున సత్యజ్ఞానముగలవారెంత దుర్లభులో యూహింపనగును.

అట్టి మహాత్ము లెందైన నున్నను వారట్టివారని గుర్తించుటయే మహాకష్టము. ఏలయందురా? వారు నిరాడంబరమూర్తులుగా నుందురు. అంతటి మాహాత్మ్యంబు వారికిఁ గలదని బాహ్యదృష్టికి గోచరింపదు. వారి తత్త్వంబును గ్రహించు శక్తిగలవారికిమాత్రమే యా మహాత్ముల యాథార్థ్యము బోధపడును. అట్టివా రెందేనియు నుండుట తెలిసినను వారిని సమీపించుటకు దేశకాలాద్యంతరాయంబులు పెక్కు గలుగవచ్చును. 'యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ । తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః॥' అని గీతలోఁజెప్పినట్లుగా, పుణ్యవిశేషంబునఁ బాపంబులెల్ల నశించి ద్వంద్వమోహంబులు విడిచిన వారుగాని సర్వపరిత్యాగ మొనర్చి యంతరాయంబులఁ ద్రోచివైచి యట్టి మహాత్ములను జేరనేరరు. ఒకవేళ సాహసించి పోయినను మహాత్ములు వెనువెంటనే సమీపించినవారినెల్ల గ్రహింపరు. ఎవనిపై భగవదనుగ్రహము కల్గునో యట్టి వానినే మహాత్ములు గ్రహించి యుపదేశింతురు. వారి

యుపదేశవిధానంబు శిష్యునకు నగమ్యముగానేయుండును. స్పర్శమాత్రంబునం గొందఱను, దృష్టిమాత్రంబునం గొందఱను, వారు పునీతులనుగాం జేయుటగలదు. ఎవనియందేది యుపకరించునో వారికే యెఱుక; పరులకు దురూహ్యము.

మహాత్ముల సందర్శనోపదేశాది మహాభాగ్యం బెన్నండును వృథపోదు. సూదంటురాయి యినుపముక్కనువలె మహాత్ముల యనుగ్రహము భక్తుల చిత్తంబు నాకర్షించి క్రమక్రమంబుగా నున్నతదశకుం గొనిపోయి సాక్షాత్కార సిద్ధిని గూర్చును. భక్తులయందలి యీ పరిణామము వారి వారి మనశ్శుద్ధినిబట్టి యప్పుడో కాలాంతరముననో గల్గుచుండును.



సూ. లభ్యతేఽపి తత్కృపయైవ. 40

మహాత్ముల సాంగత్యం బంతదుర్లభమైనను భగవదనుగ్రహము గల్గినచో నది తప్పక సిద్ధించును.

అట్టి దుర్లభులు లభింతురా? అని నిరాశ చెందనక్కఱ లేదు. పరిపక్వచిత్తులయొద్దకు మహాత్ములను స్వయముగా భగవానుఁడు నడిపించును. మహాత్ములు తలవనితలంపుగా వచ్చి యుపదేశించి పోవుటకుం జారిత్రక నిదర్శనంబు లెన్నో గలవు. భగవదనుగ్రహమే యట్లు చేయును. బద్ధులకు ముక్తినిం బ్రతిపాదించునట్టి యీ భగవచ్ఛక్తిని విద్య

యనియు, మాయ యనియు, గురుశక్తి యనియు, నానావిధం బుల గణింతురు.

విద్యాం పరాం కతిచిదంబర మంబ కేచిత్ ఆనంద మేవ కతిచిత్ కతిచిచ్చమాయామ్। త్వాం విశ్వమాహుర పరే వయమామనామ సాక్షాదపార కరుణాం గురుమూర్తి మేవ॥ (అంబాస్తుతి 27).

అంతర్యామియైన యీ శక్తి శిష్యుని గురుజనాన్వేష ణంబునకును, గురువును శిష్యజనాన్వేషణంబునకునుఁ బ్రో త్సాహపఱచుచుండును. అది వారిని నిలువనీయదు. ఈ శక్తి ప్రభావంబున గురుశిష్యు లెచ్చటెచ్చటనోయుండి యొకరి నొకరు వెదకికొనివచ్చి సమావేశమగుదురు. ఎప్పుడు శిష్యుని పుణ్యవిశేషము పరిపక్వమగునో యప్పుడీ విధానము మహాచిత్రగతి జరుగుచుండును. భగవల్లీలలు గహనం బులు గదా.



## సూ. తస్మిం స్తజ్జనే భేదాభావాత్.　　41

భగవంతునకును వాని భక్తులకు నెట్టి భేదములేదు గావున భగ వంతుఁ డట్లు చేయునని తాత్పర్యము.

భగవంతుఁడు చరాచర సమస్త సృష్టియందు నంత ర్యామియై యుండును. పుణ్యపాపంబుల వివక్ష వానికిఁ గలుగదు. వాని యనుగ్రహము ఎల్లరయందు ఏకరీతిగానే యుండును. దాని ప్రవాహంబునకు వారివారి యహంకా

రాదు లబ్ధుపడుచుండును. అట్టి యడ్డుపాట్లను దొలఁగించి
నచో అనుగ్రహము యథాగతి నందఱకుఁ జెందును. అను
గ్రహ ప్రవాహంబునకు నగునట్టి యడ్డంకులను 'నామాప
రాధము' (భగవన్నామములను నిందించుట) లని వైష్ణవు
లందరు. వానినే సూతసంహితాకారుఁడు 'జ్ఞానానుత్పత్తి
కారణంబు' లనుచున్నాఁడు.



సూ. తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతామ్. 42

35, 36, 37 సూత్రములలోఁ జెప్పఁబడినట్టియు భగవంతునెడఁ
బ్రేమయనునది స్థిరమగుటకు నుపయుక్తములైనట్టియు సాధనంబులను
సాధింపవలయును.

భగవద్భక్తికి సానుకూలంబుల ననుష్ఠించుట ప్రతికూ
లంబులను వదలుట—ఇది సాధకుఁడు త్రిశుద్ధిగాఁ గావించినచో
భగవదనుగ్రహంబు మహాత్ముల పూర్వకంబునఁ గల్గునని 35,
36, 37 సూత్రములలోఁ జెప్పఁబడెను. దైవానుగ్రహ
మెన్నఁడు నుండనే యున్నది. అది మనవఱకు వ్యాపించు
టకు నడుమనుండు నడ్డంకులు తొలంగవలయును. ఆ యడ్డం
కులు మనము మన పూర్వ దుష్కృతాదులవలనఁ దెచ్చి
పెట్టికొన్నవేగాని దైవము తెచ్చిపెట్టినవిగావు. కావున
ఎవనికి వాఁడే వానినిఁ దొలఁగింపవలయును. అడ్డంకులు
దొలఁగుట యెట్లందురా? సర్వాత్మసమర్పణంబున నవి
తొలంగును. ఆత్మసమర్పణంబు పరమభక్తివలనఁ గలుగునే
గాని మఱి యొంటఁగలుగదు. ఆ భక్తియున్నచో భగవ

తత్త్వము బోధపడినప్పుడు గలుగును. ఆబోధయన్ననో సంశయ విపర్యయంబులు నశించినప్పుడు బుద్ధిస్థమగును. చిత్తశుద్ధివలన నవి నశించును. చిత్తశుద్ధి సాధనాభ్యాస ఫలంబుగాఁ జేకూరును.

ఆత్మసమర్పణంబునకుఁ బూర్వము భగవదనుగ్రహ వీక్షణముగాని మహాత్ముల సందర్శనాదులుగాని గలుగవు. అనుగ్రహము ముఖ్యము; తక్కినవి యానుషంగికంబులు.

ఆత్మసమర్పణంబనఁగా నెట్టిదందురా? అహంకార మమకారంబులను వదలి నీవే గతియని భగవంతుని శరణొల్లి తదనుగ్రహార్థము వేచియుండుట ఆత్మసమర్పణంబగును. ఈ యహంకార మమకారములే బంధనములు. వానికి లోఁబడినవాఁడే బద్ధజీవుఁడు. సాధనక్రమంబున వీనిని నశింపఁ జేయవలయును. ఆత్మసమర్పణంబునే ప్రపత్తియనియును, న్యాసయోగంబనియును వచింతురు. సాధకుఁ డెట్టివాఁడుగా నుండనగునో యెఱుంగఁగోరుదురేని భాగవతము ఏకాదశ స్కంధము. 8-9 లలో వివరించిన దానిని జూడనగును.



4౩:

## సూ. దుస్సంగః సర్వథైవ త్యాజ్యః.

దుస్సాంగత్యము నెల్లవిధములఁ ద్యజింపవలయును.

భగవంతుఁడు సర్వాంతర్యామి యని చెప్పినప్పుడు దుష్టులయందుఁగూడ భగవదంశ ముండుననుట నిర్వివాదాంశము. దుష్టులను ద్యజింపవలయునన్నప్పుడు వారియందుండు

భగవంతునిఁగూడఁ ద్యజించుటే యగుఁగదాయని శంకింప వచ్చును. భగవంతుఁ డెల్లరయందు నుండుననుట నిర్వివాదాంశము. అంతమాత్రాననే యెల్లరును సాంగత్యంబునకు యోగ్యులుగారు. దేనిని ద్యజించుచున్నారు? భగవంతునిఁ ద్యజించుటలేదు. భగవంతుఁడు త్యాజ్యగ్రహణంబులకు నతీతుఁడు. ఆ భగవంతునకుఁ దత్కాలమందు నిలయప్రాయంబులుగానున్న దుష్టోపాధులను ద్యజించుచున్నారు. వానిని మాత్రము త్యజింపనేల? అని యందురా? సాధనావస్థయందు సాధకుని తత్త్వము పరిణామావస్థలో నుండును. అట్టితఱిఁ దత్పరిణామవిధానంబునకు నడ్డుకలుగరాదు. సాధకుఁడు దేనివృద్ధినిగోరి సాధనముచేయుచున్నాఁడో దానికి విరోధియైన తత్త్వమునుండి యతఁడు దూరముగా నుండవలయును. అట్లుచేయుట స్వరక్షణార్థమేగాని ద్వేషార్థము గాదు. స్పర్శాదిదోషంబు లీకోటిలోఁ జేరును. ఇట్టి విషయంబులందెల్లఁ దనుభేదమేగాని తనుమద్భేదముగాదు.

ఈ విషయమై శ్రీ పరమహంసగారిట్లు నుడివిరి: 'నారములనఁగా నీరు. నారాయణసంబంధములు నారములు. అనఁగా జలము భగవద్రూపంబులలో నొకటియని భావము. నీరు అన్యపదార్థసమ్మేళనంబున నానావిధములుగా నుండును. జలము భగవద్రూపమే యని, ఉప్పునీటిని ద్రాగుదురా? పాదప్రక్షాళనంబునకు నొకపాటినీరు తగును. అవి స్నానార్థముపయోగించునా? పానార్థము దగునా? ఆ నీటిలోని మాలిన్యము తొలఁగినప్పుడు అవి పానాదులకు నుపయోగపడు

చున్నవిగదా. కావున సాధకుఁడు ప్రతికూల వాతావరణంబు నుపేక్షించినచోఁ దత్సంసర్గదోషము తప్పదు.

'దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయ జగత్' (సమస్త జగత్తు బ్రహ్మమయమని జ్ఞానదృష్టితోఁ జూడవలయును) అని యుపనిషత్తులు చెప్పుచుండఁగా జగత్తులోని కొన్ని గ్రాహ్యములును గొన్ని త్యాజ్యములు నగునా యని యడుగవచ్చును. అట్టి దృష్టి సిద్ధావస్థయందుఁ గల్గును. అగ్నికిఁ జెదలంటనట్లు సిద్ధులకు నేదియు నంటదు. సాధనావస్థయందు 'సర్వము బ్రహ్మమే' యని కన్నుమూసి వర్తింపరాదు. ఏదేది తుచ్ఛభావంబుల నుద్దీపింపఁజేయునో దాని నెల్లఁ ద్యజింపవలయును.

మనస్సును జలింపఁజేయుటయందుఁ గామినీకాంచనంబులకు మహాశక్తి గలదు. ఆ రెంటిలోఁ గామినీశక్తి యధికము. ఒక్కొక్కప్పుడు స్త్రీ పురుషులు కలసి మెలసి పూజాదులు సలుపుట సంభవించును. అట్టియెడ వారి మనస్సులు చలింపకుండుటకై స్త్రీలు పురుషులను శివరామ రూపంబులుగాను, పురుషులు స్త్రీలను పార్వతీసీతారూపంబులుగాను భావింపవలసినదని తంత్రశాస్త్రంబులు ఇట్టి ఉపాయంబును బోధించుచున్నవి.

సర్వము బ్రహ్మమనుబోధ అపక్వచిత్తులకు బోధించిన చో వారు అపవేదాంతమార్గము ద్రొక్కుదురు. ఇందులకు నిదర్శనము వామాచారమందుఁ జూడనగును. 'శిష్యునకు శమదమాదిసంపత్తి కలదా లేదా యని శోధించి, అతఁడు

తత్సంపత్తికలవాఁడగునేని వానికి 'సర్వమిదంబ్రహ్మ' మని బోధింపనగును. అట్టిసంపత్తి లేనివానికి నట్టిబోధ చేసిన-చో గురుశిష్యు లుభయులు మహానరకజాలమందుఁ బడుదురు. ఎవనిబుద్ధి ప్రబుద్ధమో, ఎవనికి భోగేచ్ఛ నశించెనో, ఎవనికిఁ గాంక్ష గలుగదో వానికి అవిద్యామలములు గలుగవు. అట్టి వానికి మాత్రమే 'సర్వమిదం ఖలుబ్రహ్మ' అని గురువుప దేశింపఁదగునని మహోపనిషత్తు చెప్పుచున్నది.



సూ. కామక్రోధమోహస్మృతిభ్రంశ బుద్ధినాశ
కారణత్వాత్. 44

దుస్సాంగత్యంబును ద్యజింపుమని పై సూత్రము చెప్పెను. ఎట్టిది దుస్సాంగత్యమగునని శంకింపవచ్చును. ఏది కామమును గ్రోధమును మోహమును బ్రమాదమును గలిగించునో వానినెల్లఁ ద్యజింపవలయునని యీ సూత్రము వివరించుచున్నది. వానిని ద్యజింపకున్న నేమగునందురా? బుద్ధినాశముగలుగును. ఈ విషయమై గీత 11-వ అధ్యాయము 62, 63 శ్లోకంబులఁ జూడనగును.

శ్లో. 'విషయాభిముఖం దృష్ట్వా
విద్వాంసమపి విస్మృతిః ।
విక్షేపయతి ధీదోషైః
యోషా జారమివ ప్రియమ్ ॥' —వివేక, 323.

శ్లో. 'లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమీషద్
బహిర్ముఖం సన్నిపతే త్తత స్తతః।
ప్రమాదతః ప్రచ్యుత కేళికందుకః
సోపానపంక్తౌ పతితో యథా తథా॥'

—వివేక. 325.

అని ప్రమాదతత్త్వంబును శ్రీ శంకరాచార్యులు వివరించిరి. కావున బుద్ధిజాగ్రత యెంతవలయునో యూహింపనగును.



## సూ. తరంగాయితా అపీమే సంగాత్ సముద్రాయంతే. 45

కామాదులు ప్రప్రథమంబున లవమాత్రంబులుగా నుండినను, చిట్టియలలు ఒండొంటిఁ గలసి సముద్రమైనట్లుగా, సంగదోషంబున మర్జయంబులగును.

కామాదు లంకురించినంతనే వానిని నుడిచివేయ సాధ్యమగును. దుస్సాంగత్యబలము వానికిఁ గలిగెనేని గోరంతలు కొండంతలగును. కావున సాధకుఁడు కామాదులను బుట్టినప్పుడే త్రుంచివైచుచుండవలయును.



సూ. కస్తరతి కస్తరతి మాయామ్? యః సంగం త్యజతి,
యో మహానుభావం సేవతే, నిర్మమో భవతి. 46

ఈ మాయాసముద్రంబు నెవఁడు దాఁటఁగలఁడు? ఎవఁడు సంగమును త్యజించునో, ఎవఁడు మహానుభావులను సేవించునో, ఎవఁడు మమకారము లేనివాఁడగునో వాఁడు మాయాసముద్రమును దాఁటును.

పై యెనిమిదిసూత్రములందుఁ జెప్పిన సాధనముల వలన మొట్టమొదట భగవద్భక్తి కలుగుననియుఁ దదనంతరము మోక్షమనియు (శ్రీ) నారదమహర్షి గారి భావమైనట్లు 46–49 సూత్రములవలనఁ దెలియుచున్నది. మోక్షము గలుగకుండుటకు భక్తిలేమి కారణంబగునేగాని అజ్ఞానము కారణము గాఁజాలదని 98 వ సూత్రములో మహర్షిగారే ప్రతిపాదించిరి.

శ్లో. 'భక్తిర్జనిత్రీ జ్ఞానస్య భక్తిర్మోక్ష ప్రదాయినీ,
భక్తిహీనేన యత్కించి త్కృతం సర్వమసత్సమమ్.

శ్లో. తస్మాత్ త్వద్భక్తిహీనానాం కల్పకోటి శతైరపి
న ముక్తిశంకా విజ్ఞానశంకా నైవ సుఖం తథా.

అని యధ్యాత్మరామాయణము. (జ్ఞానమునకును మోక్షమునకును భక్తి తల్లివంటిదగును. భక్తి లేనిది వ్యర్థము. కావున భక్తిహీనులకు వేయికోట్ల కల్పంబులకుఁగూడ ముక్తిగాని విజ్ఞానముగాని సుఖముగాని శంకామాత్రముగూడఁ గలుగదు.)

అట్లని జ్ఞానధర్మంబుల నుపేక్షింపుమనుట గాదు. వానిని భక్తికి ముఖ్యాంగంబులుగా గ్రహించి సాధనము చేయవలయును. నానామతంబుల సాధనక్రమంబులు పరీక్షించినచో, సాధనంబు లన్నింటికి నెంతో సామ్యము గాన్పించును. ఒక్కొక్క రొక్కొక్కదానికిఁ బ్రాముఖ్యము నిత్తురు. భేదము తావన్మాత్రమే. అంతమాత్రాననే యొకటి యుత్తమంబనియు వేఱొకటి యధమంబనియుఁ జెప్పుటకు గాని, ఒకటిముందు వేఱొకటి వెనుకయనుటకుఁగాని యవకాశము లేదు. భక్తిజ్ఞానకర్మంబులు మూఁడు నొండొంటితోఁ గలసియే యుండును. ఎవరి మనఃపక్వము దేనికిఁ జాలునో దాని నతఁ డనుష్ఠించును. ఒకదాని ననుష్ఠించి నప్పుడు తక్కినవి రెండు ననుస్యూతములుగానే యుండును.

భక్తి యెట్లు చేయవలయునను విషయంబున భక్తిమతప్రాపకులందు భేదములుగలవు. జపము, పూజ, కీర్తనము, ప్రణామము మున్నగునవి సాధకుని గమ్యస్థానము చేర్చునని కొంద అందురు. స్వధర్మాచరణము, జ్ఞానమిశ్రభక్తి, ప్రేమభక్తి, దాస్యప్రేమ, సఖ్యప్రేమ, వాత్సల్యప్రేమ, కాంతాభావము, రాధాప్రేమ ఇవన్నియు భక్తికి నంగములే యగునని శ్రీచైతన్యస్వామివారి మతము. ఆఁకలియున్నంతవఱకే తిన్నదిరుచించునట్లు భక్తునిహృదయమందుఁ బ్రేమయున్నంత కాలమే నానోపచారకృత పూజాదులు సుఖదాయకంబులగునని భక్తిపద్యావళి పల్కుచున్నది. సత్పురుషుల కృప, మహాత్ములసేవ, శ్రద్ధ, గురుశుశ్రూష, భగవద్భజనమందు

లాలస, నిష్ఠ, రుచి, ఆసక్తి, రతి, ప్రేమదర్శనము, హరి మాధుర్యానుభవము— ఇవి భక్తిలోఁ జేరునని మరియొక మతము. మహాత్ములను సేవించి వారిదయకుఁ బాత్రులగుట, వారియందును వారుపదేశించు ధర్మంబులందును శ్రద్ధగలిగి యుండుట, హరిగుణంబులనువినుట, వీనివలన భగవద్రతి యంకురించుననియు, అది స్వరూపసంధానంబునకు లాగు ననియు, దానితోడ భగవత్ప్రేమ వృద్ధియగుననియు, దాని తోడ భగవత్స్ఫురణంబును భగవద్ధర్మనిష్ఠయుఁ, దద్గుణాను భవమును దత్ఫలంబుగాఁ గాఢప్రేమయుఁ గలుగుననియు, ఇవియెల్ల భక్తిభూమికలనియు భక్తిరసాయనగ్రంథము. శ్రద్ధ, సంగము, భజనక్రియ, అనర్థ నివృత్తి, నిష్ఠారుచి, ఆసక్తి, భావము, ప్రేమ—ఇవి భక్తి భూమికలని భక్తిరసా మృతసింధువు. వంగదేశ వైష్ణవ సాంప్రదాయము ప్రకా రము పూర్వరాగము, మిలనము, సంభోగము, విరహము, భావ సమ్మేళనము అనునవి భక్తి భూమికలుగా నున్నవి. సుఖేచ్ఛ, విచారణ, తనుమానసిత్వము, సత్వాపత్తి, అసం సక్తి, పదార్థభావన, తురీయగ అనునవి యోగవాసిష్ట ప్రకా రమును వరాహోపనిషత్తు ప్రకారమును భక్తిభూమికలగును.

తన యజ్ఞానము నెఱింగి, లౌకిక వ్యవహారమును వదలి వేదాంతగ్రంథ శ్రవణాదులచేతను సత్సాంగత్యముచేతను సత్యమును తెలిసికొనుకోర్కి సుఖేచ్ఛయనియు, ఇంద్రి యార్థంబులపయి వైరాగ్యముచెంది ఋజువర్తనంబున నుండు టకై యత్నించుట విచారణయనియు, కాంక్షలేమింజేసి

మనస్సును నిర్విచారముగా నుంచుట తనుమానసికత్వ మనియు, ఆత్మారాముఁడై యుండుశక్తి సత్వాపత్తి యనియు, బాహ్యప్రపంచ పరిత్యాగము అసంసక్తియనియు, లోకమెల్ల అనిత్యము మిథ్యయని స్వానుభవసిద్ధమగుట పదార్థభావన యనియు, బ్రహ్మాద్వైతస్థితిలోనుండుట తురీయగ యనియు వచించిరి.

జైనమతప్రకారము భక్తిభూమికలు గుణస్థానములనఁ బడును. అవి పదునాల్గుగా వారు గణించిరి. మహాయాన బుద్ధమతప్రకారము భక్తిభూమికలు పదిగానున్నవి. వానిని బారమితములందురు. ఆ పదింటిని దాఁటినఁగాని బోధి సత్త్వుఁడుగాఁడని వారందురు. అన్యదేశీయ మతస్థాపకులు గూడ వారివారి దృష్టిప్రకారముగా భక్తిభూమికలను నిర్ణ యించిరి.

ఈ విషయమై నారదమహర్షిగారి మతమేమో విచా రింతము. సాధకుని మనస్సు నాకర్షించి సాధనమార్గంబు నుండి వాని నేదేది మరలించునో దానినెల్ల వర్జించుటతోడ మొదలుపెట్టి పదురెండు భూమికలను దాఁటిన తర్వాతఁ బరాభక్తి సిద్ధించుననియు, సంసారతరణంబునకు నదియే తారకమనియు మహర్షిగారి భావము. రోగి యపథ్యవస్తువుల నట్లు సాధకుఁడు వానిఁ గూడని దేశవాతావరణ వ్యవహారా హారంబులను త్యజించుటయు, దేహబలంబును గోరువాఁడు వస్తాదు నాశ్రయించి యతఁడు చెప్పినట్లు సాముచేయుటవలె సాధకుఁడు గురువు నాశ్రయించి వాని యుపదేశము ప్రకా

రము సాధనాభ్యాసము చేయుటయు ముఖ్యములు. గురువు సరియైనవాఁడగునేని శిష్యుఁడు వాని సర్వస్వమును దనంతటఁ దానే గురువునకు సమర్పించును. సర్వస్వము విక్రయించి బీదలకిచ్చి తనవెంట రమ్మని క్రీస్తువు తన యనుచరులకు బోధించెను. సంసారసాగరంబును దరించునప్పుడు దేహము మీఁద భారం బెంత తక్కువగా నుండిన నంత సులభముగా నుండును. భారం బట్లు తగ్గుటకు శిష్యుఁడు వాని సర్వస్వమును గురువుచేత నుంచుటయే పరమోపాయము. అట్లు సమర్పితమైనది భగవంతుని సొమ్ముగాని తనదిగాదను భావముతో గురువు దానినెల్ల భగవదర్థము వినియోగింప వలయును. ఎల్లభాగ్యములు బీదసాదల నెత్తుట మూఁగినవే యని టాల్‌స్ట్రాయ్‌గారు నుడివిరి.

ముక్తికి మహానుభావులసేవ యెంతయు ముఖ్యము. 'యథా ఖనిత్ ఖనిత్రేణ నరో వార్యధి గచ్ఛతి। తథా గురుగతాం విద్యాం శుశ్రూషురధిగచ్ఛతి ॥' నీరు వలయు నన్నచో గుద్దలితో బావి త్రవ్వవలసినట్లుగా, విద్య గావలయునన్నచో గురువును శుశ్రూషింపవలయునని మనువు వచించిరి. ముక్తిగోరువారికి మహాత్ములసేవ యన్నది ముక్తిద్వారమగుననియు, కాంతాసేవ యనునది తమోద్వారమనియు, ఎవరు సమాహితులో, శాంతాత్ములో, కోపరహితులో, సుహృదులును, సాధువులు నగుదురో. దారాపుత్రగృహభాగ్యాదులం దెవరికి మమకారము లేదో ఎవరు తమ ప్రేమను భాగ్యమును భగవదర్పణం బొనర్తురో యథాసంప్రాప్తముతో నెవరు తుష్టిచెందుదురో వారు మహాత్మ

లగుదురని (భాగవతము 5-5-2-3) ఆ మహాత్ములనే తత్త్వ ద్రష్టలని గీత చెప్పుచున్నది.



సూ. యో వివిక్తస్థానం సేవతే
యో లోకబంధమున్మూలయతి,
(యో) నిస్త్రైగుణ్యోభవతి
(యో) యోగక్షేమం త్యజతి. 47

ఏకాంత ప్రదేశముననుండుట, ముల్లోకములందలి సుఖాభిలాష లేకుండుట, మూడు గుణంబులకు వశుడుగాకుండుట, లేనిదానిని సంపాదించుట, దాని రక్షించుట అనెడి ఆశ లేకుండుట—ఈ స్థితి పరవైరాగ్యమగును.

సాధకుఁడట్లు విక్షేపకారకంబులను ద్యజించి బంధకంబులనెల్ల నిరసించి భగవత్కల్యాణరూపంబును వాని హృదయాంతరంబున నిల్పి తదేకబుద్ధితో ధ్యానింపవలయును. అట్టి నైరంతర్య ధ్యానంబునకు వివిక్తప్రదేశం బెంతయు నుపకరించును. అట్లు చేయుటవలన వాని యంతఃకరణమందలి యహంభావనాదులెల్ల నశించును; పరమవైరాగ్యము గలుగును. అప్పుడు వాని యహంకారోద్రేకంబెల్ల నశించియుండుటం జేసి గుణకార్యంబులకు నతఁడు బద్ధుఁడుకాఁడు. భ్రాంతియుగాదు. సత్త్వమునుగూడ దాఁటినవాఁడగును. ఈ స్థితినే పరవైరాగ్యమందురు.

ఆ స్థితిలోఁ గోరికలే యుదయింపవు. ఏలయందురా? కోరికలెల్ల గుణకార్యంబులు. అతఁడన్ననో గుణాతీతుఁడు.

గుణాతీతునియందు గుణంబులేమి చేయఁగలవు? ఎల్లవ్యవహారంబులు వదలినను దేహధారణార్థమైన వ్యవహారం బేనియు నుండవలదా యని శంకింపవచ్చును. ఆ తలంపు గూడ వానికిఁ గలుగదు? ఏలయందురా? అట్టివాని పోషణము తనమీఁదఁ బడుచున్నదని భగవంతుఁడే గీతలోఁ జెప్పెను. భగవంతుఁడు పోషకుఁడు కాఁగా నొండు చింత యేల? క్రీస్తువుగూడ నట్లే పల్కెను. అట్టివారి పోషణము దైవభారంబగునో కాదో యని శంకింతురేని (శ్రీ) పరమహంసగారి జీవితమే యీ శంకను వారించును.



సూ. యః కర్మఫలం త్యజతి, కర్మాణి సంన్యస్యతి,
తతో నిర్ద్వంద్వో భవతి. 48

ఎవఁడు కర్మఫలంబును వదలునో, ఎవఁడు స్వార్థమైన కర్మంబులను సన్న్యసించునో వాఁడు సుఖదుఃఖాది ద్వంద్వంబులకు నతీతుఁడగును.

ఎల్లర భరణపోషణంబులను భగవంతుఁడే సమకూర్చుచుండునను గీతావాక్యంబును 47 వ సూత్ర మను వదించెను. సంగతి యట్లుండఁగాఁ బోషణార్థము కర్మములఁ జేయనేల? అని శంకింపవచ్చును. దేహధారి యే దేనొకవిధమైన కర్మమును నిరంతరముఁ జేయుచుండును. ఎట్టి కర్మమును జేయక యిన్నకుండుట సాధ్యముగాదు. ఈ భావంబునే యీ క్రింది శ్లోకంబులు తెలుపుచున్నవి :

(1) సంభవంతి హి భద్రాణి విపరీతాని చానఘ ।
కారిణాం గుణసంగోఽస్తి దేహవాన్న హ్యకర్మకృత్ ॥
భాగ. 6-1-44.

(2) లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥
గీ. 3-3.

(3) న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే ॥
గీ. 18-11.

కర్మములు స్వాభావికంబులనియు, నైమిత్తికంబులనియు, సకామంబులనియు మూఁడువిధములు. స్నానపాన భోజనాదులు స్వాభావికంబులు. దేహమున్నంతకాలము అవి తప్పవు. వాని నాచరించుటవలన దోషమేమియు లేదు. స్వాభావిక కర్మంబులనే నిత్యములనియుఁ జెప్పుదురు. రోగమువచ్చినప్పు డౌషధసేవచేయుట మున్నగునవి నైమిత్తికంబులగును. నైమిత్తికంబులనే శాంతికర్మంబులనియు వచింతురు. ఈ కర్మంబులకు భావిభోగ్యఫలంబు గలుగదు. దానంజేసి యివియు దోషంబులుగావు.

సకామకర్మంబుల సంగతి యట్టిదిగాదు. భావిభోగ్య ఫలంబునుగోరి యవి చేయఁబడుచున్నవి. ఫలంబుదయించినప్పుడు దాని ననుభవింపక తీఱదు; అనుభవార్థము తగిన దేహము రావలయును. అది జన్మంబువలనఁ గలుగును.

దీనినే సంసారమందురు. సంసారశబ్దంబునకు ఎడ తెంపు లేక జరుగుచుండునది అని యర్థము. సంసారముతోడ సుఖ దుఃఖంబులు తప్పవు; అవి వచ్చునప్పు డనుభవింపక తీఱదు. కావున సుఖదుఃఖంబులు పోవలయునన్నచో, సంసారము పోవలయును. అది పోవలయునన్నచో సకామకర్మములు పోవలయును. సంసారమును సకామకర్మంబులు నొండొంటి నంటియుండును.

మొట్టమొదటనే నిష్కామకర్మయోగము సిద్ధింపదు. లోకమెల్లఁ దొలుదొల్త సకామబుద్ధితోనే కర్మము లాచ రించును. పూర్వవాసన లట్టి కర్మంబులకుఁ బ్రేరేపించు చుండును. కర్మములు సకామంబుగాఁ బ్రారంభములగు చున్నవి గావునను, వానిని వదలుశక్తి చాలదు గావునను, సాధకులు ఫలాభిసంధినైనను భగవదర్పితముచేయుచుండ వలయును. సూత్రమందలి 'ఫలత్యాగ' శబ్దము ఈ భావం బును సూచించుచున్నది.

అట్లు కొంత కాలము చేయుచుండఁగా, ఫలత్యాగబుద్ధి తనంతటఁ దానే నశించును. అప్పుడు నిష్కామకర్మయోగం బగును. అయిననుఁ గర్మంబునకు ఫలంబు కోరినను గోర కున్నను స్వతస్సిద్ధముగాఁ గలుగును. దాని నేమిచేయ వలయునందురా? ఆ శంక తీఱుటకై సూత్రమందలి 'సంన్యాస' శబ్దము ప్రయోగింపఁబడెను. సంన్యాసశబ్దమందు 'సమర్పణము, త్యాగము' ఈ రెండు భావంబు లిమిడి యున్నవి. నిష్కామకర్మయోగి వ్యవహారమెల్ల లోకోప

కార్యార్థమై యుండును. ఎప్పుడు కర్మఫలము లోకోపకారార్థ మగునో యప్పుడది భగవదర్పితమేయగును. ఏలయందురా? నిష్కామకర్మయోగిదృష్టిలో భగవద్వ్యతిరిక్తమే యుండదు. లోకమెల్ల భగవత్స్వరూపంబే యనియు, లోకార్థమగుట యనఁగా భగవదర్పితమగుటే యనియు వాని నిశ్చయము. మఱియు నతఁడెన్నఁడును స్వార్థబుద్ధితోఁ గర్మములు చేయరాదు. అట్టి కర్మములనే వదలవలయును. సకామకర్మాచరణమందు ఫలత్యాగంబును, ఇందు స్వార్థఫలరూపకర్మస్వరూపత్యాగంబును సూచితంబులు. ఈ రెంటికిఁ గల యీ భేదంబును గ్రహింపవలయును.

దేహమున్నంతకాలము కర్మము తప్పదు గావునఁ గర్మమును గర్మార్థమే చేయవలయును గాని ఫలాభిసంధితోఁ జేయరాదనుటను గీత 2 వ అధ్యాయము, 47 వ శ్లోకంబును, 18 వ అధ్యాయము, 9 మొదలగు శ్లోకంబులును బోధించుచున్నవి. నిష్కామకర్మయోగికి సుకృత దుష్కృతకర్మంబుల శుభాశుభఫలంబులుగాని, వానివలనఁ గలుగు సుఖదుఃఖంబులుగాని యంటవని గీత 2-56, 57; 9-28; 12-13-19; 18-24, 25 మున్నగు శ్లోకంబులు విస్పష్టంబుగాఁ బలుకుచున్నవి. దుష్కృతఫలంబుగూడ నంటదా యని శంకింపవలదు. నిష్కామకర్మయోగి వ్యవహారమెల్ల నీశ్వరేచ్ఛాధీనమైయుండును గావున వాని కర్మంబులు దుష్కృతంబులే గానేరవు. ఒకవేళ నవి బాహ్యదృష్టికి దుష్కృతంబులుగాఁ దోఁచినను, వానియందుఁ

కర్తృత్వభావంబు వానికి లేనందున నెట్టి ఫలంబును వాని నంటదు.

ప్రథమఖండమందు అహంకారము విశేషముగా నుండును గావున సంకల్ప ఫలాభిసంధులు రెండు నుండును; ద్వితీయఖండమందు అహంకారము భావమాత్రముగా నుండును గావునఁ దద్దశయందలి కర్మములు తావన్మాత్రాహంకారప్రేరితంబులై 'ఇది చేయుదునుగాక' అనెడి సంకల్పము కొంతవైన నుండును. ద్వితీయఖండంబున ఫలాభిసంధి యుండదు. తృతీయఖండంబున అహంకారముగాని సంకల్పముగాని రెండు నుండవు. ఈశ్వరేచ్ఛానుసారంబుగా వర్తనము జరుగుచుండును. భగవత్సమర్పణము సమగ్రంబుగా నుండుటయే యిందులకుఁ గారణము.

గుణాతీతుఁడనఁగా గుణములు వానియందు వ్యవహరింపవని తలంపవలదు. దేహమున్నంత కాలము గుణంబులును వాని కార్యంబులును జరుగుచునేయుండును. అనఁగా నవి వాని స్వభావధర్మంబులను జరుపుచుండును. గుణాతీతునకుఁ గర్తృత్వ భోక్తృత్వ భావంబులు మాత్రముండవు. ఎప్పుడు కర్తృత్వభావము లేదో యప్పుడే రజస్తమస్సులు ప్రోదిలేక చచ్చినట్లు పడియుండును, సత్త్వముగూడ శుద్ధసత్త్వమై యీశ్వరేచ్ఛకు వైచి ఁతదనుగుణంబుగా వర్తించును. అట్లు జరుగుటగూడ గుణాతీతుఁ డెఱుంగఁడు. కారణ మేమందురా? అతనిదృష్టి యా వంక నుండమియే కారణము.



సూ. (యో) వేదానపి సంన్యస్యతి ; కేవలమవి
చ్ఛిన్నానురాగం లభతే ॥　　　49

ఎవఁడు వేదనిర్దిష్టధర్మంబులనుగూడ సన్న్యసించునో యతఁడు నిర్మలమైనట్టియు ఎడతేపట్టియు ననురాగంబును భగవంతునియందుఁ బొందును.

వేదము కర్మకాండము, జ్ఞానకాండము అని రెండు భాగములు. కర్మములెల్ల జ్ఞానంబునకు సాధనంబులుగాఁ బ్రతిపాదింపఁబడెను. జ్ఞానోదయంబువఱకుఁ గర్మంబు లను ష్ఠేయములే యగును. అనంతరము వానివలన ఫలములేదు గావున వానిని వదలివేయవలయును. ఏఱుదాఁటుటకుఁ బడవ ఎంతవఱకు నుపయోగమో యంతవఱకే దాని నాశ్రయింతుడు. ఆవలిగట్టు చేరినతర్వాత పడవను వదలిపోవుదురే గాని వెంటఁ గొనిపోవరుగదా. అట్లే కర్మానుష్ఠానమని గ్రహింపవలయును. ఇదేభావంబును గీత 2-వ అధ్యాయము 42_45 శ్లోకములు బోధించును. భాగవతంబుగూడ నిదే భావంబును బలుచోట్లఁ జెప్పుచున్నది. శాస్త్రంబులెల్ల ననుభూతికి మార్గంబుల నుపదేశించుచున్నవనియు, అట్టి యనుభూతికి ననుకూలంబులైన శాస్త్రీయమార్గంబుల ననుష్ఠింపవలయుననియు, అందులకుఁ బ్రతికూలంబులను విసర్జింపవలయుననియుఁ దాత్పర్యము.

సాత్త్విక రాజసిక తామసిక సాధకులకు ముగ్గురకు వారివారికిఁ దగినట్లుగా మార్గంబులను శాస్త్రము చెప్పు

చున్నది. త్రివిధమైన యీ ముగ్గురు ఎవరికేది యుక్తమో దానినే శాస్త్రమునుండి గ్రహించి యాచరింపవలయును గాని ప్రతి వ్యక్తియు మూఁడు మార్గంబుల నాచరింపవలయు నని శాస్త్రము చెప్పదు. అది కలగూరగంప యగును.

ఎవనికి నేది యుక్తమో యదే వానికి స్వధర్మమగును. గీతలో 3-35; 18-47 మున్నగుచోట్ల స్వధర్మానుష్ఠానంబును జెప్పినప్పు డిదే భావంబని గ్రహింపవలయును.

వేదసన్న్యాసము మూఁడువిధములు. ఎవనికి నేది యుక్తమో దానినిమాత్రమే స్వీకరించి ప్రతికూలంబులను వదలుట యొకవిధము. వేదోపదిష్టంబులై స్వధర్మంబులైన వాని నాచరించుటయందుఁగూడఁ దత్ఫూజాభావంబుతో నాచరించుచు భగవదర్పణంబుసేయుట రెండవ విధము. ఇదే భావంబును గీత 18-46 తెలుపుచున్నది. సిద్ధావస్థయందు సమస్తకర్మధర్మంబులు వానికై యవే వదలిపోవును. ఇది మూఁడవ విధము.

48-49 సూత్రములు సాధనావస్థకు సంబంధించినవిగా నున్నవి. 4-8 సూత్రములందలి భావములు సిద్ధావస్థకు సంబంధించినవిగా నున్నవి. వానికిఁగల తారతమ్యంబును గ్రహింపవలయును. ఈ సూత్రములను 8-14 సూత్రముల తోడను, 61, 62, 76 సూత్రములతోడను సమన్వయము చేయవలయును.

'కేవలమవిచ్ఛిన్నానురాగము' అనునది ముఖ్యభక్తికి వివరణంబగును. ముఖ్యాభక్తి క్రమముగాఁ బరాభక్తికిఁ గొనిపోవును.



సూ. స తరతి స తరతి, స లోకాంస్తారయతి.  50

అట్టి పరాభక్తుఁడు తాను తరించి లోకంబునుగూడఁ దరింపఁ జేయును.

పై సూత్రమందలి 'అనురాగము' సాధనక్రమంబనెడి నిచ్చెనకుఁ జివరమెట్టుగా నున్నది. అంతియగాని యదే పరమావధి గానేరదు. అట్టి యనురాగము సాధకునిఁ దరింపఁజేయుటయేగాక, ఉత్తీర్ణుఁడైనవానిని లోకంబునకు మార్గప్రదర్శకునిగాఁ జూపుచున్నది.

నారదుఁడు చెప్పిన భక్తిసాధనక్రమము గీతలోని 18 అ. 51-54 శ్లోకములలోఁ జెప్పిన క్రమమునే యనుసరించుచున్నది.

శ్లో. బుద్ధ్యావిశుద్ధయాయుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్యచ।
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥

శ్లో. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥

శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥

శ్లో. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥

గీత. 18-51-54.

తృతీయాధ్యాయము సంపూర్ణము.

# చతుర్థాధ్యాయము

## భక్తిలక్షణము

సూ. అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్. 51

ప్రేమ యనఁగా నిట్టిదని చెప్పసాధ్యముగాదు.

ఈ యధ్యాయమందు భక్తిలక్షణంబులను బాహ్య దృష్టికి నెంతవఱకు గోచరంబులగునో, అట్లు గోచరించిన వాని నెంతవఱకు వ్రాయనగునో యంతవఱకు శ్రీ మహర్షి గారు వచించుచున్నారు.

భక్తి యనునది గౌణభక్తి యనియు ముఖ్యభక్తి యనియు రెండువిధములు. ముఖ్యభక్తి స్థిరమగువఱకు సాధకుఁడు తనివిచెందరాదనియు, ముఖ్యభక్తి యనునది కేవలభగవత్సేవారూపంబున వ్యక్తమగుననియు, సమస్త సాధనంబులకు నట్టి ముఖ్యభక్తియే ఫలంబనియు మహర్షి గారు సూచించుచున్నారు.

ఎల్లసాధనంబులకుఁ బర్యవసానమైన యీ ముఖ్యభక్తి సిద్ధించెనని గ్రహించుటకుఁ దార్కాణమేమి? అని యడుగ వచ్చును. ఈ లక్షణంబులనుబట్టి యితనికి ముఖ్యభక్తి సిద్ధించె నని నిర్ణయింపఁ దరముగాదనియు, భక్తి యనునది అంత రంగికానుభవమాత్రమగుటం జేసి బాహ్యలక్షణంబులచేత దానిని గ్రహింపఁజాలరనియు, ముఖ్యభక్తి యట్లితరులకు

గోచరించునది గాకున్నను, భక్తునకుమాత్ర మది స్వయం వేద్యముగానే యుండుననియు మహర్షిగారు పల్కుచున్నారు.

ఈ సూత్రమందలి 'ప్రేమ' శబ్దంబునకును, 2 వ సూత్రమందలి పరమప్రేమ యనుదానియందలి 'ప్రేమ' శబ్దంబునకు నర్థభేదము గలదని గ్రహింపవలయును. ఈ సూత్రమందలి 'ప్రేమ' యనునది భక్తియందలి కడపటిస్థితిని సూచించును. 2 వ సూత్రమందలి 'ప్రేమ' శబ్దము పరా భక్తిని అనఁగా భక్తునియొక్క అనుభూతియొక్క యవధిని దెలుపును. ఈ యనుభూతి యిట్టిదని చెప్పసాధ్యముగాదు. ఏలయందురా? వస్తుస్థితిని సమగ్రముగా గ్రహించుటయే దుర్లభము. ఒకవేళ దానిని గ్రహించినను, అది బుద్ధి గోచరమాత్రమగునేగాని వాక్కునకు నందదు. వాక్కునకు నందని విషయంబునుగూర్చి యెంతచెప్పినను అసమగ్రమగునే గాని పూర్ణము కానేరదు. ఆ కారణంబున వస్తుస్థితిని యథారూపము చెప్పసాధ్యముగాదనిరి. బాహ్యవస్తువిషయ ముననే యిట్లుండగా, కేవలాంతరింద్రియగోచరమైనదాని సంగతినిగూర్చి వేఱ చెప్పవలయునా?



సూ. మూకాస్వాదనవత్. 52

ప్రేమస్వరూపము అనిర్వచనీయమన్నంతనే యది హుళిక్కియని తలంపవలదు. పదార్థరుచి స్వారస్యము సామాన్యులకెట్లో మూఁగవానికిఁగూడ నట్లే యది యనుభవ

వేద్యమగుచుండును: అనుభవవేద్యమైనను మూఁగవాఁడు నాల్కలేమిం జేసి తన యనుభవం బిట్టిదని వ్యక్తముచేయఁ జాలఁడు. అంతమాత్రానసే వానికిఁ బదార్థరుచి స్వారస్యము తెలియలేదని చెప్పఁదగునా? అట్లే భగవత్ప్రేమానుభూతి గూడ భక్తునకు లోలోన నానందంబును గూర్చుచుండును: ఆ భక్తుఁడుగూడ తన యానందం బిట్టిదని చెప్పఁజాలఁడు.

ఈ విషయమై శ్రీ రామకృష్ణపరమహంసగారి సూక్తిగఁగా 'గొప్పవాఁడు తన గొప్పదనంబును జాటుకొనునా? అట్లే భక్తుఁడుగూడ వాని భగవత్ప్రేమానుభూతినిఁ బ్రకటింపఁ' డనెను. భగవత్ప్రేమ యెప్పుడు హృదయాంతరంబునఁ జేరునో యప్పుడే యది సాధకునకును వానితో నున్న వారికిని నవగతమగుచుండును.



## సూ. ప్రకాశ(శ్య)తే క్వాపి పాత్రే.　　53

ఆ ప్రేమ యెల్లెడలఁ బ్రకాశింపదు; యోగ్యమైన దేశకాలంబులలోఁ దగినవానియందు మాత్రమే ప్రకాశించును.

మున్ను చెప్పిన సాధనంబుల ననుష్ఠించుటచేత ఎవని హృదయము పరిశుద్ధమైయుండునో వానియందు ముఖ్యభక్తి భగవదనుగ్రహంబున ప్రకాశించుచున్నదనియు, అట్లది ప్రకాశించుట యా భక్తునకు స్పష్టమగుచునే యుండుననియు సూత్రతాత్పర్యము. దీనింబట్టి సాధనంబులకును సిద్ధికినిగల గాఢసంబంధము నూహింపవచ్చును.

(శ్రీ) నారదమహర్షి కేవలము జ్ఞానిగాఁడు; కేవలము భక్తుఁడునుగాఁడు; మఱేమనిన, జ్ఞానమిశ్రభక్తుఁడు. దానం జేసి ఆయనకు రెంటి తత్త్వము స్పష్టము. అట్టి మహానీయుఁ డగుటం జేసియేగదా భక్తియొక్క యనుభూతి సత్యమేగాని హాళిక్కిగాదని లోకంబునకుఁ జాటఁగల్గెను! భక్తియొక్క యనుభూతి సత్యమే యని సర్వలోకంబునకు ఢక్కా ప్రచారంబుగాఁ జాటనేర్చిన మహర్షికూడ అయ్యనుభూతి యిట్టిదని చెప్పఁదరముగాదనెను. అది యెంతటిదో యూహింపవగును.

ఈ భక్తులెల్లరును మనోవ్యాధిగ్రస్తులనియు, వారి పల్కులెల్లను తద్వ్యాధివిశేషంబులనియు, అట్టి భ్రాంతులను నమ్మరాదనియు నవీనపండితులు కొందఱనుటగలదు. తత్త్వము సమగ్రముగా బోధపడుటకు అహంకారము నశింపవలయును. ఈ నవీనపండితులన్ననో యహంకారము నాశ్రయించి జీవించువారుగా నున్నారు. అట్టివారికి సత్యము సుంతమాత్రమేనియు స్ఫురింపనైన స్ఫురించునా? వారి వచనంబులు విశ్వసనీయంబులగునా?

అనుభూతి యేల యనిర్వచనీయము? మనస్తత్త్వవేత్తలేల ప్రమాదపడుదురు? అని యడుగవచ్చును. ఆ సంగతి యీ క్రింది సూత్రము వివరించుచున్నది.



సూ. గుణరహితం కామనారహితం ప్రతిక్షణవర్ధమానం
అవిచ్ఛిన్నం సూక్ష్మతరం అనుభవరూపమ్. 54

ఏదే నొక వస్తువునుగూర్చి చెప్పుటనఁగా నేమి? దాని గుణగణంబులను జెప్పుటేగదా. ప్రేమ యన్ననో గుణరహితమైనదగును. గుణముతే లేనప్పుడు దాని గుణంబులను జెప్పు టెట్లు సాధ్యము? ప్రేమ యనుఁది యనిర్వచనీయమనుటకు నిది యొక కారణము.

కోరిక యున్నచో దాని లక్షణంబులు వెంటనే వ్యక్తమగును. ఆ లక్షణంబులనుబట్టి యంతర్గతమైన కోరిక యిట్టిదని యూహింపనగును. కోరికయే లేనప్పుడు లక్షణంబులుండుటగాని వానింబట్టి యూహించుటగాని సాధ్యముగాదు. భగవత్ప్రేమ యనునది కోరికగాదు గావున అది యనిర్వచనీయంబగుచున్నది.

ఈ ప్రేమానుభూతి ఏకరూపమును అవిచ్ఛిన్నమునై యుండును. బుద్ధ్యాది సర్వేంద్రియంబులు తమ తమ వ్యవహారంబులను మాని యీ యనుభూతియందు ఏకముఖమై యుండును. దానం జేసి యనుభూతి యే యొక్క యింద్రియ కార్యమును గానేరదు. అది యే దే నొక యింద్రియము యొక్క కార్యమైనచో దాని నిట్టిదని చెప్పనగును. ఇది మూఁడవ కారణము.

ఈ భక్తి యనుభవరూపమైనదిగా నున్నది. అనుభవము అంతఃకార్యము; అది యితరులకు గోచరింపదు. కాఁబట్టి దానింగూర్చి పరులు చెప్పఁజాలరు. మన స్తత్త్వ

శాస్త్రరచయితలు ప్రమాదపడుటకు నిది ముఖ్యకారణము. స్వానుభవంబునుబట్టి వారు చెప్పఁజాలరా? అని శంకింప వచ్చును. స్వానుభవజ్ఞానమున్నచో నతఁడట్టి నెట్టివ్రాఁతలనే వ్రాయఁడు. వాని వ్రాఁతలవలననే వానికి సుంతయు నను భవములేదని స్పష్టమగుచున్నది. వానికి ననుభవం బేల లేదందురా? అతఁడు దానికి వలసిన సాధనంబుల ననుష్ఠింపక పోవుటయే కారణము.

ఈ యనుభూతి మహాసూక్ష్మమైనదిగా నున్నది. స్థూలరూపమైనచో దాని నెట్లో యొకట్లు వివరింపవచ్చు ననియు, అది మహాసూక్ష్మమైనది కాఁబట్టి యనిర్వచనీయ మనియుఁ దాత్పర్యము.

ఈ యనుభూతి యితరభావంబులవంటిదిగాదు. ఏల యందురా? ఇతరభావంబులు వానివాని యుద్దీపకంబుల యొక్క కలిమిలేములఁబట్టి పెరుగుటో విఱుగుటో యగును. భక్తియన్ననో అహైతుకి; కావున నది నుద్దీపకంబుల నపే క్షింపదు. అందువలన దానికి విఱుగుటయే గలుగదు. 'ప్రతిక్షణవర్ధమానం' అనునది యీభావంబును సూచించును.



సూ. తత్ ప్రాప్య తదేవావలోకయతి. తదేవ శృణోతి, (తదేవ భాషయతి), తదేవ చింతయతి. 55

భక్తి క్రమక్రమంబుగా వర్ధిల్లి యుత్తమోత్తమస్థానంబును మెట్టి నప్పుడు భక్తునియొక్క స్థితిగతు లెట్లుండునది యీ సూత్రము తెలుపు చున్నది: ఆ స్థితిలోని భక్తుఁడు చరాచరసమస్తమందు భగవత్స్వరూ

పంబునే చూచును. సమస్తమును భగవత్స్వరూపమే యగుటంజేసి యతఁడు సమస్తమును ప్రేమించును. మఱియు జీవులెల్లడను భగవత్స్వరూపంబుగా నతఁడు భావించుటంజేసి, జీవలోకసేవయే భగవత్సేవగా నతఁ డాచరించును.

46–49 సూత్రములలోఁ జెప్పిన సాధనంబుల ననుష్ఠించుటవలన సాధకుని భక్తి పై విధముగాఁ బరిణామ మొందును. వానికి సమస్త సృష్టియు భగవత్ప్రేమాభివ్యక్తిగా నుండును. దానంజేసి యా భక్తుని మానసిక కాయిక వ్యాపారంబులందెల్ల వాని భక్తి వ్యక్తమగుచుండును. వేయేల! అట్టి భక్తుని జీవితంబెల్ల నొక మహాభక్తి యజ్ఞముగా నుండును. అతఁడు భగవంతునిదక్క నొండు తలంపఁడు, చూడఁడు, మాటాడఁడు, వినఁడు. వాఁడేమి చేసినను ప్రేమమాధుర్యంబుతోఁ బిక్కటిల్లుచుండును.

ఈ విధానము మొట్టమొదట భావశుద్ధిని గలిగించును. దానివలన మనశ్శుద్ధియు, దానివలన బుద్ధిశుద్ధియుఁ జేకూరును. తత్ఫలముగా భక్తుఁడు జ్ఞానిపడయు సాక్షాత్కారంబును దానుఁగూడఁ బడయుచున్నాఁడు. ఈ స్థితి అనఁగాఁ జరాచర సమస్తమందు భగవంతునే చూచుట భక్తికిఁ గడపటిస్థానమని కొందఱు తలంతురు గాని యది మహర్షి మతముగాదు. మహర్షి మతప్రకారం బీ స్థితి కడపటిస్థితికిఁ గ్రింది మెట్టగును.

శంకరాదులు వివేకచూడామణి మున్నగుచోట్ల భక్తినిగూర్చి నిర్వచించియున్నారు. వారుచెప్పిన నైరంతర్య

భక్తియు నారదులవారి యీ భక్తియు అనఁగాఁ గ్రిందిమెట్టు భక్తియు నొక్కటే యగును. రామానుజులవారు బ్రహ్మసూత్రములు 1-13 'ఏవం ధ్రువానుస్మృతిరేవ భక్తిశబ్దేనాభిధీయతే, ఉపాసనా పర్యాయత్వాత్ భక్తి శబ్దస్య' అన్నదానికిని, 'వేదనముపాసనంస్యాత్ తద్విషయే శ్రవణాత్' అని బోధాయనుని వృత్తివాక్యమునకుఁ బైనఁ జెప్పిన భక్తియే తాత్పర్యమగును.

ఆళ్వారుల యనుభవంబులను వారిబోధనలను నాధారముచేసిఁ బయి భక్తికన్న నుత్తమభక్తిని రామానుజుల వారు వారి స్వతంత్ర గ్రంథంబులందుఁ దెల్పిరి. శంకరుల వారు జ్ఞాననిష్ఠయే పరాభక్తి యని గీత. 18-55 వ శ్లోక భాష్యమందు 'సేయం జ్ఞాననిష్ఠా ఆర్తాదిభక్తిత్రయాపేక్షయా పరా చతుర్థీ భక్తిరిత్యుక్తా। తయా పరయా భక్త్యా భగవంతం తత్త్వతోఽభిజానాతి। తదనంతర మేవేశ్వర క్షేత్రజ్ఞ భేదబుద్ధి రశేషతో నివర్తతే। అతః జ్ఞాననిష్ఠా లక్షణయా భక్త్యా మా మభిజానాతి ఇతి వచనం న విరుద్ధ్యతే॥' అని నుడివిరి. యమునాచార్యులు పరాభక్తిని దర్శనమన్నప్పుడు శంకరభావంబునే యనుసరించినవారైరి.

శంకరుని వచనము అనఁగా జ్ఞాననిష్ఠయే పరాభక్తి యనుట నారదమహర్షిగా రంగీకరింపరనుట స్పష్టము. భక్తిశాస్త్రదృష్టికి శంకరవచనము సమ్మతము గాదని భావము. నారదమతప్రకారము పరాభక్తి యనునది ఒకవిధమైన యనుభూతి యగును. ఆ యనుభూతిలో సాధకసాధ్యాది సమస్త భేదంబులు నశించును.

ఈ సూత్రము గీత 6 వ అధ్యాయములోని 30-వ సంఖ్యగల

శ్లో. 'యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥'

అను శ్లోకంబును జ్ఞప్తిచేయుచున్నది.



సూ. గౌణీ త్రిధా, గుణభేదాత్ ఆర్తాదిభేదా ద్వా. 56

సత్త్వరజస్తమోగుణభేదంబులనుబట్టియు, ఆర్తిత్వము అర్థార్థిత్వము జిజ్ఞాసిత్వము అను భేదంబులనుబట్టియు గౌణభక్తి మూఁడువిధములు. గుణ సంబంధమైనది గౌణము.

భగవంతుని ప్రేమించుట ఆత్మకు నైజము. అట్టి నైజప్రేమప్రవాహంబునకు నహంకారము వివిధంబుల నడ్డంపడుచుండును. సాధకుఁడు సాధనంబుల ననుష్ఠించుకొలఁది యహంకారరచితంబులైన యడ్డంకులు క్రమక్రమంబుగాఁ దొలఁగి, ఆత్మకును భగవంతునకును గల సహజప్రేమాకర్షణము దృఢమగుచుండును,

సాధకుని భక్తి మొట్టమొదట మనోగతమాత్రముగా నుండును. మనస్సు నానావాసనలతోఁ గూడియుండును గావున వాని భక్తియుఁ గొంతకుఁ గొంత అవ్వాసనలతో మిళితముగాక మానదు. ఆ వాసనలు త్రిగుణములను బట్టి యుండును. కాఁబట్టి భక్తి మొదట త్రిగుణాత్మికగా నుండును. దానంజేసి యట్టి భక్తిని గౌణ (గుణసంబంధమైన) భక్తి

యనిరి. ఈ గౌణభక్తి తుట్టతుదకు ముఖ్యభక్తిగాఁ బర్యవసానమొందవలయును. ముఖ్యభక్తి నిరంతరావిచ్ఛిన్న ప్రవాహరూపంబున నుండునని మున్నే చెప్పఁబడెను.

ఈ గౌణభక్తి గుణములనుబట్టియు ఆర్త్యాదులను బట్టియు ద్వివిధము. గుణసంబంధమైన భక్తినిగూర్చి గీత 14-17-18 అధ్యాయములు సవిస్తరముగాఁ దెల్పుచున్నవి. సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడు గుణంబులు ప్రతి వ్యక్తియందు ముప్పిరిగొన్న త్రాఁడువలెఁ గలసి మెలసియుండును. ఆ మూఁడును సమానంబులుగానున్నప్పుడు ఏ వ్యవహారంబును జరుగదు. వ్యవహారదశయందా మూఁటిలో నేదే నొకటి యుత్కర్ష వహించి ప్రధానమై యుండును. ఏ గుణంబట్లు ప్రధానంబుగా నుండునో దానినే ప్రధానంబుచేసి యా వ్యక్తితత్త్వంబట్టిదని చెప్పుదురు. తమోగుణంబు ప్రధానంబుగా నున్నప్పుడు అట్టి మనస్సునందుఁ బ్రతిఫలించునట్టి భక్తిభావంబులుగూడఁ దద్గుణానుగుణంబులుగా నుండును. అట్లే రజస్సత్త్వంబుల సంగతియు నని గ్రహింపవలయును.

వాస్తవము విచారించినచో భక్తి యెప్పుడును శుద్ధము నేకరాశియునై యుండును. దాని యభివ్యక్తంబునకు సాధనమైన మనస్సు మాత్రము పైనిజెప్పినట్లుగా నేదే నొక గుణంబును బ్రధానంబుగాఁ గలిగియుండును. మనస్సంబంధమైన యీ మూఁడుగుణంబుల వ్యవస్థంబట్టి భక్తినిగూడఁ ద్రివిధంబుగా విభజించి వచింతురు.

రెండవవిధమైన గౌణభక్తి సంకల్పభేదంబులనుబట్టి మూఁడువిధములగుచున్నది. సంకల్పభేదములు ఆర్తిత్వము, అర్థార్థిత్వము, జిజ్ఞాసత్వము, జ్ఞానత్వము అని గీ. 7-16 లోఁ జెప్పఁబడియున్నవి. ఈ చతుర్విధ సంకల్పంబులలో మొదటి మూఁడును గౌణభక్తికిఁ జేరుననియు, నాల్గవది ముఖ్యభక్తికిఁ జేరుననియు వచించిరి. ముఖ్యభక్తియందు భక్తుఁడు భక్తి కొఱకు భక్తిచేయునేగాని యే ఫలంబునుగాని కోరి భక్తి చేయుటలేదు. ఈ విషయమై గీత యిట్లు చెప్పుచున్నది :

శ్లో, 'తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం అహం స చ మమ ప్రియః॥'

శ్లో. 'బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే।
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥'

గీత. 7-17, 19.

గౌణభక్తులు వారి గుణసంకల్పంబులఁబట్టి యొక్కొక్కరు మూఁడువిధములగుట వివరింపఁబడెను. అందుఁ బాప పరిహారంబును గోరువాఁడు అర్థార్థియనియు, క్లేశపరిహారంబును గోరువాఁడు ఆర్తుఁడనియు, ప్రమాదపరిహారంబును గోరువాఁడు జిజ్ఞాసువనియు వచించిరి.

అందుఁ దామసికభక్తులకు సాధనసాధ్యజ్ఞానము సమగ్రంబుగా నుండదు. అతఁడు సామాన్యంబుగా నాచారంబునే యాశ్రయించి వర్తించును. రాజసికభక్తి కేవలము స్వప్రయోజనపరమైయుండును. సాత్త్వికభక్తియందు సాధ

కునకు సాధనసాధ్యజ్ఞానములు స్పష్టములు, భగవత్ప్రీత్యర్థమై యతఁడు భక్తి చేయునేగాని వేఱుగాదు. సాత్త్వికభక్తుఁడార్తుఁడగునేని వాని యార్తియెల్ల లోకమందలి పాపమును గూర్చినదిగా నుండును. బుద్ధుఁ డిందులకు నిదర్శనము. అతఁ డర్థార్థియైనచో నదియెల్ల లోకమంగళార్థమైయుండును; జిజ్ఞాసువగుచో నాత్మకళ్యాణార్థము వాని జిజ్ఞాస యగును. భగవంతుఁడు సచ్చిదానందస్వరూపుఁడు. జిజ్ఞాస సత్పరంబుగాను, అర్థార్థిత్వము చిత్పరంబుగాను, ఆర్తిత్వము ఆనందపరత్వముగా నుండునని చెప్పినను జెప్పవచ్చును.



## సూ. ఉత్తరస్మా దుత్తరస్మాత్ పూర్వ పూర్వా శ్రేయాయ భవతి. 57

గౌణభక్తి యనునది గుణంబులనుబట్టి సాత్త్విక రాజసిక తామసికంబులని మూఁడువిధములుగాను, ఆర్తాదులనుబట్టి మూఁడువిధములుగాను జెప్పఁబడెను. అందుఁ దామసికమునకన్న రాజసికంబును, దానికన్న సాత్త్వికంబును, అట్లే యార్తార్తిభక్తికన్న జిజ్ఞాసభక్తియు, దానికన్న నార్థభక్తియు నుత్తమంబులగును.

ఈ సూత్రమందలి 'శ్రేయ' శ్శబ్దము ముఖ్యాభక్తిని సూచించును. ముఖ్యాభక్తి తుట్టతుదకుఁ బరాభక్తిగాఁ బరిణమించుచున్నది. సాత్త్వికభక్తి విచారించినచో ముఖ్యాభక్తికిఁ గేవలసామీప్యమగును; అట్లే ముఖ్యాభక్తియుఁ బరాభక్తికిఁ గేవలసామీప్యము.

భక్తిసాధనానుష్ఠానఫలంబుగాఁ దామసికంబు రాజసికంబుగాను, రాజసికంబు సాత్త్వికంబుగాను బరిణామ మొందుచున్నవి. ధ్యాతకును ధ్యేయంబునకును వియోగంబు గలిగినప్పుడు జనించు క్లేశము భక్తికి ముఖ్యలక్షణంబగును. అట్టి వియోగంబు గలుగకుండవలయునన్నచోఁ జిత్తమెప్పుడు నేకాగ్రమై యుండవలయును. జ్ఞాన కర్మయోగంబులు రెండును భక్తిని బ్రధానముగా గ్రహించునప్పుడు వాని తాత్పర్యము పైని జెప్పినదేయగును. భక్తి యట్లవిచ్ఛిన్నంబుగానుండుటకు సాత్త్వికంబొక్కటే తగును. తక్కినవాని యందు భక్తి యవిచ్ఛిన్నంబుగా నిలువనేరదు.



సూ. అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ. 58

పరాభక్తికన్న నిట్టిభక్తి సులభగోచరము.

భక్తిస్వరూపంబు అనిర్వాచనీయంబని 51 వ సూత్రములోఁ జెప్పఁబడెను. భక్తిస్వరూపంబట్టిదైనను సాధకుని సాధనంబులనుబట్టి యాభక్తి యెట్టిదైనది గ్రహింపవచ్చునని యీ సూత్రము తెల్పుచున్నది.

భక్తియనఁగానేమి? ప్రేమయనునది ప్రతివ్యక్తికి సైజము. ఆ ప్రేమయేదో యొకవస్తువును దగిలియుండును. ఆ ప్రేమ యన్యవస్తువులను వదలి భగవంతునందే నిల్చునేని దానిని భక్తియందురు. అట్లు భగవంతునియందుఁ బ్రేమనిల్చి నప్పుడాభక్తుని చిత్తవృత్త్యాదులు విలక్షణంబులుగానుండును.



సూ. ప్రమాణాంతరస్యానపేక్షత్వాత్ స్వయం ప్రమాణత్వాత్. 59

భక్తిని దెలిసికొనుటకు నితర ప్రమాణంబులెవ్వియు నవసరములేదు. ఏలయందురా? దానికి నదే ప్రమాణము. ఏదైననొక వస్తువును గుర్తించుటకు నన్యప్రమాణంబు వలయును. భక్తియనునది యొక వస్తువుగాదు. అందువలన నది యన్యప్రమాణసాహాయ్యంబున నిరూపింపఁదగినది కాదు. సుఖదుఃఖంబు లనుభవైకవేద్యములేగాని వేఱుగావు. ఎవఁడైనను సుఖముగానో దుఃఖముగానో యుండుట వాని యనుభవమే తెల్పును. ఆసంగతి యతఁడు గ్రహించుటకు ననుమానాది ప్రమాణంబులేల? వేయి విధములఁ దర్కించినను అనుభవంబు వేఱుగా మాఱదు గదా? అనుభవంబునకన్న నుత్తమజ్ఞానసాధనము గలదా?



సూ. శాంతిరూపాత్ పరమానందరూపాచ్చ. 60

ఆభక్తి శాంతిరూపము నానందరూపము నగును.

భక్తులు సర్వలోక కళ్యాణంబును గోరుచుందురు. లోకమన్ననో దుఃఖమయముగా నున్నది. అట్టి లోకంబును జూచినప్పుడు భక్తునకు మనోవ్యథ గలుగక మానదు. ఎప్పుడు మనోవ్యథ యుండునో యప్పుడే శాంతి లేదని స్పష్టము.

సంగతి యట్లుండగా 'భక్తి'యనునది శాంతి రూప మనియుఁ బరమానందరూపంబనియు ఈ సూత్రము చెప్పు చున్నది. ఇది యెట్లు సమన్వయంబగునని శంకింపవచ్చును.

భక్తుఁడు లోకకళ్యాణార్థమై ప్రయత్నశీలుఁడుగా నుండునేగాని వేఱుగాదనియు, వాని ప్రయత్నము లోక తాపత్రయ ప్రేరితమైనదిగాదనియు, సృష్టియెల్ల భగవత్స్వ రూపమే యని వాని భావము గావునఁ బ్రపంచార్థము పాటు పడుట వానికి భగవత్సేవచేయుటయే యని యతఁడు తలంచి యట్లు వర్తించుననియు, సృష్టిస్థితిలయంబులెల్ల భగవదధీనంబు లనియు, లోకకళ్యాణము నాపాదించుటకు భగవంతునకు శక్తిగలదనియు, అన్యులసాహాయ్యమే యవసరములేదనియు, లోకముపై భగవదనుగ్రహము నిరంతరము సంపూర్ణముగా నుండుననియు, 'సర్వజ్ఞోఽపీహ సర్వేశః సదా కారుణి కోఽపిసన్ । సంసారతంత్రవాహిత్వాత్ రక్షాపేక్షామపే క్షతే ।' అన్నట్లు భగవంతుని వాని సృష్టియైన లోకంబును ఆరాధించుటకై భక్తులకు నవ్విధంబునఁ బరమేశ్వరుఁ డవ కాశమిచ్చుచున్నాఁడనియు, భక్తునకుఁ బూర్ణ విశ్వాస ముండును. ఆ విశ్వాసముతో నతఁడు వర్తించును. ఆ కారణంబున లోక దుఃఖాదులు భక్తునకునంటవు. లోక దుఃఖాదులంటమింజేసి భక్తుని శాంతికిని బరమానందంబు నకు నేగిలేదు.



**సూ. లోకహానౌ చింతా నకార్యా; నివేదితాత్మ లోకవేద (శీల) త్వాత్.** 61

లోకదుఃఖమునుగూర్చి భక్తునకుఁ జింతలేదు. ఏలయందురా? భక్తుఁడు వానియాత్మను, లోకంబులను వేదంబులను భగవంతునకే సమర్పించి యుండును గావునను లోకంబు భగవదన్యంబుగాదని వాని విశ్వాసమగుటంజేసియు, వానికి నట్టిచింతకే యవకాశము గలుగదు.

లోక సుఖదుఃఖాదులు భక్తునకు నంటవన్నప్పుడు, భక్తుని హృదయము శిలాకర్కశమా? అని శంకింపనచ్చును. అట్లు శంకింపనవసరము లేదు. లోకసేవయే భగవత్సేవయను భావంబున్నప్పుడు, భగవంతుఁడెప్పుడును లోక కళ్యాణంబును గోరుచునే యుండునను విశ్వాసమున్నప్పుడు, లోకములో నేదేనియుఁ బొరపొచ్చెము కలిగినప్పుడు అది యెల్లఁ దన సేవాలోపమేగాని వేఱుగాదని భక్తుఁడు భావించుచు రెట్టించిన పట్టుదలతోఁ బాటుపడును. లోక సుఖదుఃఖంబులాత్మీయంబులని భావించుటకును, అట్టి భావము లేక లోక సేవను సేవార్థముచేయుటకును గల భేదంబును గ్రహింపవలయును. భక్తుఁడు కర్మఫలాభిసంధిని వదలి వర్తించును. వాని కర్మఫలంబులు లోకార్థమగును.

భక్తుని కార్యంబు లభిమానరహితంబులైనవైనను ఏదేనొక యుద్దేశపూర్వకంబులగున్నేగాని పిచ్చివాని చేతలవంటివిగావు. ఆ ఉద్దేశము మాత్రేము స్వార్థముగాదు. భక్తుని చర్యలందలి యీ విలక్షణభావంబును గ్రహింపవలయును.



సూ. న తత్సిద్ధౌ లోకవ్యవహారో హేయః, కింతు ఫలత్యాగః తత్సాధనం చ (కార్యమేవ)  62

భక్తిసిద్ధికిగాఁ బ్రయత్నించుచునప్పుడుగాని, భక్తి సిద్ధించిన తర్వాత గాని, భక్తుఁడు లోకవ్యవహారంబునకు విముఖుఁడు కావలసిన యవసరము లేదు. భక్తుఁడు సమస్త లౌకిక శుభకర్మంబులనుజేయుచుఁ దత్కర్మఫలంబులను భగవదర్పణంబొనర్చుచు జీవితంబును గడపనగును.

ముముక్షువు ఫలాభిసంధి రహితంబుగా లోకకళ్యాణ కర్మంబుల నాచరింపనగునని యీ సూత్రము చెప్పుచున్నది. అట్టి కర్మంబుల నాచరించునప్పు డతఁడు మిక్కిలి జాగరూకతతో వర్తింపవలయును. స్త్రీలతో వేళాకూళముగాఁ గలసి వర్తింపరాదు; నిరీశ్వరవాదులతోఁ జేరరాదు. వేయేల! భగవత్పరమైన బుద్ధిని సమాకర్షించి భోగాదుల పరముగాఁ జేయునట్టి వానికెల్ల దూరమగుచు వర్తింపవలయును. బుద్ధి చాంచల్యకారకములైన వానికి దూరముగానుండుటయే గాక, అట్టివానింగూర్చిన గ్రంథములను జదువుట, అట్టి కతలు వినుట—యివి బొత్తిగాఁగూడవు. అట్టివానిం గూర్చి చదువుట వినుటలు ఒకప్పుడుగాకున్న నొకప్పుడైనను బ్రమాదమున వానియందు రుచినిగల్పించి యెట్టకేలకు భగవద్విముఖునిగా నొనర్చుటగలదు.

ఈ సూత్రమ్ముందలి భావమును శ్రీ పరమహంసగారు గూడ 'కామినీ కాంచనత్యాగ' మనునట్టి యుపదేశంబున సూచించిరి. అట్లని స్త్రీలోకంబునే విసర్జింపుమనుటగాదు; ధనమువంకనే చూడఁగూడదనుటగాదు. ఎవతెయేనిఁ దటా

లున దుఃఖగ్రస్తమైనప్పుడు, ఆమెకు సహాయపడుట విధియగును. అట్లు సహాయపడునప్పుడు భగవత్కైంకర్యభావముతో సహాయపడవలయునేగాని తుచ్ఛభావముతోఁగాని ప్రత్యుపకారభావముతోఁగాని తోడ్పడరాదు. ధనార్జనముగూడ లోకోపకారార్థముగా నుండవలయును.

భక్తి స్థిరమైన తర్వాతఁగూడ నిట్టి నియమంబులను బాటింపవలయునా? అని యనవచ్చును. పాటించుట మేలు. అట్లు పాటించుట భక్తునికొఱకుఁగాకున్నను లోకమునకు మార్గప్రదీకంబగును.

ఈ భక్తిసాధనంబుల ఫలంబుగా ముఖ్యభక్తి సిద్ధించినప్పుడు అతఁడు సన్న్యాసంబును స్వీకరింపవచ్చును. ముఖ్యభక్తి సిద్ధించినతర్వాత గృహస్థాశ్రమంబులో నుండినవారు పెక్కుఱు గలుగరు.

భక్తి యెంత స్థిరమైనను భక్తుని పరిసరంబులు మంచివిగానిచో వాని యునికిఁ బ్రమాదాస్పదమయినదిగానే యుండును. అందువలననే

శ్లో. అవిద్వాంసమలం లోకే విద్వాంసమపి వా పునః।
ప్రమదా ద్యుత్పథంనేతుం కామక్రోధవశానుగమ్॥
మాత్రా స్వస్రాదుహిత్రావా న వివిక్తాసనే భవేత్।
బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి॥

అని మనువు శాసించెను.

స్త్రీపురుషసంయోగంబు ఉభయులకు హృదయగ్రంథియగుచున్నది. ఆ బంధమునుండి మోహంబును దానివలన

అహంకారాభిమానంబులును గలుగుచున్నవి. కావున స్త్రీసాహచర్యంబును సర్వవిధములఁ ద్యజింపవలయును. స్త్రీసాంగత్యంబునేగాక తత్సంగిసంగతంబునుగూడ వదల వలయును.

ముఖ్యభక్తి సిద్ధించినప్పుడు సంసారబంధంబును స్త్రీసాహచర్యంబును వదలుట యంతకష్టముగాదు. ఆ స్థితికి వచ్చినప్పుడు అతఁడు బ్రహ్మచారియగునేని వివాహంబునే తలంపఁడు. అతఁడు వివాహితుఁడేని వానికి భార్యాసంగ మాభిలాషయే యుండదు.

ఆత్మరతికిఁ దీవ్రబ్రహ్మచర్యము ముఖ్యాంగముగా నున్నది. శంకర రామానుజ చైతన్యస్వాముల జీవితమే యిందులకు నిదర్శనము. ముఖ్యభక్తుఁడగునేని గృహస్థువుగా నుండియు నతఁడు సదా బ్రహ్మచారిగానే యుండును. అనఁగా వాని గృహస్థాశ్రమము నామమాత్రము; అతఁడు కామినీ కాంచనత్యాగియై సన్న్యాసిగానే యుండును. వాస్తవము విచారించినచో బ్రహ్మచర్యమనునది సంభోగత్యాగ మాత్రమేగాదు; అట్టిభావము మనోవాక్కాయంబులమూటఁ గూడ నుండరాదు. 'కాయేన మనసా వాచా సర్వావస్థాసు సర్వదా। సర్వత్ర మైథున త్యాగో బ్రహ్మచర్యం ప్రచక్షతే॥' అని యాజ్ఞవల్క్యులు పల్కిరి.

మైథునభావము దర్శనము, స్పర్శనము, కేళి, కీర్తనము, గుహ్యభాషణము, సంకల్పము, అధ్యవసాయము, క్రియానివృత్తి అని ఎనిమిది విధములు. ఈ భావంబును

స్త్రీవిషయతృష్ణయని శంకరులును, స్త్రీభోగ్యతాబుద్ధియని రామానుజులును వచించిరి. మోహదృష్టిగూడ మైథునమే యగునని క్రీస్తువు చెప్పెను.



సూ. స్త్రీ ధన నాస్తిక (వైరి) చరిత్రం న శ్రవణీయమ్. 63

స్త్రీలనుగూర్చిన కథలుగాని, ధనమునుగూర్చిన కథలుగాని, నాస్తికుల కథలుగాని వినరాదు.



సూ. అభిమాన దంభాదికం త్యాజ్యమ్. 64

అభిమాన దంభాదులను వదలవలయును.

భగవద్భక్తులు లోకకళ్యాణార్థము పాటుపడుటగలదు. వారుచేసిన గొప్పపనులు తలంపునకు వచ్చినప్పుడు వాని మొదలో 'నేనింతపనిచేసితి' ననెడి అభిమానంబును దంభంబును జనింపవచ్చును. అట్టివెప్పుడైన నంకురించినచో మొలకలోనే త్రుంచివేయుచుండవలయును. అభిమాన దంభంబుల నడంపలేనినాఁడు వ్యవహారంబునే మానుటమేలు. ఆర్తులకుఁ దోడ్పడునప్పుడు వారిసేవయెల్ల భగవత్కైంకర్యమేయని తలంచి, అట్టి కైంకర్యంబునకు నవకాశమిచ్చి నందులకై యయ్యార్తులకుఁ గృతజ్ఞతాబద్ధుఁడు కావలయును. సాధకుఁ డిట్లు అభ్యాసముచేసినచో అభిమానదంభంబులు సన్నగిలి సమసిపోవును. ఈ సూత్రమందలి 'దంభాదిక'

మనుమాటలో గీతయందలి 16 వ అధ్యాయములోని అసుర సంపదలెల్ల నిమిడియున్నవని గ్రహింపవలయును.



సూ. తదర్పితాఖిలాచారః సన్ కామక్రోధాభిమానాదికం,
తస్మిన్నేవ కరణీయమ్. 65

సర్వవ్యవహారంబులను భగవంతునకు సమర్పించి, కామ క్రోధ అభిమానాదులనుగూడ భగవంతునందే చూపవలయును.

కామక్రోధాదులను మొట్టమొదటనే వదలుట యంత సులభకార్యముగాదు. బలవంతముగా వాని నడంచినైన రాదా యని శంకింపవచ్చును. అట్లుచేయుట యుక్తము గాదు. వానిని క్రమక్రమంబుగా జయింపవలయును. సాధనావస్థయందు సర్వవ్యవహారంబులు భగవత్కైంకర్యార్థములను దృఢభావంబుతో సాధకుఁడు వర్తించుట యొకమార్గము. కావున కామక్రోధాదులు జనించినప్పుడు అది గ్రహించి యా భావంబులను భగవంతునివంకకే మరలించుచుండ వలయును. అట్లుచేసినప్పుడు అనుతాపము వెంటనే జనించును. అది తుచ్ఛభావంబుల నడంచును. ఆ భావంబులును వాని వాసనలును క్రమముగా నశించును.

మఱియొకమార్గముగూడఁ గలదు. ఆగ్రహము వచ్చినప్పుడు భగవద్భక్తికి గలుగు నడ్డంకులపైనఁ దానిని జూపనగును. అప్పుడా కోపము త్యాగరూపముగా మాఱును. గర్వము జనించినప్పుడు 'అహో! మోహాదులను జయించు

శక్తి నాకుఁ గలదు గదా' యనియు, ఆ శక్తిని భగవంతుని వలన నొడిచితినిగదా యనియు గర్వపడనగును.

ఈ గర్వముగూడ మంచిదిగాదు. భగవంతుఁడు సర్వవిధగర్వంబుల నడఁచుచున్నాఁడు. అయినను ఈ గర్వము ప్రపంచాభిమానరూపగర్వమువలె నంత దోషిగాదు. ప్రపంచాభిమానరూపగర్వము దినదినాభివృద్ధిగాంచి తుదకుఁ గీడు చేయును. ఇది క్రమక్రమంబుగా నశించి భగవంతుని సమీపంబునకుఁ గొనిపోవును. కామక్రోధాదుల విషంబు నిట్లు నిర్విషము చేయుచుండవలయును.



సూ. త్రిరూప భంగపూర్వకం నిత్యదాస్య నిత్యకాంతా భజనాత్మకం ప్రేమకార్యం ప్రేమైవకార్యమ్. 66

భక్తి యనునది సాత్త్విక రాజసిక తామసికంబులనిగాని, ఆర్త జిజ్ఞాస అర్థార్థియనిగాని మూఁడువిధములుగా నున్నదని 56 వ సూత్రములోఁ జెప్పఁబడెను. ఆ మూఁడువిధములను దాఁటి కేవలము ప్రేమార్థము, సేవకుఁడు యజమానియందువలె భార్య భర్తయందువలె, నిర్వ్యాజరూపకంబుగా భక్తిచేయవలెను.

భక్తి యనునది భగవత్కైంకర్యవిధానమందు వ్యక్తమగుచుండును. అది నిర్వ్యాజమ్ముగా నుండవలెను. భక్తునకుఁ జరాచర సమస్త ప్రపంచమందలి ప్రతివస్తువును భగవద్రూపముగానే యుండవలయును. భక్తుని సేవలెల్ల భగవదారాధనరూపంబుగా నుండవలయును. తనభక్తిని

భగవంతుఁడు అంగీకరించుఁగాక అను భావంబుగూడ నుండ రాదు. భక్తుఁడు ప్రేమార్థము భగవంతుని ప్రేమింపవల యును. వాని ప్రేమయెల్లఁ దత్సేవారూపంబుగా నుండ వలయును.

ఈ సూత్రమందలి 'నిత్య' అనుపదముయొక్క భావం బెంతో గంభీరమైనదిగా నున్నది. 'స వై స్వామీ స వై భృత్యో గుణాలుబ్ధో న కాముకౌ' అను భాగవతవాక్యము సూచించునట్లుగా దాస్యభజనంబులు కేవలగుణాలుబ్ధములై యుండవలయునే గాని ఫలాభిమానసహితంబులు గాఁగూడ దని తెలుపుచున్నది.

56 వ సూత్రమందు గౌణభక్తి వివరింపఁబడెను. అదియే పరముగా భావింపరాదు. గౌణభక్తిని దాఁటి పరాభక్తిని బొందవలయును.



# పంచమోఽధ్యాయము

## భక్తిమహిమ

సూ. భక్తా ఏకాంతినో ముఖ్యాః. 67

ఎవరు కేవల ప్రేమార్థము భగవంతునెడఁ బ్రేమచేయుదురో వారు ఏకాంత భక్తులగుదురు.

భావశుద్ధియైనఁగాని భక్తియనునది కేవల భక్త్యర్థము కాఁజాలదు. భావశుద్ధికొఱకు సర్వ ప్రయత్నంబులను జేయ వలయును. భావము శుద్ధమైనప్పుడు భక్తి నిర్మలము ఏకాగ్రము నైరంత్యమునై యుండును. అట్టి భక్తికి సామ్యముగా సాధ్వీమణి యాఁమె పతియెడఁజూపు ప్రేమను జెప్పుదురు.

అట్టి భక్తిఫలంబుగా ఆత్మయొక్క తత్త్వము అనుభవసిద్ధమగును. ఆభక్తిని ముఖ్యభక్తి యనిరి. దాని మహిమనుగూర్చి యీ యధ్యాయము చెప్పుచున్నది. ముఖ్యభక్తికిని 56 వ సూత్రమందలి గౌణభక్తికినిగల తారతమ్యంబును గ్రహింపవలయును. ముఖ్యభక్తుని భాగవతుఁడనియు సత్పురుషుఁడనియుఁగూడఁ జెప్పెందురు.

శ్లో. యద్వై కాంత్యం గతా విష్ణా భగవత్యాత్మభావనే।
తద్వై వ్ణవా భాగవతాః సంత ఇత్యభిధీయతే॥'

అని భారద్వాజవచనము. ఇట్టివారి భక్తి మూఁడు గుణంబులకు నతీతమైయుండును. దానంజేసి వారిని లోకవాసనలు చెనకవు. ముఖ్యభక్తులందు మఱియొక విశేషముగలదు. వారు ముక్తినిగూడఁ గోరరు; అనఁగా ఏవిధమైన ఫలార్థమును కోరి వారు భక్తి చేయరు.

శ్లో. 'అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః'

అను గీత 12 వ అధ్యాయము, 16 వ శ్లోకముగూడ ఈ భావమునే తెలుపుచున్నది.



సూ. కంఠావరోధరోమాశ్చాశ్రుభిః పరస్పరం
లపమానాఽపావయన్తి కులాని పృథివీంచ. 68

భక్తివిశేషమువలన భక్తులకు సంభాషణకాలంబున డగ్గుత్తికయు, ఆనందాశ్రువర్షమును గగురుపాటు నుండును. ఇవి బాహ్యలక్షణములు. ముఖ్యభక్తుల సంభాషణము మాత్రమే కాదు, సర్వావస్థలయందలి భక్తుల సర్వవ్యాపారంబులుగూడ భక్తిరసంబుతో నిండి పొంగి పొరలివచ్చుచుండును. అట్టి భక్తులు కేవల భక్తికథలతో జీవితంబును బుచ్చరు. పాపాత్ములను బునీతులుగాఁ జేయుటయే వారికి జీవిత పరమావధిగానుండును. అందువలన వారట్లు సమయమువచ్చినప్పుడెల్ల భగవద్గుణంబుల నుగ్గడింతురు. భక్తి

పారవశ్యం బట్లు వారిని జేయించుచున్నది. అట్లు వారు చేయుట వారికే తెలియదు. వారి బోధకును సామాన్యుల బోధకు నిట్టి తారతమ్యముగలదు. 66 వ సూత్రములోని 'నిత్యదాస్య' మను పదము ఈ భావంబును సూచించు చున్నది.

ముఖ్యభక్తులు భక్తిపారవశ్యంబునఁజేసి లోకపావ నార్థము పాటుపడునప్పుడు లోకము వారినెన్నివిధములు గానో బాధింపవచ్చును. అట్టిబాధలను వారు సరకుచేయరు. తన్నినను గొట్టినను వారు వారి మతమును మానరు. అట్టి భక్తుల యుపదేశమేగాక వారి సందర్శనముగూడ లోకం బును బునీతముగాఁ జేయును. లోకపావనవిషయంబున భక్తులకు నెంత పట్టుదల యుండునో శ్రీకృష్ణభగవానుఁ డిట్లు తెలిపెను :

శ్లో. 'నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనమ్ ।
అనువ్రజామ్యహం నిత్యం పూయే యేత్యంఘ్రిరేణుభిః॥'
భాగ. 11-14-16.

లోకపాపమనఁగా నేమి? అహంకారమును దాని వికారంబులు అని యర్థము. భక్తుల సాంగత్యంబున కెంత మహిమ గలదో 'కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన । అపారసచ్చిత్సుఖసాగరే సదా విలీయతే మనః ప్రచారః॥' అను సూతసంహితోక్తివలన గ్రహింప నగును. 'లోకే త్వద్భక్తినిరతాః త్వద్ధర్మామృతవర్షిణః । పునంతి లోకమఖిలం కిం పునః స్వకులోద్భవాన్ ॥' అను

అధ్యాత్మరామాయణోక్తిగూడ భక్తిమహిమను వెల్లడించు చున్నది. భక్తి యెంత యధికమో యా భక్తుని తేజో మండలముగూడ నంత బలవత్తరమై దవ్వు వ్యాపించు చుండును. అట్టి భక్తులలో నుత్తమోత్తములు లోకదీపకులై యలరారుదురు. వారు గుహాంతరంబులలో నున్నను వారి తేజస్సు లోకమెల్లఁ బ్రసరించుచు, శుద్ధచిత్తుల హృదయ దర్పంబులందుఁ బ్రతిఫలించుచుండును.



సూ. తన్మయా.　　69

ముఖ్యభక్తు లట్టివారు గావునఁ దీర్థాదులెల్ల వారి మహిమతో నిండియుండును. ఆ ప్రభావ ఫలంబుగా భగ వంతు డందు విలసిల్లుచుండును.



సూ. తీర్థీ కుర్వన్తి తీర్థాని, సుకర్మీ కుర్వన్తి కర్మాణి,
సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి.　　70

ముఖ్యభక్తులు తీర్థస్థానంబులకుఁగూడ పవిత్రతను గూర్తురు; ఎల్ల కర్మంబులను బావనముచేయుదురు; సర్వశాస్త్రంబులకుఁ బ్రమాణత్వంబు నాపాదింతురు.

తీర్థమనఁగా దాఁటించునది అని భావము. నదిని దాఁటుటకుఁ బడవ యెట్లో యట్లే సంసారసాగరంబును

దాఁటుటకుఁ బుణ్యక్షేత్రములును మహాత్ములును సద్గుణంబులును దోడ్పడును. అందువలననే దయాసత్యాదులను శాస్త్రము తీర్థములుగా గ్రహించుచున్నది.

ఈ తీర్థసేవవలనఁ జిత్తము శుద్ధమగుచున్నది. శుద్ధచిత్తమందు తత్త్వము స్ఫురించును. అందువలనఁ దీర్థసేవ నంతగాఁ జెప్పిరి. తీర్థసేవవలనఁ జిత్తశుద్ధి యెట్లు గలుగునందురా? ఒక్కొక్క ఋషి తపోమహిమంబున నొక్కొక్కచోటు తీర్థమయ్యెను. ఆ తీర్థమునకుఁ బోయినప్పుడా ఋషియు వాని తపోవిశేషంబును దెలియవచ్చును. ఆ తలంపు తాత్కాలికముగానైనను యాత్రార్థి హృదయంబు నాక్రమించును. అట్లాక్రమించినప్పుడు తావన్మాత్ర కాలమైనను వానిచిత్తము తన్మయమగును. ఆ బీజము క్రమక్రమాభివృద్ధిగాంచును. ఇదియే తీర్థసేవాఫలము. ఇందొక విశేషము గలదు. తీర్థమాహాత్మ్యము తెలిసినప్పుడే యిట్టి ఫలము గలుగును గాని యా మాహాత్మ్యము నెఱుంగక యెన్ని తీర్థంబుల సేవించినను ఫలములేదు. మఱియు తీర్థప్రభావజ్ఞానముతోడ నందు విశ్వాసముగూడ నుండవలయును. ఇవి రెండును లేనివారి తీర్థసేవ నిష్ఫలము. క్రైస్తవులు మహమ్మదీయులు—వీరికి కాశ్యాది క్షేత్రములందు నమ్మకముగలుగదు. కావున వారు కాశ్యాదులను సేవించియు ఫలములేదు. వారికి జరూసలమ్, మక్కా క్షేత్రములందు విశ్వాసము గలదు. వారా తీర్థముల సేవవలన మేలుపడయుచున్నారు. అట్లే హిందువుల సంగతి యనియు గ్రహింపవలయును.

మహాత్ముల సాంగత్యంబున నొక్కొక్కటి తీర్థమగు చున్నది. అంతియగాని దానికి స్వతంత్ర మహిమ గలుగదు. ఇదేభావంబును 'న హ్యమ్మయాని తీర్థాని న దేవామృచ్ఛిలామయాః। తే పునంత్యురుకాలేన దర్శనాదేవసాధవః॥' అని భాగవతము 47-31.

సాధువులంతటివారు గావుననే 'యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః। స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥' అని శ్రీకృష్ణభగవానుఁడు గీత 3-21 లో సుడివెను. ఎల్లశాస్త్రములును సాధువుల యనుభూతివిశేషమే గాని వేఱుగాదు. శాస్త్రమునకును ఇతరగ్రంథములకును గల యీ భేదమును గ్రహింపవలయును.



సూ. మోద న్తే పితరో, నృత్య న్తి దేవతాః, సనాథా చేయం భూర్భవతి.        71

ముఖ్యభక్తుని పితరులు సంతసింతురు; వానికై దేవతలానందింతురు; వాని యునికింజేసి భూమి సురక్షితమగుచున్నది.

ముఖ్యభక్తుని తలిదండ్రుల సంతోషంబునకుఁ గారణం బేమందురా? వారి కన్నులయెదుట వారి పుత్త్రుని సర్వలోకము పూజించుటయే కారణము. కన్నవారికి నంతకన్న మహాభాగ్యము గలదా? తలిదండ్రుల సంతోషంబునకుఁ బై కారణంబు సమంజసమే యగుఁగాక. పరలోకమందలి పితరుల సంతోషంబునకుఁ గారణమేమి? అని యడుగ

వచ్చును. వారి వంశమందంతటివారు జనించుటయే వారి సంతోషంబునకుఁ గారణము. పురుషుఁడు తీర్చవలసిన పిత్రాదిఋణములు పెక్కుగలవు. అతఁడు భక్తుఁడయ్యేనేని సర్వవిధఋణములు వానియంతట నవియే తీఱిపోవుచున్నవి.

శ్లో. 'దేవర్షి భూతాప్తనృణాం పితౄణాం
న కింకరో నాయమృణీ చ రాజన్ ।
సర్వాత్మనా యశ్శరణం శరణ్యం
గతో ముకుందం పరిహృత్య కర్తమ్ ॥'

శ్లో. 'స్వపాదమూలం భజతః ప్రియస్య
త్యక్త్వాన్యభావస్య హరిః పరేశః ।
వికర్మయచ్చో త్పతితం కథంచి
ద్ధునోతి సర్వం హృది సన్నివిష్టః ॥'
భాగ. 11-5-41-42.

భగవంతుని భక్తిచేయుటవలన దేవ ఋష్యాది ఋణంబులెట్లు తీఱునని శంకింపవలదు. సమస్తదేవతలు భగవంతుని యంతరములే గాని వేఱుగావు. మూలదైవంబునకు మ్రొక్కినప్పుడు చిల్లరదేవతలకుఁగూడ మ్రొక్కుటే యగును. ఇదేభావంబును

శ్లో. 'మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు ।
మామే వైష్యసి సత్యం తే
ప్రతిజానే ప్రియోఽసి మే ॥' గీ. 18-65.

శ్లో. 'అనన్యాశ్చింతయంతో మాం
　　యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం
　　యోగక్షేమం వహామ్యహమ్॥'　　గీ. 9-22.

శ్లో. 'యాంతి దేవవ్రతా దేవాన్
　　పితౄన్ యాంతి పితృవ్రతాః।
భూతాని యాంతి భూతేజ్యా
　　యాంతి మద్యాజినోఽపిమామ్॥'　　గీ. 9-25.

'యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి' మొదలగునవి సూచించుచున్నవి.

ఇంద్రాది దేవతలు అడ్డుపడుట పురాణాదులందుఁ గలదందురా? స్వర్గకాములై యింద్రాదిపదవులనుగోరి యజ్ఞాదికర్మంబుల నాచరించువారి విషయమై యాయడ్డంకులు చెప్పఁబడినవి. మోక్షార్థులజోలికిఁగూడ వారు రారు; మీఁదుమిక్కిలి వారికై సంతసింతురు. అంబరీషాదుల చరిత్రలే యిందులకుఁ దార్కాణము. సాధకులకుఁ గొన్ని యడ్డంకులు గలుగుచున్నవందురా? ఆ మాట నిజము. ఆ యడ్డంకులు దేవతలు గలిగించినవిగావు. సాధకుని పరీక్షార్థము వానిని భగవంతుఁడే కలిగించుచుండును. అదియు భగవదనుగ్రహమే యగును.

భక్తుఁడు భూమికి రక్షకుఁ డెట్లగునందురా? జనులు ప్రాయికంబుగాఁ బ్రపంచంబెల్లఁ దమ భోగార్థమే యను భావంబుతోనుండి తదర్థము శ్రమింతురు. అంతియగాని

వారికి లోకకళ్యాణభావమే యుండును. సామాన్యులు ప్రపంచాభివృద్ధిని గోరుట కసాయివాఁడు గొఱ్ఱె బలుపును గోరుటవంటిదిగా నుండును. భక్తులసంగతి యట్టిదిగాదు. వారి కోరిక యాత్మార్థముగా నెన్నఁడు నుండదు. లోకకళ్యాణమే ఆత్మకళ్యాణమని వారి తాత్పర్యము. అట్టివారు లోకరక్షకులనుటయందు వింత యేమి గలదు?



సూ. నాస్తి తేషు జాతి విద్యారూప కుల ధన క్రియాది భేదః. 72

భగవత్ప్రసన్నత్వము గలిగినప్పుడు జాత్యాదిభేదము లేదు.

అట్టి భగవత్ప్రసన్నత నందినవారు ఏ జాతిలోఁ బుట్టినను బూజ్యులే యగుదురు. అనఁగా సాంఘిక సంబంధ జాత్యాదిభేదములకు భగవద్భక్తియందు నవకాశమే లేదని తాత్పర్యము.



సూ. యత స్తదీయా. 73

కావున భక్తులెల్లరును భగవద్దృష్టిలో సమానులే యగుదురు.

భక్తులుగూడ నెల్లజీవులను ఆత్మసమానదృష్టితోనే భావింతురు.



సూ. వాదో నావలంబ్యః. 74

అట్టి స్థితికి వచ్చిన భక్తులు భగవంతునిగూర్చిగాని భక్తులనుగూర్చి గాని తత్త్వవిషయంబులఁగూర్చిగాని వాదోపవాదంబులు చేయరు.

వారియందు అహంకారము సబీజనాశనమైయుండుటం జేసి తమ ప్రతిభను వెల్లడించి కీర్త్యాదులను బడయవలయు ననెడి కోరికకే యవకాశము గలుగదు. వారికి భగవత్తత్త్వము స్వానుభవసిద్ధమే గావున యుక్తి మొదలైన వాని నాశ్రయించి తత్త్వనిశ్చయము చేసికొనవలసిన పని లేదు. ఎవరైనను వారిని వాదమునకుఁ బిలిచినను వారు రారు.



సూ. బాహుళ్యావకాశత్వాత్ అనియతత్వాచ్చ. 75

పరమార్థం బొక్కటేయైనను దానిని వివిధరూపంబులఁ జూచుట గలదు.

అట్టి నానాత్వము వారివారి బుద్ధిశక్త్యాదులను బట్టి యున్నది. ఏకమును అద్వితీయమునైన యా పరమార్థంబును ఒకఁ డొకవిధముగా సందర్శించి తాను గన్నదే సత్యమనియు ఇతరులభావము తప్పనియు వాదించుట గలదు. మఱియొకఁడుగూడ నట్లే వాదింపవచ్చును. వాస్తవము విచారించినచో ఇరువుర భావంబులుగూడ వారికిఁ దెలియవచ్చినంతవఱకు సత్యములే యగును గాని సంపూర్ణములు గావు. కావునఁ బరమార్థజ్ఞానవిషయంబున నొకరొకరి

నాక్షేపించుట తగదు. ఎవరికేది ప్రియమో, ఎవరేది సత్యమని విశ్వసించిరో వారి నట్లే చననిచ్చుట మేలు. ఇదే యర్థంబును గీతలో

శ్లో. 'న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్ ॥'

శ్లో. 'ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥'
గీ. 3-26, 29.

అను శ్లోకంబులలో శ్రీ భగవానుఁ డుపదేశించుచున్నాఁడు.

ఏదియైనను యుక్తికి నిల్చినప్పుడే సత్యంబగుననియు, యుక్తికి నిలువని దానిని సత్యంబని గ్రహింపరాదనియు వాదించు మతము గలదు. ఇది కేవల భ్రాంతిమూలకము. యుక్తి యెప్పుడును ప్రజ్ఞాతిశయంబునుబట్టి యుండును. ఒకనికి యుక్తి బాహ్యంబులుగాఁ దోఁచిన విషయంబులనే సయుక్తికంబులని ప్రజ్ఞావంతులు ఋజువుచేసిన వెన్నో గలవు. వారిమాటను నమ్మి బహుకాలంబుగా లోకం బాచరించిన విషయంబులను అంతకన్న ప్రజ్ఞావంతులు తాఱుమాఱుచేసినవియుఁ గలవు. ఒకప్పుడు సయుక్తికంబుగా దోఁచిన సంగతి వేఱొకప్పుడు వానికే యుక్తిబాహ్యంబుగాఁ దోఁచుటయుఁ గలదు. అందువలననే కేవలము తర్కము నాధారము చేసి తత్త్వనిశ్చయంబును జేయరాదని 'తర్కోఽప్రతిష్ఠః' అని పెద్దలు నుడివిరి. ఇదేభావంబును బ్రహ్మసూత్రము

11-1-11 తెల్పుచున్నది. అట్లని యుక్తిని త్రోసివేయుట గాదు. యుక్తి నెంతమాత్రము స్వీకరింపవచ్చునో ఇందే 28 వ సూత్రంబునఁ జెప్పఁబడియున్నది.



## సూ. భక్తిశాస్త్రాణి మననీయాని త(దు)ద్బోధకకర్మాణి కరణీయాని. 76

భగవంతునియందలి భక్తిప్రేమలనుగూర్చి పల్కు శాస్త్రంబులను విమర్శించి మననముచేయుచుండవలయును. అట్లే భక్తిప్రేమలను ప్రబోధించు కర్మములనుగూడఁ జేయుచుండవలయును.

భక్తిశాస్త్రంబులనఁగా గీత, భాగవతము, నారద పంచరాత్రము మున్నగు గ్రంథములని సూత్రకర్త భావంబుగాఁ దలంపవచ్చును. ఆళ్వారుల భక్తికీర్తనంబులును, దక్షిణ హిందూదేశమందలి నాయనార్ల పాటలును, జ్ఞానేశ్వర, తుకారాం, రామదాసు మున్నగు మహారాష్ట్ర భక్తుల రచనంబులును, తులసీదాసు, మీరాబాయి, కబీరు మున్నగువారి కవితలును ఈ కోటిలోనే చేరును. ఇవియెల్లఁ గేవలము భక్తిరసము పొంగి పొరలిన తరంగములే గాని వేఱుగావు.

భక్తిరసాయనాది గ్రంథములును, శంకర రామానుజ, మాధవ, వల్లభ, నింబార్క, గౌరాంగాదుల కృతులు గూడ భక్తుల కెంతయుఁ బఠనీయంబులగును.

నారదమహర్షి గారు 'భక్తిశాస్త్రము' అని శాస్త్ర శబ్దమునకు భక్తిశబ్దంబును విశేషంబుగాఁ బ్రయోగించుటను జూడఁగా, జ్ఞాన, కర్మ, యోగశాస్త్రంబులు భగవంతు నందుఁ బ్రేమను బ్రేరేపించునవి గామిం జేసి యవి స్వాభావికంబుగానే భక్తులకు రుచింపవని సూచించుటగానున్నది. భక్తునకు నిక్కముగా భగవంతునిఁ బ్రేమించుట దక్క మఱియొండు రుచింపదు.

భక్తిగ్రంథములైనను వానిలోనున్న సమస్త విషయంబులను గ్రహింపరాదనియు, తేనెటీగ పుష్పమందలి మకరందమునుబోలె భక్తుఁడు వానికి అనుష్ఠానయోగ్యములైన భక్తిరసోద్రేకభాగంబులనే గ్రహింపవలయుననియు, సూత్రమందలి 'మనన' శబ్దము సూచించుచున్నది.

ఏది భగవంతుని ప్రేమవిలాసంబును బోధించునో, ఏది భగవత్పాదారవిందంబులమీఁద భక్తిచేయు భావంబును గలిగించునో అదియే భాగవతంబగునని స్కాందపురాణమును, భాగవతమాహాత్మ్యంబును దెలుపుచున్నవి. 74 వ సూత్రమందలి 'వాద' శబ్దప్రయోగంబునకును, ఈ సూత్రమందలి 'మనన' శబ్దప్రయోగంబునకుఁ గల తారతమ్యంబును గ్రహింపవలయును. భక్తులు నిరంతరము మననశీలురై యుండనగును; వాదంబునకున్నెన్నఁడును గడంగరాదు.

ఈ సూత్రమందలి 'తదుద్బోధక కర్మాణి' యను ముక్కయందెంతో భావంబిమిడియున్నది. భగవత్పరమైన

కర్మంబుల నెన్నింటినో శాస్త్రంబులు చెప్పుచున్నవి. భక్తు లగువారు భక్తిప్రబోధక కర్మంబులను మాత్రమే చేయవలయును. ఆ కర్మంబులనే 'భాగవతధర్మంబు' లందురు. వాని విస్తరము గీత 9, 12 అధ్యాయములలోను, భాగవతము సప్తమస్కంధము 5-23, 24; నవమస్కంధములోను, ఏకాదశస్కంధము 3-21 మొదలు 31 వఱకును; 19-20 మొదలు 24 వఱకును గలదు.

ఈ సూత్రము 12, 14 సూత్రంబులకు ఒకవంకను, 49, 62 సూత్రంబులకు నొకవంకను అనుబంధముగానున్నది. భక్తుఁడు పరాభక్తిని జెందిన తర్వాతఁ గూడ భక్తిశాస్త్ర పఠనసాధన లోకసేవాదులు చేయుటనుగూర్చి 12, 14 సూత్రములు చెప్పుచున్నవి. 49, 62 సూత్రములన్ననో పరాభక్తికిఁ బూర్వము పై విషయంబులందు భక్తుని మన స్సెట్లుండునది తెల్పుచున్నవి. ఈ సూత్రమన్ననో ఆ విషయములందు ముఖ్యభక్తుని చర్యలను దెల్పుచున్నది. భక్తుఁడు ముఖ్యభక్తుఁడుగాని పరాభక్తుఁడుగాని ఎన్నఁడును భక్తిసాధనంబులను లోకసేవయు విడువరాదని మహర్షి మతముగా నున్నది.

సాధకుఁడు స్వయముగా సిద్ధుని లక్షణంబులను బొందుటకై యత్నింపవలసినదని శంకరమతము. అది గీత రెండవ అధ్యాయము 55 వ శ్లోకంబునకు వారు వ్రాసిన భాష్యము సూచించుచున్నది.



సూ. సుఖదుఃఖేచ్ఛాలాభాది త్యక్తే కాలే ప్రతీ(క్ష్య)క్ష
మాణే క్షణార్థమపి వ్యర్థం న నేయమ్. 77

భక్తుఁడు సుఖదుఃఖాది ద్వంద్వంబులను జయించినప్పుడు వానికి సామాన్య కర్తవ్యంబు లెవ్వియు నుండవు. అప్పు డూరకుండుటకుఁ గాలము భారమై తోఁచును. అట్టి కాలంబును వ్యర్థముచేయక భక్తుఁడు దానిని శ్రేయోమార్గంబునఁ గడపవలయును.

భక్తి కుదిరిన తర్వాతఁగూడ భక్తుఁడు భక్తిసాధనాదులను విడువరాదని 76 వ సూత్రము చెప్పుచున్నది. ఏల విడువరాదను ప్రశ్న రావచ్చును. అందులకుఁ గారణంబుల నీ సూత్రము తెలుపుచున్నది.

సామాన్యులేదో యొక కర్మమందుఁ దగిలియుందురు. అందువలన వారికిఁ గాలము గడచుచున్నది. భక్తులకుఁ జేయవలసిన కర్మములు లేవు. అట్లని వారూరకయున్నచోఁ గాలము వారికి భారమై గడచుచుండును. వారు కాయిక మానసిక వ్యాపారంబులనెల్ల నుడిగినచో తమఃపిశాచము సందువెదకి వారిలోఁ జొచ్చి వారి నున్మార్గంబునకు లాగును. భూగ్రహణశక్తి యెంత బలవత్తరమైనదో తమశ్శక్తిగూడ నంతి బలవత్తరమైనదిగా నున్నది. ఎంతటివానినైనను సందు దొరకెనేని అది క్రిందికి నీడ్చి పడవైచును. ఆ శక్తికి సందు ఎప్పుడు దొరకునందురా? కాయిక మానసిక వ్యాపారంబులెల్ల వదలి భక్తులు మిన్నకున్నప్పుడు దానికి సందు దొరకును. అట్టి యెడము గలుగకుండుటకై భక్తులు సాధన క్రమతత్పరులై జాగ్రత్తతో నుండవలయును.

ఎంత మంచి ఇత్తడియైనను దానికిఁ జిలుము పట్టుట నైజము. అట్లే మనస్సు ఎంత శుద్ధముగానున్నను దాని నప్పుడప్పుడు శుభ్రపఱచనిచోఁ బ్రదుష్టుపట్టక మానదు. ఈ శుభ్రకార్యమే సాధనక్రమము.

ఈ భావంబును భాగవతము ఏకాదశస్కంధము రెండవ అధ్యాయము 53 వ శ్లోకం బిట్లు చెప్పుచున్నది :

శ్లో. త్రిభువన విభవహేతవేఽప్య కుంఠస్మృతి
రజితాత్మ సురాదిభిర్వి మృగ్యతామ్ ।
న చలతి భగవత్పాదారవిందాల్లవ
నిమిషార్థమపి స్మ వైష్ణవాగ్ర్యః ॥



## సూ. అహింసా సత్య శౌచ దయాస్తిక్యాది చారిత్ర్యాణి పరిపాలనీయాణి. 78

భక్తుని సాధనక్రమంబు లేవియైనది యీ సూత్రము వివరించుచున్నది. అహింస, సత్యము, శౌచము, దయ, ఆస్తిక్యము మున్నగునవి సాధనములు. వాని ననుష్ఠించుచుఁ బోషించుచు నుండవలయును. యమ నియమాదులుగూడ ఈ కోటిలోనే చేరును. అందువలననే శ్రీకృష్ణభగవానుఁడు వానినెల్ల దైవీసంపదక్రిందఁ జేర్చి మోక్షకాములు వానిని బట్టుదలతో నాచరింపవలయునని గీత 17 వ అధ్యాయములో నూనిపల్కెను.

అహింస—ఇది యగ్రస్థానంబు నధిష్ఠించుచున్నది. హింస అనఁగా నేమి? మనోవాక్కాయంబులచేత ఒకఁడు మఱియొక జీవికి స్వయముగాఁగాని యన్యులమూలకంబుగాఁ గాని బుద్ధిపూర్వకంబుగానొండెఁ బ్రమాదవశంబుననొండె

ఉపేక్షా కారణంబుననొండె నొప్పికలిగించుట హింస యనఁ బడును. అట్టిది చేయకుండుట అహింస యగును.

శిక్షాసమయంబులందొండె, అపమార్గనిరోధావసరం బులందొండెఁ జికిత్సాసమయంబులందొండెఁ గలిగించు నొప్పి హింస కానేరదు. ఏలయందురా? అట్టివేళలందుఁ బరులను నొప్పించుట కర్తయొక్క భావముగాదు; వారు మేలు పడయుటయే కర్త భావము. అనఁగా అహింసా హింసా విచక్షణము భావంబునుబట్టి యున్నదని తాత్పర్యము.

'మా హింస్యాత్ సర్వాభూతాని' అని వేదవచనము. దీనికి అపవాదమే లేదు. అయినను స్మృతికర్తలు దానికిఁ బెక్కు అపవాదంబులను గల్పించిరి. వాని నాధారముచేసి కొని వర్తించు లోకవర్తనంబును జూడఁగా వేదవచనము నామమాత్రమే యగుచున్నది.

స్మృతికర్తలు వచించిన యపవాదంబులు కర్మమార్గా వలంబుల తాత్కాలిక సౌకర్యార్థమే గాని ఆ మాటలు వారి పరమార్థంబులుగావు. ఈ రహస్యంబును గ్రహింపవలయును. ఆత్మసాక్షాత్కారపరులసంగతి యట్టిదిగాదు. వారు సర్వస్వ మును భగవంతునకు సమర్పించియుందురు. అట్టి భక్తులకు భగవంతునందు నెంత ప్రేమయో భగవత్సృష్టియందుఁ గూడ నంత ప్రేమ క్రుమ్మరిల్లుచుండును. కావున వారియెడ స్మృతికర్తల యపవాదవచనంబులు వర్తింపవు.

అట్లగునేని యజ్ఞాదులు వేదబోధితంబులు హింసలే యగుఁగదా యని శంకింపవచ్చును. అవి తప్పక హింసలే

యగును. మహాభారతము XII. 265. 4 మొదలు 9; భాగవతము XI. 21-29-30. చూడసగును. ఇదే యర్థంబును విజ్ఞానభిక్షువు తాను రచించిన సాంఖ్యసూత్రము 1. 6 భాష్యమందు స్పష్టీకరించెను. భక్తి యనునది సాత్త్వికగుణసారము గావునను, సాత్త్వికంబునకు రాజసిక తామసికంబులు తగవు గావునను, హింసయనునది ఏరూపమైనను రాజసిక తామసికంబులే యగుఁగావునను, భక్తుఁడు నైజముగానే అట్టి హింసాకార్యంబులను గలలోఁగూడ స్మరింపనేరఁడు. వేదబోధిత కర్మంబుల విలువ వానికి స్పష్టము.

యజ్ఞాదులందు జీవహింసయేగాదు, అట్టి భావము గూడఁ దగదు. వేదములు చెప్పుచున్నవిగదా యని యందురా? వేదభావము వేఱు. మోక్షార్థులు వారియందుఁగల రాజసిక తామసిక తత్త్వంబులను బరిమార్చినచో సత్త్వమునెడి స్వర్గంబు నధిష్ఠింతురనియు, అందుండి మోక్షపీఠి సులభముగాఁ జేరవచ్చుననియు వేదములు బోధించుచున్నవి. ఈ రహస్యంబు నెఱుంగక వేదంబులకే నిందమూట గట్టుచున్నారు.

అపార్థంబులను గల్పించి లోకంబును గనుబ్రామవచ్చునుగాని అంతస్సాక్షియై సర్వము నెఱుంగుచున్న భగవంతుని గనుబ్రామఁగలరా? హింసాతత్త్వమునుగూర్చి వారివారి యంతర్వర్తి మే వారికిఁ బలుకఁడా? ఎదపైఁ జేయియుంచి యజ్ఞాదులందలి పశువధ హింసగాదని యెవరైనను బలుకఁగలరా? యజ్ఞాదిక పశువివసనమే హింస యనఁగాఁ దక్కినవాని సంగతి చెప్పనేల?

సత్యము—హింసకువలె సత్యంబునకుఁగూడఁ బెక్కు అపవాదంబులుగలవు. 'వారిజాక్షులందు వైవాహికము లందు' అను పద్యము రానివారుండరు. ఆ పద్యప్రకారము సత్యస్థితియేమో యూహింపవచ్చును. 'ఆత్మహేతోః పరార్థేవా నర్మహాస్యాశ్రయాత్తథా। యే మృషా న వదంతీహ తే నరా స్వర్గగామినః' అని పరమశివుఁడు దేవికిఁ బల్కినమాట కన్న వేఱు తార్కాణము సత్యము విషయమై వలయునా?

భక్తుని దృష్టిలో 'సత్యమను' నది చూచినది చూచినట్లు పల్కుట మాత్రమేగాదు. అంతటను భగవంతుని గాంచుచుఁ దత్పరము మఱొండులేదని త్రిశుద్ధిగా విశ్వసించి వర్తించుట సత్యమగును. ఇదే భావంబును శ్రీకృష్ణభగవానుఁడు భాగవత గీతాదులందు 'సమదర్శన' పదము వలన సూచించుచున్నాఁడు.

శౌచమనఁగా శుభ్రత—ఇది బాహ్యము, ఆంతరమని రెండు విధములు. బాహ్య శౌచవిషయమై శాస్త్రమెన్నో నియమంబులను నిపతించుచున్నది. భక్తునకు నవి యంత మాననీయంబులుగావు. ఆత్మశుద్ధి యొక్కటే వానికి ముఖ్యము.

చిత్తంబునకు మాలిన్యంబును గలిగించునది ఏది? అని యడుగవచ్చును. అహంకారమును, తాని యూఁతగట్టులైన రజస్తమో గుణంబులును చిత్తమాలిన్యకారణంబులు. అది పోఁకకుండుమార్గ మేమందురా? అసంగత్వమే యుపాయము. 'కర్మస్వసంగమః శౌచమ్;' అనియు 'కర్మశుద్ధిర్మదర్పణమ్'

అనియు భగవానుఁడు భాగవతములో శౌచతత్త్వంబును XI. 19. 38, 22. 15 లో బోధించెను.

శౌచమనునది 'సత్యశౌచం మనఃశౌచం శౌచ మింద్రియనిగ్రహః। సర్వభూతదయాశౌచం జలశౌచంతు పంచమమ్' అని గరుడపురాణంబును, 'అభక్ష్య పరిహారంచ సంసర్గశ్చా ప్యనిందితైః। స్వధర్మేచ వ్యవస్థానం శౌచమే తత్ప్రకీర్తితమ్' అని బృహస్పతియు, శౌచతత్త్వమును నానా విధములుగా వచించిరి. 'బాహ్యాంతఃకరణానాం కృత్య యోగ్యతా శౌచ' మని రామానుజాచార్యులవారు గీత 18-3 వ శ్లోకమున రచించిరి.

ఈ శుచిత్వ—సంపాదకుఁడు భగవంతుఁడు తక్క మఱియొకఁడు గలుగఁడని భక్తులభావము. 'అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోఽపివా। యః స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః' అను వాక్యమే యిందులకుఁ దార్కాణము.

దయ—దయ యనఁగా 'సర్వభూతంబులయెడ సర్వత్ర అనుగ్రహ'మని శాండిల్యోపనిషత్తు. 'యత్నాదపి పరక్లేశం హర్తుం యద్ హృది జాయతే। ఇచ్ఛా భూమిసురశ్రేష్ఠ సా దయా పరికీర్తితా॥' అని పద్మపురాణంబును, 'ఆత్మవత్సర్వ భూతేషు యో హితాయ చ శుభాయ చ। వర్తతే సతతం హృష్టః క్రియా హ్యేషా దయాస్మృతాః॥' అని మత్స్య పురాణంబును, 'పరే వా బంధువర్గే వా మిత్రే ద్వేష్టరివా సదా। ఆత్మవద్వర్తితవ్యం హి దయైషా పరికీర్తితా॥' అని

కాశీతత్త్వమును, 'ఏతదేవ హి దయాలు లక్షణం యద్విశ్వే యజన బుద్ధివర్ధనమ్' అని సంక్షేప శారీరకంబును బల్కుచున్నవి.

పై వాక్యంబుల సారాంశంబును బరిశీలించిననో, అంతస్థమైన ప్రేమ యనునది ప్రవృత్తిరూపంబున దయగాను, నివృత్తిరూపంబున అహింసగాను బరిణమించునని తేలుచున్నది. ఇవి రెండు నొకదానికే ముఖద్వయమగును. అహింసామాత్రముతో భక్తుని ప్రేమ తనివినొందదు; పరోపకార మొనర్చునందాక అది నిలువనీయదు. దానికి హితులనిగాని శత్రువులనిగాని వివక్షత లేదు. దేశకాలనియతియుఁ గలుగదు. ఏలయందురా? ఎల్లభూతంబులందు వానికి భగవంతుఁడుదక్క వేఱొండు కానరామియే కారణము. కావుననే 'భక్తుఁడు అహేతుకదయాసింధు'వని వివేకచూడామణి వచించుచున్నది. భగవంతుని యనుగ్రహము పాత్రోచితమైయుండును; భక్తుని ప్రేమయన్ననో దానికెట్టి నియతియు లేదు.

ఆస్తిక్యత—తాత్త్వికార్థసత్యత్వమందుఁ బ్రమాణబుద్ధిగలిగియుండుట ఆస్తిక్యత యనఁబడును. 'ఆస్తిక్యం నామ వేదోక్త ధర్మాధర్మేషు విశ్వాసః' అని శాండిల్యోపనిషత్తు. ఆస్తికతకు వ్యతిరేకపదము 'నాస్తికత'. వేదనిందకుఁడు నాస్తికుఁడని మనువును. పరలోకాద్యస్తిత్వవాది ఆస్తికుఁడనియు, వేదమార్గంబు ననుసరింపనివాఁడు నాస్తికుఁడనియు భీష్మాచార్యుఁడును వచించిరి. అందువలననే భీష్మా

చార్యుఁడు 'మాయావాదీ వేదాంత్యపి నాస్తిక ఏవ పర్యవసానే సంపద్యతే' అని పల్కిరి. వీరి మతప్రకారము సాంఖ్యులును అద్వైతులును నాస్తికులే యగుదురు. కుమారిలభట్టు మతప్రకారము సాంఖ్యయోగము, పాంచరాత్రము, పాశుపతము వేదవిరుద్ధములని (తంత్రవార్తికలో 1. 3. 4) యేర్పడుచున్నవి.

ఆస్తిక్యం శ్రద్ధధానతా పరమార్థే ష్వాగమార్థేషు (గీత. 18. 42 భాష్యము) అని శంకరులును, 'వైదికార్థస్య కృత్స్నస్య సత్యతా నిశ్చయః' అని రామానుజులును రచించిరి.

ఆస్తిక్యమునుగూర్చిన యీ వచనంబులెల్లఁ బాక్షికంబులుగాఁ దోఁపకమానవు. ఈ వచనార్థమే సత్యమని భావింతుమేని, అద్వైతభక్తులు, క్రైస్తవభక్తులు, సునీమతభక్తులు—వీరెల్లరు వేదప్రామాణ్యంబు నంగీకరింపరు గావున నాస్తికులే యగుదురు. ఇంతియగాదు. దక్షిణ హిందూదేశమందు నాఁటికి నేఁటికిఁ బరమభక్తులుగాఁ బూజింపఁబడుచున్న ఆళ్వార్లు, నాయనార్లు—వీరందరును వేదంబులకన్న ఆగమంబులనే ప్రమాణంబులుగా గ్రహింతురుగావున నాస్తికులే యగుదురు. వేయేల? షడ్దర్శనకర్తలు, కపిలుఁడు, జైమిని మున్నగువారు వారి శాస్త్రమందు భగవంతునకే యవకాశమీయరైరి. ఆకారణంబున వారుగూడ నాస్తికులుగాక మానరు.

కాఁబట్టి 'ఆస్తిక' శబ్దార్థమును సంకుచితంబుగా గ్రహింపరాదు. భక్తికిని వేదాదులందలి ప్రమాణబుద్ధికిని

ముడిపెట్టరాదు. భక్తుఁడు భగవంతునిదప్ప మఱొకంశము తలంపఁడు. అదే వాని జీవితార్థము. అహైతుక దయ తక్క మఱొండెతఁడు పాటింపఁడు.

మోక్షమే పరమార్థమని నిశ్చయింతుమేని, ఆ మోక్షము స్వప్రయత్నఫలముగా వచ్చుఁగాక, లేక భగవదనుగ్రహఫలముగాఁ గలుగుఁగాక, లేక మహాత్ముల కృపవలన సిద్ధించుఁగాక, ఎల్లమతములు దాని నంగీకరించుచున్నవి. కావున సర్వమతములును దన్మతభక్తులును ఆస్తికులే యగుదురు.



సూ. సర్వదా సర్వభావేన నిశ్చింతైః (చిత్తైః) భగవానేవ భజనీయః. 79

ఎల్లవ్యాకులంబులను వదలి నిరంతరము జీవితకాలమందలి సమస్త స్థితిగతులందును భగవంతునే భజింపవలయును.

శాస్త్రార్థమును విమర్శపూర్వకంబుగా గ్రహింపవలయునని 76 వ సూత్రము సూచించెను. అదేయర్థంబు నీ సూత్రముగూడ నుపపాదించుచున్నది. భగవత్పూజావిధానంబునఁగల విశేషాంశంబులు 37 వ సూత్రమందుఁ జెప్పఁబడెను. ఈ సూత్రమందు మఱియొక విశేషము గలదు. భగవంతునే భజింపవలయుననుటయందు రెండుభావంబులంతర్భూతములై యున్నవి. ముఖ్యభక్తికిఁ జేయూఁత

లెవ్వియు నవసరములేదనియు, భక్తిప్రాదుర్భావదశయందు నవసరంబులుగా భావింపఁబడునట్టి యజ్ఞాదులు విగ్రహారాధనాదులు యాత్రాదులు నట్టి యాలంబనకోటిలోఁ జేరుననియు, వానిని దాఁటి ముఖ్యభక్తి యుండుననియుఁ దలంపఁబడునది మొదటి భావము. ముఖ్యభక్తుఁడు లోకసంగ్రహార్థము యజ్ఞాదులను గావించినను, అవియెల్ల దావన్మాత్రము లేగాని పరమార్థదాయకంబులుగావను భావంబుతో నతఁడు వర్తించును. అతఁ డట్లు వర్తించుచున్నను భగవంతుఁడు వానికిఁ దద్యజ్ఞాదులందుఁగూడ స్వరూపంబుతోఁ బ్రసన్నుఁడగుచునే యుండును. సామాన్యుల విగ్రహాది బాహ్యపూజలకును రామానుజ గౌరంగాదుల బాహ్యపూజలకును గల యీ పరమభేదంబును మఱువరాదు. ఇట్టి భావపరిణామము భక్తివిశేషంబునుబట్టి భక్తులందుఁ గ్రమక్రమముగాఁ గలుగుచుండును. ఈ విషయమై

శ్లో. బాలక్రీడనవత్సర్వే నామరూపాదికల్పనమ్ ।
విహాయ బ్రహ్మనిష్ఠో యః స ముక్తో నాత్ర సంశయః ॥

శ్లో. మృచ్ఛిలాధాతుదార్వాది మూర్తావీశ్వరబుద్ధయః ।
క్లిశ్యంత స్తపసా జ్ఞానం వినా ముక్తిం నయాంతి తే ॥

శ్లో. ఉత్తమో బ్రహ్మసద్భావో ధ్యానభావస్తు మధ్యమః ।
అధమః స్తోత్రపాఠాది బహిఃపూజాధమాధమా ॥

అని మహానిర్వాణతంత్రంబును,

శ్లో. అగ్నౌ క్రియావతో దేవో హృది దేవో మనీషిణామ్ ।
ప్రతిమా స్వల్పబుద్ధీనాం జ్ఞానినాం సర్వతః శివః ॥

అని జ్ఞానసంకలినియును,

శ్లో. అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృదిదైవతమ్ ।
ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర విదితాత్మనామ్ ॥

అని యుత్తరగీతయు వివరించుచున్నవి.

ఇఁక రెండవ భావంబును వినుము. భక్తి ప్రథమదశ యందు భక్తుఁడు వాని యిష్టదైవతంబును దక్క నన్యంబుల నెల్ల నిరసించి తూలనాడుట గలదు. అది భక్తిబాల్యవిచేష్టితమగును. ఆ భక్తి తుట్టతుదకు ముఖ్యభక్తిగాఁ బరిణమించినప్పుడు వానిదృష్టి మాఱును. నానాశాస్త్రములందు వివిధరూపంబుల వర్ణింపఁబడిన బహురూపతత్త్వంబులెల్ల బాహ్యదృష్టికి భేదాత్మకంబులుగాఁ గాన్పించునేగాని పరమార్థ దృష్టికి నవియెల్లఁ దా నేదైవతంబునకు భక్తిచేయునో యా దైవతంబేగాని వేఱుగాదని వానికి స్ఫుటమగును. ఈ భావంబుదయించుటతోడనే వాని పూర్వపాషండబుద్ధి నశించుచున్నది. అట్టి బుద్ధి యేమాత్రమున్నను అతఁడు ముఖ్యభక్తుఁడు గానేరఁడు. 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' అను ఋగ్వేదవాక్యము ముఖ్యభక్తిలక్షణము.

ముఖ్యభక్తులకు నిష్టదేవతలుండుటఁ గలదు. అయినను వారికి దేవతాంతరములందు అసూయాదులుండవు.

ఈ సూత్రమందలి నిశ్చింత భజనము భావసమాధిని సూచించుచున్నది.



సూ. స కీర్తనీయః (కీర్త్యమానః) శీఘ్రమేవావిర్భవ
త్యనుభావయతి (చ) భక్తాన్. 80

భగవంతుని భజింపఁగా భజనముయొక్క తీవ్రతనుబట్టి ఆయన శీఘ్రముగాఁ బ్రసన్నుఁడై తత్త్వానుభూతిని గృపచేయును.

నిశ్చింతభజనము భావసమాధియగునని పై సూత్రమందుఁ జెప్పఁబడెను. అట్టి సమాధిఫలముగా భగవంతుఁడు ఏ రూపంబున వాని నారాధింతురో యా రూపంబున భక్తుల యంతర్దృష్టికి గోచరించును. భగవద్గోచరము కేవల భావమాత్రమేగాదు; ముఖాముఖి నుండును. అప్పుడు భక్తుఁడును భగవంతుఁడు స్థానవ్యత్యయము లేక ఏకప్రపంచమందే నివసించుటగును. దీనినే సాలోక్యముక్తి యందురు. భాగ. XI. 2. 41-45.

ఆ సాలోక్యముక్తియందు భక్తుఁడు భగవంతునితోడ నిరంతరము నుండుటయేగాక, తాను జూచునవియెల్ల భగవద్విభూతివిలాసములేయని యతఁడు గ్రహించును. ఈ భావంబును సామీప్యముక్తి యందురు.

భగవంతునితోడ నిరంతరము నుండుట, భగవద్విభూతివిలాసంబులను జూచుచుఁ దన్మయుఁడై యుండుట, ఇవి రెండు భక్తుని నెట్టకేలకు భగవద్వ్యాప్తికిఁ గొనివచ్చును.

ఈ భావంబునే భాగవతము X. 29. 15 సూచించుచున్నది. ఈ స్థితిని సారూప్యముక్తి యందురు. భక్తిశాస్త్రముయొక్క చరమఫలం బిదే యని తలంపవచ్చును. ఈ స్థితియందు భేద భావం బంతో యింతో యుండును. అందువలన నిది యుత్తమగతిగా అద్వైతము గ్రహింపదు.

భగవత్సారూప్యమన్నంతనే భగవంతునకువలె భక్తునకుఁగూడ జగత్సృష్టిస్థితిలయశక్తి యుండునని భావింపరాదని శ్రీ శంకరులవారు సూత్రభాష్యమందు III. 4-17 లోఁ జెప్పిరి.

భేదభావంబు సమూలంబుగా నశించి యైక్యమందుట యొక్కటే యుత్తమగతియని యద్వైతము. ఈ స్థితిని సాయుజ్యమందురు. దీనిని భక్తిఫలంబుగా భగవంతుఁ డను గ్రహింపవలయునేగాని ప్రయత్నఫలంబుగాఁ బడయఁజాలరు.

భగవంతుని సేవించుచుఁ దద్రూపానందంబు ననుభవించుచుండుటయే భక్తుని కోరికగాని యైక్యంబు నతఁడు కోరఁడు. ఐక్యమందుఁ బై విధానందానుభవంబునకు నవకాశములేదు. భా. III-25-34 ; III-29-13 ; XI-14-14 ; XI-21-34. భక్తుఁడు కోరకున్నను భగవంతుఁడు వానికి సాలోక్యాదిత్రయమేగాక సాయుజ్యంబు ననుగ్రహించును. ఈ సంగతి 4 వ సూత్రమందుఁ జెప్పఁబడియున్నది.

భక్తిమార్గఫలంబుగా బ్రహ్మజ్ఞానసిద్ధిగూడఁ గలుగు ననియు, అట్టిదానిని భక్తుఁడు కోరకున్నను భగవంతుఁడే

వానికి ననుగ్రహించుచుననియు శ్రీరామకృష్ణపరమహంసగారు నుడివిరి.

ఈ సాయుజ్యముక్తినే ఏకాంతముక్తియనియు వచించిరి. అది ముఖ్యాభక్తియొక్క పరమావధి యగును. ఈ యేకాంతభక్తిని పరభక్తియనియుఁ, బరమప్రేమయనియు, అమృతమనియు శ్రీ నారదమహర్షిగారు ఈ గ్రంథ ప్రథమాధ్యాయమందుఁ దెల్పిరి.

సాయుజ్యభావంబును భక్తులు భావమాత్రముగాఁ దలంచుటకుఁగూడ నెఱతురు. ఏలయందురా? మనుష్యమాత్రుఁడు భగవంతుఁడగునని తలంచుటకన్న ఘోర పాపము లేదనియు, అట్లు తలంచుట భగవంతుని నుత్తమ లోకంబునుండి పాతాళంబునకు నీడ్చివైచుటయనియు భక్తుల మతము. జీవాత్మకును బరమాత్మకును అభేదంబును భక్తుఁ డెన్నఁడుఁ గలలోఁగూడ నంగీకరింపఁడు. అందువలన భక్తులకు అద్వైతంబు రుచింపదు.

అద్వైతము భక్తులకు రుచించినను రుచింపకున్ననుఁ బరాభక్తిఫలంబుగా భగవంతుఁడే వారికి ననుగ్రహించుచున్నాఁడు. ఇది స్వానుభవసిద్ధమని శ్రీ నారదమహర్షిగారు భాగవతము 1-6-18 లో నిట్లు దెల్పిరి:

శ్లో. 'ప్రేమాతిభరనిర్భిన్న పులకాంగోఽతి నిర్వృతః।
ఆనందసంప్లవే లీనో నాపశ్యముభయం మునే॥'

శ్లో. 'త ఏతే భగవద్రూపం విశ్వం సదసదాత్మకమ్ ।
ఆత్మనోఽవ్యతిరేకేణ పశ్యంతో వ్యచరన్ మహీమ్ ॥'
భాగ. 11-2-22.

అనునదిగూడ అద్వైభావంబును దెలుపుచున్నది.

జీవన్ముక్తి యన్నను బరభక్తి యన్న నొక్కటేయని శ్రీ స్వప్నేశ్వరులవారు శారీరకసూత్రము 98 వ దానికి తాము రచించిన భాష్యములోఁ దెల్పిరి. విష్ణుపురాణము 1-9-59 వారి వాక్యమునకు ఆధారము.



## సూ. త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ, భక్తిరేవ గరీయసీ ॥ 81

భగవంతునకు నామరూపాదులు లేవు. అయినను బోధనార్థము భగవంతుఁడు పరము, నిత్యము, సత్యము అని వచించిరి. అట్టి భగవంతునకు భక్తిసేయుటయే, అనఁగా వానినిఁ త్రికరణశుద్ధిగాఁ బ్రేమించుటయే ఉత్తమభజనం బగును; ముమ్మాటికి నదే యుత్తమము.

భక్తుఁడు సాయుజ్యముక్తిని గాంచినంతనే భేదభావము సమూలకంబుగా నశించుననుట చెల్లదు. ఏలయందురా? వాని ప్రారబ్ధకర్మము అడ్డుపడుచున్నది. ఆ కర్మము సమగ్రంబుగా వ్యయించునందాఁక అభేదసిద్ధి గలుగదు. ప్రారబ్ధకర్మము భుక్తము కావలసినట్టిది లేని భక్తులును గలరు.

అట్టివారిని భగవంతుఁడే స్వకార్యనిర్వహణార్థము సజీవులుగా నుంచి వారికి భేదబుద్ధిని దావన్మాత్రముంచును. బ్రహ్మసూ. IV-1-15-19.

తనకును భగవంతునకు నభేదమనుట భక్తునకు స్వానుభవసిద్ధము. అయినను భగవత్ప్రేమానుభవానందంబునకై యతఁడు తావన్మాత్రము భేదభావంబు నుంచుకొనును. దీనిని ముఖ్యభక్తి యందురు. అది జీవబ్రహ్మైక్యసిద్ధికిఁ బూర్వము భక్తి యధిష్ఠించు చరమస్థానమగును.

ముఖ్యభక్తియందు భేదభావంబు సుంతయుండుననుట వలనఁ బ్రమాదపడవలదు. ఆ భేదభావము కాల్పనికమేగాని వాస్తవముగాదు. అట్లనుటకు నాధారమేమందురా? భేదభావంబు పూర్ణంబుగా నశించినప్పుడు జీవన్ముక్తి యని జ్ఞానులందురు. భేదభావంబు తావన్మాత్రంబుంచుకొన్నవానినిఁ బరభక్తుఁడని భక్తులందురు. వాస్తవము విచారించినచో నిరువుర లక్షణంబులందు భేదమే కాన్పింపదు. కావున జీవన్ముక్తియన్నను 'బరభక్తి' యన్నను నొక్కటే యని తేలుచున్నది. ఇదేయర్థంబును విద్యారణ్యులును స్వప్నేశ్వరులును దెల్పిరి.

ముఖ్యభక్తికిని పరభక్తికినిఁ గొంచెము భేదము గలదు. అది సూక్ష్మాతిసూక్ష్మము. దానిని మహానుభవశాలిగాని గ్రహింపనేరఁడు. నారదమహర్షి యంతటివాఁడు గావున వాని రెంటి తత్త్వంబులను వివరింపనోపెను.

పరభక్తి ఫలంబేమందురా? ఏభగవంతుఁడు తన కన్న వేఱనియు, ఎందో యేదో రూపంబుననుండుననియు భక్తుఁడు మొట్టమొదటఁ దలంచెనో యాభగవంతుఁడు తన యాత్మయే యనియుఁ దనలోనే యున్నాఁడనియు, అపరిచ్ఛిన్నుఁడును సర్వాంతర్యామియు సర్వవ్యాపకుఁడును సర్వమునై యున్నాఁడనియు గ్రహించును. అట్టి భావంబెప్పుడు స్థిరమగునో యప్పుడే యాభక్తునకు దేశ కాల కారణ భేద భావము నశించును; అతఁడు త్రిగుణాతీతుఁడును, అవస్థాత్రయాతీతుఁడును, త్రిపుటీభేద సమతీతుఁడునై భగవదైక్యంబునొందియు వలసినప్పుడు తత్పరమ ప్రేమానుభవానందంబునుఁ బడయుచు నిత్యసంతోషియై యుండును. ఈ ప్రేమానుభవము ముఖ్యభక్తికన్న శ్రేష్ఠము. ఈ భావమునే యీ సూత్ర ప్రథమభాగము సూచించుచున్నది.

ఈ సూత్రముయొక్క రెండవభాగము ప్రథమభాగము యొక్క యనువాదమే యనవచ్చును. అయిన నందొక విశేషముగలదు. అది యేదియందురా? మోక్షంబునకు జ్ఞానకర్మయోగంబులు సాధనంబులుగాఁ జెప్పఁబడెను. ఆ మూఁటికన్న భక్తి యెంతయు నుత్తమమైన సాధనమని యది సూచించుచున్నది. ఇదే భావంబును త్రిపాద్విభూతి నారాయణోపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది. 'భక్తివలనఁగాక మఱి యెంట బ్రహ్మజ్ఞాన మెన్నఁడును గలుగదు; ఇతరోపా

యంబులనెల్ల వదలి భక్తి నాశ్రయింపుము; భక్తినిష్ఠుఁడ వగుము; ముమ్మాటికి భక్తినిష్ఠుఁడవగుము. భక్తివలన సర్వము సిద్ధించును. భక్తివలన సాధింపరానిది ఏదియు లేదు.'' ఇదే యర్థంబు అధ్యాత్మరామాయణము 1-6-36 నందును, భాగవతము III. 25-19; VII. 7-50-52; X. 14-4, I. 2-34; XI. 14-20 లయందును, బ్రహ్మవైవర్త కృష్ణజన్మఖండములో 37. 8-9 లయందునుఁ దెలుపఁబడియున్నది. మఱియు గీతలోని యీ క్రింది శ్లోకంబులను జూడనగును.

శ్లో. 'యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమోమతః॥
(భ.గీ. 6-47)

శ్లో. 'మయ్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాస్తే యుక్తతమా మతాః॥
(భ.గీ. 12-2)

శ్లో. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా
శుచః॥ (భ. గీ. 18-66)



సూ. గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్స ల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమవిరహాసక్తి, రూపా ఏకధా అపి ఏకాదశధా భవతి. 82

భక్తి యనునది పరమార్థ దృష్టికి ఏకరూపమేయైనను అది వ్యవహారమునందు నీ క్రింద నుదహరించిన 11 రూపంబులు దాల్చుచున్నది. (1) భగవత్కల్యాణగుణాభివర్ణనము, (2) భగవద్దివ్యమంగళవిగ్రహానురాగము, (3) భగవత్పూజ, (4) భగవత్స్మరణము, (5) భగవత్సేవ, (6) భగవంతునెడ సఖ్యభావప్రేమ, (7) భగవంతుని పుత్త్రునిగా భావించుట, (8) భగవంతుని భర్తగా భావించుట, (9) భగవంతునకు సర్వము సమర్పించుట, (10) భగవన్మయుఁడై యుండుట, (11) భగవంతునెడబాసియుండనేరమి.

అట్లనుటవలన భక్తి పదునొకండు రూపంబులే యని నిశ్చయింపవలదు. అది మహర్షిగారి భావముగాదు. భక్తి యనునది వారివారి పూర్వసంస్కార రుచులంబట్టియు అభిమానాదులంబట్టియు నానావిధంబుల నుండును. ఈ భక్తి యనునది ఒక్కొక్కచోట వింతరూపంబున నుండును. భగవంతుఁడు తన కార్యార్థమై భక్తి నట్టి రూపంబులఁ దాల్పించును.

నారదుఁడు వ్యాసుఁడు మొదటిదానికిని, బృందావన స్త్రీలు రెండవదానికిని, అంబరీషుఁడు మూఁడవదానికిని,

ప్రహ్లాదుఁడు నాల్గవదానికిని, హనుమంతుఁడు ఐదవదానికిని, ఉద్ధవార్జునులు ఆఱవదానికిని, దేవకీ కౌసల్యలు ఏడవదానికిని, రుక్మిణీ సత్యభామలు ఎనిమిదవదానికిని, బలి విభీషణులు దొమ్మిదవదానికిని, సనత్కుమార యాజ్ఞవల్క్యులు పదియవదానికిని, గోపికలు పదునొకండవదానికిని ఉదాహరణంబులు.

ఒక్కొక్కరి నొక్కొక రూపభక్తికి నుదాహరించుట వలన వారియందుఁ దదితరరూపభక్తివిలాసంబులు గలుగవని యూహింపరాదు. ప్రధానరూపంబునుమాత్రమే గ్రహించి యట్లు వచించిరి. ఈ భక్తిరూపంబులెల్ల నొక్క వ్యక్తియందే ఒక్కొక్కటి ఒక్కొక్కవేళఁ గానవగును. ఇందులకుఁ బరమహంసగారే నిదర్శనము.

విరహాసక్తి యనునది భక్తులకెల్లరకును సర్వసాధారణము. ఏలయందురా? అది భక్తి స్వభావము. భక్తి నిక్కముగా నున్నది లేనిది యీ యొక్క లక్షణమునే తార్కాణముచేసి నిర్ణయింపవలయును. అదేభావంబును నారద మహర్షిగారు 29 వ సూత్రంబునఁ దెల్పిరి. విరహాసక్తి యనునది భక్తియొక్క పరమలక్షణంబని యామునాచార్యులును నుడివిరి. ఈ రూపభక్తి నిదర్శనంబునకు రాధాగోపికలకన్న మించినవారు గలుగరు. అట్టి భక్తితత్త్వమునే గీతగోవిందము నెఱుచూ[illegible]లిచ్చుచున్నది.



సూ. ఇత్యేవం వదంతి జనజల్పనిర్భయాః ఏకమతాః
కుమార-వ్యాస-శుక-శాండిల్య-గర్గ-విష్ణు-
కౌండిన్య-శేషోద్ధవారుణి-బలి-హనుమత్-
విభీషణాదయో భక్త్యాచార్యాః. 83

భక్తిశాస్త్రంబునకు నాచార్యులైన కుమారుఁడు - వ్యాసుఁడు - శుకుఁడు - శాండిల్యుఁడు - గర్గుఁడు - విష్ణువు - కౌండిన్యుఁడు - శేషుఁడు - ఉద్ధవుఁడు - ఆరుణి - బలి - హనుమంతుఁడు - విభీషణుఁడు మున్నగు మహాత్ములు మతాంతరంబులను లెక్కసేయక తద్వాదంబులెల్ల జల్ప ప్రాయంబులుగా భావించి భక్తియే ముక్తికి నుత్తమసాధనంబని యేక మతితో వచించిరి.

నారదమహర్షి రచించిన యీ భక్తిశాస్త్రము స్వకల్పితముగాదనియు, వాని మతమంతయు భక్తితత్త్వ వేత్తల స్వానుభవ సముజ్జీవితమే యనియు ఈ సూత్రము తెల్పుచున్నది. భక్తితత్త్వవేత్తలు పైనిఁ జెప్పినవారే గారు; ఎందఱో గలరు. వారిలోఁ గొందఱను మాత్రమే విస్తరభీతిం జేసి సూత్రకారుఁడు గ్రహించెనని సూత్రమందలి 'ఆది' శబ్దము సూచించును.

'ఏకమతితోఁ జెప్పిరి' అనుటవలన వారెల్లరి యను భవంబు నొక్కవిధమేనా ? యని శంకింపవలదు. వ్యవహారం బొక్కొక్క రందు నొక్కొక్కవిధ భక్తిరూపము ప్రధా నంబుగానున్నను, దాని తత్త్వానుభవమందును, తదుప దేశములందును ఎల్లరు నేకమతులే యని భావము. ఇంత

యేల? పరభక్తియందుఁగూడ సూక్ష్మతరములైన యవాంతరభేదంబులు గలవని శ్రీ నారదమహర్షిగారే 16, 17, 18 సూత్రములలోఁ దెల్పెనుగదా.

ఈ యవాంతరభేదంబులు పరభక్తివిషయంబునందేగాని అపరభక్తివిషయంబునఁ గలుగవు. అపరభక్తింగూర్చి యీ గ్రంథంబునఁ జెప్పిన విషయంబు సర్వసమ్మతము.

ఈ భక్తులలోఁ గొందఱు మాత్రమే భక్తిగ్రంథములను రచించి తమ మాహాత్మ్యంబును వెల్లడించి చిరజీవులైరి; పెక్కుమంది పేర్లుమాత్రము గలవు. వారింగూర్చి యితరులు రచించిన గ్రంథములవలన వారి మాహాత్మ్యంబును గ్రహింపవలసియున్నది. అయినను వారు గఱపిన బోధకమార్గము మాత్రము నేఁటికిని బ్రచారమందున్నది. భక్తితత్త్వంబును గ్రహింపఁగోరువారు ఆ మహాత్ముల జీవితంబులను జదువవలయునని శ్రీ నారదమహర్షిగారీ సూత్రమందు సూచించిరి.

భక్తులన్నప్పుడు మన దేశభక్తులు మాత్రమే యని భ్రమపడవలదు. దేశాంతర మతాంతర భక్తుల చరితలు గూడ మాననీయములే యగును. దేశమతభేదంబునఁ జేసి భక్తియందు భేదము గలుగనేరదు. ఒకవేళ ఎందైన నుంత భేదము గానవచ్చినచో అట్టి భేదాంశంబులను విరమించి ఏకభావాంశంబులనే గ్రహింపనగును.

కుమారుఁ డనఁగా సనత్కుమారులు. వీరు నారద మహర్షి గురువులు. నారదుఁడు వారివలనఁ బరమార్థోపదేశంబును గ్రహించినట్లు బ్రహ్మవైవర్త పురాణమందు శ్రీ కృష్ణజన్మఖండములోఁగలదు. సనత్కుమారులన్ననో వైష్ణవులలోఁ దలమానికమని యందే గలదు. వారు నిరంతరముఁ గృష్ణమంత్రమును జపించుచుండిరి. వారు 'హరిః శరణమ్' అను మంత్రమును గూడ జపించువారఁట. సనత్కుమారు లెప్పుడు భక్తులలో నగ్రగణ్యులైరో యప్పుడే వారి శిష్యులైన నారదులు నట్టివారే యని యూహింపనగును.

వ్యాసుఁడు నారదుని శిష్యుఁడు. గురువుయొక్క యాజ్ఞప్రకారము వ్యాసుఁడు భక్తిశాస్త్రంబును బహుగ్రంథ రచనామూలకంబుగా లోకప్రచారంబుగావించెను. శిష్యుని వలననే గురువుపేరుగూడ శాశ్వతమాయెను.

శుకుఁడు వ్యాసుని కుమారుఁడు. భాగవతప్రచారంబునకు శుకుఁడే మూలంబనవచ్చును. శాండిల్యుఁడు పురాణ ఋషి; ఆయన శాండిల్యవిద్యాప్రచారకుఁడని ఛాందోగ్యోపనిషత్తునందున్నది. శాండిల్యుఁడు అను పేరుగలవారు పెక్కురుగలరని బృహదారణ్యకోపనిషత్తునందుఁ గలదు. నారదమహర్షి పేర్కొన్న శాండిల్యుఁడు వారిలో నెవ్వరో యూహింపరాదు. కర్త యెవ్వరైనను శాండిల్య భక్తి సూత్రములను గ్రంథముమాత్రము నిల్చియున్నది. భక్తి తత్త్వ శాస్త్రములలో నదియు ముఖ్యమైన గ్రంథమే యగును.

గర్గుఁడు—ఈయన శివునింగూర్చి తపంబొనర్చి జ్యోతిష విద్యలను గ్రహించినట్లు భారతము. శ్రీకృష్ణభగవానుని నామకరణం బొనర్చిన మహనీయుఁ డీ మహర్షియే. జ్యోతిశ్శాస్త్రమం దీ గర్గాచార్యులు చాలఁ బ్రమాణభూతులుగా గ్రహింపఁబడుదురు. వారి యుపదేశమే గర్గసంహిత. ఈ గర్గునకు వాచక్నవి యను పుత్త్రిక గలదు. ఆమె బ్రహ్మవాదినియని పేరుగాంచెను. నాటి సాంప్రదాయప్రకారము స్త్రీలు బ్రహ్మవిద్యను వారి తండ్రులయొద్దఁ దక్క నన్యులయొద్దఁ గఱవరాదు. మఱియు స్వగృహమందే చదువవలయును. ఆమె బ్రహ్మవాదిని యైనప్పుడు ఆమె తండ్రియు నంతటివాఁడుగా నుండవలయునని తప్పక యేర్పడును. కానిగర్గుడను మహర్షి యుండెననియు, ఆయన పుత్త్రిక యొకతె జీవితంబునెల్లఁ దపోవ్రతముతోఁ బుచ్చెననియు శల్యపర్వము. ఈ యిరువురు గర్గులు ఒకరో కాదో, అట్లు కానిచో వారిలో నెవరిని ఈ సూత్రగ్రంథము పేర్కొనుచున్నదో యూహింపరాదు.

విష్ణువను మహర్షి యొకఁడు గలఁడు. వారిని స్మృతికర్తలలోఁ బ్రస్తావింతురేగాని భక్తకోటిలో నంతఁగాఁ బ్రస్తావింపరు. విష్ణుస్వామియను మహాభక్తుఁడుగలఁడుగాని, ఆయన ఇటీవలివాఁడు. నారదుఁడు వానినిఁ బల్కరించుట సంభావ్యముగాదు. అట్లయినచో ఈ విష్ణుమహర్షి యెవఁడని శంకింపవచ్చును. నారాయణ కృష్ణావతారంబులు విష్ణ్వంశంబులేగాని యితరంబులుగావు. ఈ నారాయణుఁడు భక్తిమార్గంబునకు మహామార్గదర్శియనియు, నారదుని గురువు

లలో నొకఁడనియు శాంతిపర్వ మోక్ష ధర్మభాగంబునఁ గలదు. ఆ నారాయణునే నారదుఁ డిట గ్రహించియుండ నోపును.

భక్తిని ఫలనిరపేక్ష బుద్ధితోఁ జేయుచలయునని యూని పల్కి ప్రబోధమును గావించినవారిలో నెల్ల శ్రీకృష్ణభగవానుఁ డగ్రగణ్యుఁడు. నారదుఁడు వానికిఁ బరమభక్తుఁడు. విష్ణువే కృష్ణుఁడుగా నవతరించెను గావునను, కృష్ణుఁడు తనకు భజనీయుఁడు గావునను, భక్తితత్త్వంబును విస్తరించిన వారిలోఁ గృష్ణుఁ డగ్రగణ్యుఁడు గావునను, కృష్ణునే విష్ణువుగా నిచట మహర్షి గ్రహించియుండనోపును. ఇదియునుఁగాక విష్ణువు స్వయముగా భక్తినిగూర్చి పెక్కుచోట్ల నుపదేశించి నట్లు పురాణంబులందుఁ గలదు. ఆ కారణంబున ఆ విష్ణువునే మహర్షి యిచ్చటఁ బేర్కొనియుండవచ్చును.

శాండిల్యుని తనయుఁడు కౌండిన్యుఁడను మహర్షి గలఁడు. అతఁడు పరమభక్తుఁడై యుండవచ్చును. వాని నిచ్చట నారదుఁడు పల్కరించియుండనగును.

సంకర్షణుఁడును, లక్ష్మణుఁడును, రామానుజులును అనంతుని యవతారములు. అనంతునకు శేషుఁడని పర్యాయ నామము. రామానుజులు ఇటీవలివారౌ గావున వారి పేరు గూడ నారదుఁడు తలంపసాధ్యముగాదు. సంకర్షణుఁడు భాగవతభక్తముఖ్యులలో నొకఁడుగా నున్నాఁడు. వాని భక్తి తత్త్వము ఆగమంబులందుఁ బురాణంబులందు నచ్చటచ్చటఁ

గలదు. లక్ష్మణుఁడు స్వజీవితపూర్వకంబుగా రామావతార మందు భక్తితత్త్వరహస్యంబును వెల్లడించెను. లక్ష్మణుని భక్తి పితృభక్తిరూపము. ఈ పితృభక్తి 82 వ సూత్రమందలి ఏకాదశవిధభక్తులలోఁ జేరదు. ఇది విశిష్టమైనభక్తి. ఇచ్చట శేషుఁడనఁగా సంకర్షణునో లక్ష్మణునో యీ మహర్షి భావించి యుండనోపును.

ఉద్ధవుఁడు, బలి—వీ రిరువురనుగూర్చి తెలియనివా రుండరు. ఆరుణి యనునతఁడు బ్రహ్మవేత్త యని ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులు తెల్పుచున్నవి. ఉద్దాలక ఆరుణి అని వాని సంపూర్ణ నామధేయము. నింబార్కాచార్యునకు ఆరుణికుఁడను నామాంతరము గలదు గాని యీయన నిన్నఁటి మొన్నఁటివాఁడు. కావున సూత్రకారుని యారుణి యీయన కానేరఁడు.



సూ. య ఇదం నారద ప్రోక్తం శివానుశాసనం విశ్వ సితి శ్రద్ధత్తే, స భక్తిమాన్ భవతి. సః ప్రేష్ఠం లభతే, సః ప్రేష్ఠం లభతే. 84

ఈ గ్రంథము శివానుశాసనఫలముగా నేర్పడెను. కావుననిది 'శాంతం శివమద్వైతం' మను వాక్యంబును దృఢపరచుచున్నది. ఎవఁడు నారద

ప్రోక్తమైన యీ భక్తిసూత్రంబులను విశ్వసించి వానియందు శ్రద్ధాళువగునో వాఁడు భక్తిమంతుఁడై తుట్టతుదకు జీవితపరమావధియైన కల్యాణంబును బడయును.

ఈ సూత్రమందు భావంబెంతో గర్భితమైయున్నది. ఇది కేవలఫలశ్రుతిమాత్రకమని తలంపవలదు.

ఏ శాస్త్రంబునకైనను అధికారి, విషయము, సంబంధము, ప్రయోజనము—ఈ నాల్గును దప్పవు. ఈ శాస్త్రంబునకు అధికారి ఎవరు అనునది ప్రథమాంశము. దీనికి స్త్రీ పురుష వివక్షగాని, కులగోత్ర వివక్షగాని, మఱియెట్టి వివక్ష గాని లేదు. మానవలోకంబెల్ల దీనికి అధికారియగుననుటలో ఈ శాస్త్రసృష్టి యెంత విరివియైనదో యూహింపనగును.

## విషయము

ఈ సూత్రగ్రంథము 'శివానుశాసనము'. శివమనఁగా మాండూక్యోపనిషత్తులోఁ జెప్పఁబడిన 'శాంతం శివ మద్వైతమ్' అని గ్రహింపవలయును. అనుశాసనమనఁగా భక్తులు స్వానుభవపూర్వకంబుగా లోకకళ్యాణార్థము వచించిన శాసనరూపవాక్యంబుల సారాంశమని భావము.

జీవబ్రహ్మైక్యసిద్ధియే యీ శాస్త్రప్రయోజనమని 'ప్రేష్ఠ' శబ్దము సూచించుచున్నది. భక్తియే సాధనమని

'భక్తిమార్గ' శబ్దము తెల్పుచున్నది. ఈ భక్తికి విశ్వాస శ్రద్ధలు రెండును జీవగఱ్ఱలు. విశ్వాసమే చాలదా యన వచ్చును. విశ్వాసము కేవలబుద్ధివిషయము. వినికిడి మున్నగు వానివలన విశ్వాసము పుట్టవచ్చును. అంతమాత్రాననే కార్యసిద్ధి గలుగదు. విశ్వసించినదానిని అనుష్ఠింపవలయును. అనుష్ఠానంబునఁగాని ఫలసిద్ధి గలుగదు. అనుష్ఠానము శ్రద్ధా కార్యము. శ్రద్ధ యనునది విమర్శఫలము. కావున విశ్వాస శ్రద్ధలు రెండుగలిగి భక్తిచేయవలయునని మహర్షి సూచించెను. గురూపదేశంబు ముఖ్యమనుట 'నారదప్రోక్త' మనునది తెల్పుచున్నది. ఇవియెల్ల నున్నను, అంతమాత్రాననే మోక్షానందము సిద్ధింపదనియు, అది భగవదనుగ్రహంబుననే సిద్ధించుననియు 'లభతే' అనునది సూచించుచున్నది.

శ్రీ నారదమహర్షి యీ సూత్రగ్రంథమును రచించి దానిని విశ్వాసశ్రద్ధలతో ననుష్ఠించువారికి భగవదనుగ్రహంబు గలుగుఁగాక అని యిట్లాశీర్వదించుచున్నారు :

శ్లో. నమస్తుభ్యం భగవతే నిర్గుణాయ గుణాత్మనే।
　　కేవలాయాద్వితీయాయ గురవే బ్రహ్మరూపిణే॥

　　యోఽహం మమాస్తి యత్కించి దిహలోకే పరత్ర చ।
　　తత్సర్వం భవతో నాథ చరణేషు సమర్పితమ్॥

శ్లో. పదే పదే యథాభక్తిః పాదయో స్తవ జాయతే।
తథా కురుష్వ దేవేశ నాథ స్త్వం నో యతః ప్రభో ॥

పతి పుత్ర సుహృద్ భ్రాతృ పితృవన్మాతృవద్ధరిమ్।
యే ధ్యాయంతి సదోద్యుక్తా స్తేభ్యోఽపీహ నమోనమః॥

ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః.



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీరామకృష్ణ లీలామృతము

(శ్రీరామకృష్ణుని జీవిత చరిత్ర)

దివ్యమగు ద్వితీయ ముద్రణము.

ముద్దులొలుకు ముద్రణ. సుందరమగు బైండు.

496 పుటలు వెల రూ. 5

## శ్రీరామకృష్ణ బోధామృతము

(సంగ్రహ జీవిత సహితము)

540 పుటలు వెల రూ. 3-4-0

## శ్రీమద్భగవద్గీత

(శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము)

480 పుటలు వెల రూ. 3

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

పండిత పామర రంజకమైన శైలి.

432 పుటలు అందమగు 6-వ కూర్పు. వెల రూ. 3

## శ్రీ శారదాదేవి చరిత్ర

ఇంటింటను ఉండదగిన దివ్యగ్రంథము.

256 పుటలు ముద్దులొలుకు రెండవ కూర్పు. వెల రూ. 1-12-0

## బ్రహ్మానంద బోధనలు

(శ్రీ బ్రహ్మానందస్వామి జీవితోపదేశములు)

శ్రీ బ్రహ్మానందస్వాములవారు శిష్యులకు బోధించిన పరమార్థబోధన లీగ్రంథమునఁ గలవు. ప్రతివ్యక్తియుఁ జదివి తరింపఁదగిన పవిత్ర గ్రంథము.

344 పుటలు వెల రూ. 3-8-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

(ఆదర్శప్రాయుఁడగు గృహస్థుని జీవితము)

136 పుటలు వెల రూ. 1-4-0

శ్రీ దొడ్డ భాగవతము (మొదటిభాగము) రూ. 5-8-0

శ్రీ దొడ్డ భాగవతము (రెండవభాగము) రూ. 6-8-0

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

| | | | | | రూ. | అ. |
|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | | | | ... | 2 | 8 |
| ప్రబోధరత్నాకరము | | | | ... | 2 | 4 |
| రాజయోగము | | | | ... | 2 | 4 |
| కర్మయోగము | | | | ... | 1 | 8 |
| భక్తియోగము | | | | ... | 1 | 4 |
| వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | | | | ... | 1 | 8 |
| వివేకానంద లేఖావళి (రెండవ భాగము) | | | | ... | 1 | 8 |
| అనుష్ఠాన వేదాంతము | | | | ... | 1 | 4 |
| వివేక సూర్యోదయము | | | | ... | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | | | | ... | 0 | 12 |
| గిరీశచంద్ర | | | | ... | 0 | 12 |
| భక్తిమార్గము | | | | ... | 0 | 8 |
| షికాగో నగరోపన్యాసములు | | | | ... | 0 | 8 |
| గురూపదేశములు | | | | ... | 0 | 8 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ | | | | ... | 0 | 6 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | | | | ... | 0 | 6 |
| నా గురుదేవుడు | | | | ... | 0 | 6 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | ... | 0 | 4 |
| నవీన భారతదేశము | | | | ... | 0 | 4 |
| ముక్తిమార్గము | | | | ... | 0 | 3 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | ... | 0 | 3 |
| శ్రీరామకృష్ణ ఆరాత్రికము | | | | ... | 0 | 2 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | | ... | 0 | 1 |
| యతిగీతము (పద్యకావ్యము) | | | | ... | 0 | 1 |
| నా మతము | 0 0 6 | | డజను | ... | 0 | 5 |
| సింహగర్జన | 0 0 6 | | డజను | ... | 0 | 5 |

శ్రీరామకృష్ణమఠము :: మైలాపూరు :: మదరాసు - 4